# ఎవరన్నారు 'శాంతా' టీకాల కంపెనీ మాత్రమేనని...?

స్వదేశీ ప్రజ్ఞను బహుముఖాలుగా
వెలారిస్తున్న శాంతాగ్రూప్
రథసారథులు
తెలుగువారే...!

క్యాన్సర్, హెపటైటిస్-బి వంటి అనేక భయానక వ్యాధుల
చికిత్సలో ఉపయోగపడే ఇంటర్‌ఫెరాన్ ఆల్ఫా 2
**శాన్ ఫెరాన్**

భారతదేశంలో మునుపెన్నడూ
లేని విధంగా యునిసెఫ్‌కు టీకాల విక్రయం

అంతర్జాతీయ ధార్మిక సంస్థల కోరిక మేరకు
వారి తరఫున టీకాల ఉత్పత్తి

అనుబంధ సంస్థ **శాంతా వెస్ట్**
(అమెరికా) ద్వారా క్యాన్సర్
చికిత్సా మూలకాలపై పేటెంటు

కాంట్రాక్టు పద్ధతిపై ఫారిన్
కంపెనీల తరఫున పరిశోధన



హృద్రోగులకు
అత్యవసర సమయాలలో
ప్రాణదానం చేసే
స్ట్రెప్టోకైనేస్
**శాన్ కైనేస్**

చికిత్సకు లొంగని కాలేయపు వ్యాధి
హెపటైటిస్-బి నివారణకై **శాన్‌వాక్-బి**

చిన్నపిల్లలకు పలుమార్లు టీకాలు వేసే అగత్యం
తప్పించే కాంబినేషన్ వ్యాక్సిన్‌లను అభివృద్ధి చేస్తూ...
కలరా, టైఫాయిడ్, హిబ్, మెనింగోకోకల్
టీకాల రూపకల్పనలో ముందుకు సాగుతూ...

ప్రాణరక్షక ఔషధాలను సామాన్యుడికి
అందుబాటు ధరలో అందించే లక్ష్యంలో భాగంగా
విదేశాలపై ఆధారపడకుండా స్వదేశీ పరిశోధన

## ఔను...
## 'శాంతా'
## టీకాలు కూడా
## తయారు చేస్తుంది...

ఆ మాటకొస్తే శాంతాకు అనేక జాతీయ, అంతర్జాతీయ
ప్రశంసలు, అవార్డులు లభించడానికి తొలి సోపానం
టీకాలను పరిశోధించి, తయారు చేసి, మార్కెట్టు చేయడమే!
శరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే జీవప్రక్రియ ద్వారా తయారయిన బయోటెక్ ఉత్పాదనలు మానవాళికి అనువైనవి. ఆరోగ్యరీత్యా సురక్షితమైనవి.

**బయోఫార్మా రంగంలో ప్రపంచపటంలో భారతదేశానికి స్థానం కలిగించిన ఔషధ సంస్థ శాంతా బయోటెక్నిక్స్**

---

- Pioneers in r-DNA Based Human Healthcare Products in India
- Customised Monoclonal & Polyclonal Antibodies
- Recombinant Protein Development, Manufacturing & Formulation
- Vaccines, Therapeutic Products & Diagnostics
- cGMP Compliant Facility for Manufacturing Biopharmaceuticals
- Nutraceuticals

W.H.O.(Geneva)
Pre-qualified
U.N.Supplier of
Hepatitis-B Vaccine

SHANTHA
BIOTECHNICS PVT. LTD.
www.shanthabiotech.com
3rd Floor, Serene Chambers, Road No.7,
Banjara Hills, Hyderabad - 500 034. A.P., INDIA.
Ph: +91-40-23548507, 23543010, 23608843
Fax: +91-40-23548476
Email: info@shanthabiotech.com

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

65

**Also available on net:**
**www.haasam.com**

ముఖచిత్రం
'స్రవంతి మూవీస్'
నూతన చిత్రంలో
ఛార్మి



## హాస్యం ------ సంగీతం












సినిమా పాటల ప్రత్యేకం




'సెంటర్ స్ప్రెడ్' లో

స్థలాభావం వల్ల ఆపాతమధురం, కొమ్మా కొమ్మా కోకిలమ్మ శీర్షికలను ఈ సంచికలో అందించలేక పోయాం. వచ్చే సంచికనుండి యథావిధిగా ఈ శీర్షికలు కొనసాగుతాయి - ఎడిటర్

పాత పాటల ప్రత్యేకం 70, 71, 72, 73 పేజీల్లో



# మీ జనవాక్యం

'హాసం' ఎవరింట్లోనో కాకతాళీయంగా తిరగేయడం జరిగింది. మొదటిసారి చూడగానే శీర్షికలన్నీ ఆకట్టుకున్నాయి. ఈ మధ్య భోపాల్ వెళ్తూ కావాలని 'హాసం' కొని, కదులుతున్నరైల్లో చదవడం గొప్ప అనుభూతి నిచ్చింది. పాత పాటలని ఇష్టపడే మాలాంటి వారికోసం వాటిని సవివరంగా ప్రచురించడం బాగుంది. వెంటనే సరిగపదమని శీర్షికని పూర్తి చేసేశాను. 'హాసం' క్లబ్ 'ఆలోచన' బావుంది. 'హాసం' సబ్‌స్క్రిప్షన్ కట్టడానికి వివరాలు తెలియజేయగలరు.

**-అనంతలక్ష్మి, మెహదీపట్నం**

**(ఇదే సంచికలో 42వ పేజీలో కూపన్ ఉంది చూడండి. -ఎడిటర్)**

'హాసం'లో ఈ శీర్షిక బావుంది, అని ఒక రెండు మూడు శీర్షికలు పేర్లు మాత్రమే వ్రాస్తారు. కానీ నా వరకు నాకు 'హాసం' లో అన్ని శీర్షికలు చాలా ఇష్టం. అన్నీ తప్పకుండా చదువుతాను. నాకు అన్నిటికంటే సాంగులే బంగారు రాజాలో పాటల ఇమిటేషన్ చాలా ఇష్టం. ఆ ఇమిటేషన్స్ అన్నీ నిజంగా నవ్వొచ్చేట్టుగా ఉంటాయి. డూలిటిల్ (నవలీకరణ) సీరియల్ బావుంది. నా ఫ్రెండ్స్ దాని కోసమే 'హాసం' చదువుతున్నారు. ఇంకా పాటల గురించి మీ విశ్లేషణ మీద నా అభిప్రాయం ఒక మాటలో చెప్పలేనిది. ఇంత మంచి పత్రికను అందిస్తున్నందు కు మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు. **-జి. జ్యోతి,విజయవాడ**

మీరు పంపిన 'వన్స్‌మోర్ ఎన్.టి.ఆర్.' ఆడియో సి.డి.ని ఆనందంగా అందుకున్నాను. ఇంతకు ముందు ఎన్నో పత్రికలకు రచనలు చేసి రెమ్యూనరేషన్ అందుకున్నా ఇదో కొత్త అనుభూతి. ఇక 'హాసం' పత్రిక గురించి చెప్పడానికి మాటల్లేవు. మళ్లీ కొత్త 'హాసం' వచ్చే వరకు పాత సంచికలలోని పాటలన్నీ రాసుకుని, నేర్చుకుని పాడుకోవడం మా దినచర్యలో ఒక భాగమైపోయింది. ఇంట్లోనే కాకుండా మా బ్యాంకు లైబ్రరీకి కూడా 'హాసం' కొంటున్నాను. ఆఫీసరు, గుమాస్తా తేడాల్లేకుండా అందరం జోకులు చదివి నవ్వుకుంటున్నాము.

**-గొల్లపూడి శైలజ, హైదరాబాద్**

ఎమ్బీయస్ ప్రసాద్ గారి డా॥ డూలిటిల్‌లో తెలుగుతనం గిలిగింతలు పెడుతోంది. నా వద్ద ఆ సీరియల్ చూసి నా స్నేహితులు ముగ్గురు 'హాసం' కొనడం మొదలుపెట్టారంటే నమ్మండి. చక్కటి ప్రయోగం. కొనసాగించండి.

**-లక్ష్మీకాంతరెడ్డి, సఫిల్‌గూడా, సికింద్రాబాదు**

'కొమ్మకొమ్మకో సన్నాయి' లో నాగయ్య వ్యాసం చదివాను. పాల్‌ముని ఇటాలియన్ కాదు. అతని తలిదండ్రులు ఆస్ట్రియాదేశస్థులు. అతను అమెరికాలోనే పుట్టాడు. గ్రేటాగార్బో జర్మన్ కాదు. స్వీడన్ దేశస్థురాలు. యుక్తవయసులో అమెరికా వచ్చి స్థిరపడిపోయింది.

'తాయ్ ఉళ్ళమ్' మోడర్న్ థియేటర్స్ వారిది కాదు, నారాయణన్ ఫిలిం కంపెనీ వారిది. దానికి సంగీతం వి.నాగయ్య, అద్దేపల్లి రామారావు. 'నాగయ్య గారి అభిమానులుగా మారిన ఎందరో సంగీతదర్శకులైనారు' అని వ్యాసంలో పేర్కొన్నారు. అందరి సంగతి నాకు తెలియదు కాని జి.రామనాథన్ 1932కే సంగీతదర్శకుడు. అప్పటికి నాగయ్య ప్రభావం అతనిపై ఉండటానికి కవకాశం లేదు. అలాగే గాలి పెంచల నరసింహారావు అంతకు మునుపే ప్రసిద్ధుడు, సిద్ధహస్తుడు. **-వే.ఆ.కృ.రంగారావు, చెన్నై**

'హాసం' పత్రిక అత్యద్భుతంగా వస్తూ మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంటుంది. చదువుతున్నంతసేపూ బాల్యం గుర్తొచ్చి మదిలో ఎన్నో పులకింతల పువ్వులు పూస్తున్నాయి. చక్కిలిగింతల హాస్యం, సాహిత్య, సంగీతాలపై విశ్లేషణ చాలా బావుంటున్నాయి. భువనచంద్ర, వేటూరి, రావికొండలరావు, సింగీతం, జమునా రమణారావు, చిత్తరంజన్ గార్లకు కృతజ్ఞతలు. ముంబైలో మాకు 'హాసం' కాపీలు సరిగా దొరకటం లేదు. రెండుమూడు నెలలకొకసారి ఆంధ్రా వచ్చినప్పుడు దొరికినన్ని సంచికలు తెచ్చుకుని చదువుకుంటున్నాము.

**-ఎల్.వి.భవానీప్రసాద్, ముంబై**

**(ముంబై ఏజంటు శ్రీ కదిరేశన్‌ను సంప్రదించండి. ఫోన్ నెం.- 241226057 )**

కళ్యాణి ముఖచిత్రం చాలా బాగుంది. తెలుగింటి హుందాతనం వెల్లువిరిసింది. చంద్రబోస్‌తో కీరవాణిగారి పరిచయాన్ని మా కళ్లముందే జరిగినట్టు ఎంతో చక్కగా ప్రచురించి నందుకు ధన్యవాదాలు. పాత సినిమా పాటలను గుర్తుచేసి, ఆ సినిమాలను మళ్లీ చూసేలా చేస్తున్నందుకు చాలా చాలా థ్యాంక్స్.

**-ఎం.దుర్గాప్రసాద్(ఊరి పేరు రాయలేదు)**

మూడేళ్ల మా మనుమడికి డా॥డూలిటిల్ సీరియల్ విపరీతంగా నచ్చేసింది. వాడికి చదివి వినిపించే మిషతో నేనూ బాగా ఎంజాయ్ చేస్తున్నాను. చిక్కు ఎక్కడ వస్తోందంటే 'హాసం' 15 రోజులకు ఒక్కసారే వస్తుందని వాడికి అర్థం కాదు. రోజూ వచ్చి 'పాయసం (హాసం పలకడం రావటం లేదు) ఇవాళ వచ్చిందా?' అని అడుగుతూంటాడు.

**-జయంతి సత్యవతి, కాప్రా, సికింద్రాబాదు**

దినదిన ప్రవర్థమానవుతున్న 'హాసం'కు శుభాకాంక్షలు. ఆపాత మధురంలో 'వరుడుకావాలి' పాటలనెప్పుడు పరిచయం చేస్తారా అని ఆశగా ఎదురుచూస్తున్నా. 'రాగమాలిక' అనే డబ్బింగ్ చిత్ర రాజానికి మీ వ్యాఖ్యానం వినాలని వుంది. ఏదో ఒకనాడు చెయ్యకపోతారా అని ఆశ! అన్ని పాటలను కాకపోయినా కనీసం "పూవైపుట్టి...పూజే చేసి" పాటను పరిచయం చెయ్యరూ? నేనెదురు చూస్తున్న మరొక ఆపాత మధురం "దేవాంతకుడు". **-ఏ.కామేశ్వరరావు, హైదరాబాద్**

**('వరుడు కావాలి' పాటలను పరిచయం చేసే అవకాశాలు తక్కువ. స్వర్గీయ ఎన్.టి.ఆర్. నటించిన దేవాంతకుడులోని పాటలు ఆపాతమధురంలో తప్పకుండా వస్తాయి. రాగమాలికలోని 'పూవైపుట్టిపూజే చేసి' పాటను పరిచయం చేసే అదృష్టం కోసం మేం కూడా ఎదురుచూస్తున్నాం. తెలుగు పాటకన్నా ముందు విడుదలైన ఆ పాట తమిళ వెర్షన్ దాదాపు 20 సంవత్సరాలుగా మా వద్ద భద్రంగా ఉంది కూడా - ఎడిటర్)**

16-31 హాసం సంచికలో ఆకట్టుకోని పేజీ లేదు. ముఖ్యంగా ప్రముఖ గాయని ఉష గారితో, ప్రముఖ సంగీత దర్శకులు కోటి గారితో ఇంటర్వ్యూలు బాగా ఆకట్టుకున్నాయి. కోటి గారి ఇంటర్వ్యూలో ఇళయరాజా గారికి జాతీయ స్థాయి గుర్తింపుకు కారణం మణిరత్నం లాంటి దర్శకులు అని చెప్పారు. కానీ నిజానికి నాయకుడు సినిమా ఇళయరాజా గారికి 400వ చిత్రం. అదే సినిమాకి మణిరత్నం "మౌనరాగం" మణిరత్నంగానే పరిచయం. కాబట్టి ఇళయరాజా గారి గుర్తింపుకు ఆయన ప్రతిభ మాత్రమేనని గ్రహించాలి.

**-ఎస్.వి.ఎస్.ఎస్.భాస్కర్, రాజమండ్రి**

'హాసం' పత్రిక చాలా బావుంటుంది. గోపాలకృష్ణ గారి కార్టూన్‌లు బాలా బాగుంటున్నాయి. వారి గీతల్లో మెచ్యూరిటీ బాగా కనిపిస్తుంది.

-కె.సుగుణాకరరావు,పాతకార్టూనిస్ట్,విశాఖపట్నం.

తనదైన ముద్రను జనం గుండెలపై బలంగా వేసిన 'హాసం' పత్రిక మే 16-31 సంచిక తెరిచినపుడు నా రక్త ప్రసరణలో ఉల్లాసం పుప్పొంగింది.

నేను, అన్నయ్య అశోక్‌తేజను సమీపంగా వుండి చూస్తున్నవాణ్ణి... నా పుట్టుక కన్నా ముందు జరిగిన సంఘటనలు, తదుపరి సినీ ప్రస్థానం జరిగినది, జరిగినట్టుగా హృదయపు తెరమీద 'హాసం' వ్యాసం అక్షర దృశ్యాలతో చూపించింది.

తెర వెనుక వుండే సాంకేతిక నిపుణుడికి ఇంత కన్నా అద్భుతమైన కానుక 'అమ్మ' కూడా ఇవ్వలేదు. ఎందుకంటే కన్న కొడుకు జన్మదిన వేళ పక్కింటివారికో, పక్క వీధి వారికో స్వీట్లు పంచుతుందేమో కానీ తెలుగువారందరికీ ఇలా 'అక్షర' కేకులు అందివ్వలేదుగా...

శ్రమతో ఎదుగుతున్న వారి జీవితాలను, శ్రమించే జూనియర్స్‌కి స్ఫూర్తిగా అందివ్వడం - అత్యున్నత ప్రయోగం. రాజాగారు ఆరంభించిన ఈ జన్మదిన వేడుకల పరంపర తెరవెనుక కళాకారుల పాలిట వరం. వీరు సదా సహస్రదా అభినందనీయులు.

**-ఎస్సెస్. తేజ, హైదరాబాద్.**

సంపుటి: 3 సంచిక:17

**1-15 జూన్ 2004**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 400

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక

65

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

మేనేజర్
పి.గిరి
చీఫ్ లే-అవుట్ డిజైనర్
జి.రాజేష్

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

గతపక్షంలో కేంద్రంలోను, రాష్ట్రంలోను కొత్త ప్రభుత్వాలు కొలువుదీరాయి. అంచనాలకు అందని రీతిలో సామాన్య పౌరుడు తన తీర్పును వెలువరించాడు. భారతదేశం వెలిగిపోతోందన్న ప్రచారం హోరెత్తించినా, నిలువెత్తు కటౌట్లు నిలిపినా, డబ్బును సారావలె ప్రవహింపజేసినా అతడు ఒక అభిప్రాయం ఏర్పరచుకుని దాన్ని నిశ్శబ్దంగా అమలు చేశాడు. అతడా అభిప్రాయం ఎలా ఏర్పరచుకోగలిగాడు?

వీధి చివర పోస్టు ఆఫీసు పనివేళలు తెలియనివారికి సైతం సమాచార సాధనాల పుణ్యమాని వరల్డ్ బ్యాంకు గురించి, వారిచ్చిన ఋణాల మొత్తం గురించి, విధించిన షరతుల గురించి తెలిసింది. ఉచిత విద్యుత్తు సాధ్యాసాధ్యాల గురించి, ఇరిగేషన్ ప్రాజెక్టులలో నీటి పారుదల పరిమాణం గురించి, బడ్జెట్ ప్రాధాన్యతల గురించి - అనేక విషయాలు తెలిసాయంటే సమాచార సాధనాల చలవే! పేపర్లలో మానిఫెస్టోల గురించి చర్చలు, టీవీలో అధికార, ప్రతిపక్ష నాయకుల వాదోపవాదాలు, ఈ తర్జనభర్జనలలో లేవనెత్తిన సాంకేతికాంశాలు -ఇవన్నీ ఓటర్లను చైతన్యవంతం చేశాయి.

ఇంత సమాచారం పోగుపడ్డాక ఏ నిర్ణయం తీసుకోవాలి అన్నది ఓటరు విజ్ఞతపై, అనేక ఇతర అంశాలపై ఆధారపడి వుంటుంది. గెలిచిన వారికి, ఓడిన వారికి 5-6 శాతం ఓట్ల తేడా మాత్రమే ఉంటుంది. కాబట్టి ప్రజలందరూ ఏకాభిప్రాయంతో లేరని, ఎవరి తర్కం వారుపయోగించారని తెలుస్తోంది. ప్రజలు ఈ విషయంలో విజ్ఞానవంతులు కావడమే ఇక్కడ ముఖ్యం. దానికి సమాచార సాధనాలు దోహదపడ్డాయన్నది గమనార్హం.

ఎలక్ట్రానిక్ రంగంలో వచ్చిన సాంకేతిక విప్లవం కారణంగా టీవీ జన జీవితంలోకి చొచ్చుకుపోయింది. తామెన్నుకున్న ప్రజాప్రతినిధులు అసెంబ్లీలో సమస్యలను ఎంత ప్రతిభా పాటలవాలతో లేవనెత్తుతున్నారో ప్రత్యక్షప్రసారం ద్వారా ఓటర్లు తెలుసుకుంటున్నారు. బుల్లితెరపై ముఖాముఖీ చర్చలు చూసి వారి వాగ్ధాటిని, ఆలోచనా విస్తృతిని అంచనా వేస్తున్నారు. కొన్ని సంవత్సరాలుగా ప్రజాప్రభుత్వాలు బడ్జెట్‌ల ద్వారా ఎలక్ట్రానిక్ రంగానికిచ్చిన రాయితీల వల్ల టీవీలు, కేబుల్ నెట్‌వర్క్‌లు, కంప్యూటర్లు చాలామందికి అందుబాటులోకి వచ్చాయి కాబట్టే ఈ సౌలభ్యం కలిగింది.

కానీ పత్రికా రంగంలో చేయవలసినది ఎంతో మిగిలిపోయింది. కనబడి, అంతలోనే మాయమయిపోయే టీవీ తెర దృశ్యం కంటె వార్తా ప్రతికలు, మ్యాగజైన్లు ప్రజలపై చెరగని ముద్ర వేస్తాయి. సమయం దొరికినప్పుడు చదువుకోవడానికి, ఒకటికి రెండుసార్లు చదివి గుర్తు పెట్టుకోవడానికి, దాచుకుని రిఫర్ చేసుకోవడానికి 'అక్షరానికి' సాటి మరేదీ లేదు. క్షరము-అంటే నాశము - లేనిదే అక్షరం.

ప్రజలను విద్యావంతులను చేసినకొద్దీ ప్రజాప్రభుత్వాలు మరింత సమర్థవంతంగా పరిపాలించగలుగుతున్నాయి. అవసరాల దృష్ట్యా ప్రభుత్వం కొన్ని కరకు నిర్ణయాలను తీసుకొనవలసి వచ్చినపుడు వివేకవంతులైన ప్రజలు మాత్రమే అర్థం చేసుకోగలుగుతారు, సానుభూతితో సహకరిస్తారు. మూర్ఖుని మనసు రంజిల్లింపజేయలేమన్నారు పెద్దలు. విద్య గరపి, సమాచారాన్ని పంచి మూర్ఖత్వాన్ని పారద్రోలినప్పుడే పాలకులు ప్రజారంజకులవుతారు.

అందువలన సమాచార సాధనాలన్నిటికీ ప్రభుత్వాలు ప్రాధాన్యత ఇవ్వాలి. ప్రజలు వార్తాపత్రికలు, మేగజైన్లు, విజ్ఞానాన్నందించే పుస్తకాలు, విరివిగా కొని చదివే దిశలో చొరవ చూపాలి. టీవీ కానీ దినపత్రికలు కానీ భారీ పెట్టుబడి లేనిదే అడుగు ముందుకు పడని పరిస్థితి. అంత భారీ పెట్టుబడి పెట్టాక వాణిజ్యపరమైన ఒత్తిళ్లను కాదని ఆదర్శాలకు కట్టుబడడం అలవికాని పని. అందువలన ప్రజలను చైతన్యవంతులుగా చేయగలిగేవి చిన్న పత్రికలే, వ్యక్తిగతంగా ప్రచురించే పుస్తకాలే! వీటికి ప్రోత్సాహకాలిచ్చి నిలబెట్టడం ప్రభుత్వం తన బాధ్యతగా గుర్తించాలి.

ముద్రణారంగం, ప్రచురణారంగంలో ఉన్న వారికి పేపరు కొరత గురించి, ముద్రణా సామగ్రి ధరల గురించి ఒక అంచనా వుంటుంది. చైనాబజార్ల పేరు చెప్పి ప్రతి వస్తువు కారుచౌకగా అమ్మే ఈ రోజుల్లో కూడా న్యూస్‌ప్రింటుకు కొరతే! పదిమందికి పనికివచ్చే ఎన్‌సైక్లోపీడియాను తెలుగులో వేయిద్దామని ఎవరైనా ముచ్చటపడితే ఆస్తి తెగనమ్ముకోవలసినదే!

విద్యను, విజ్ఞానాన్ని ప్రీమియమ్ రేట్లలో కొనుక్కోవలసిన ఈ దుర్భర పరిస్థితి ఇప్పటికైనా పోవాలి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పూనుకుని పేపరు లభ్యతను పెంచాలి. పాఠ్యపుస్తకాలు, విజ్ఞాన, వినోదదాయక పుస్తకాలు, పత్రికలు సరసమైన ధరలకు దొరికేట్లా చర్యలు తీసుకోవాలి. ఇది త్వరలో ఆర్థిక విధానాలను ప్రకటించబోతున్న కొత్త ప్రభుత్వాలకు 'హాసం' విజ్ఞప్తి.

ప్రముఖ సినీ గీత రచయిత

**శ్రీ భువనచంద్ర**

'హాసం' పాఠకుల కోసం

ప్రత్యేకంగా రాస్తున్న

## మా ఆవిడ ఇంతే మరి మీ ఆవిడ?-10



# జగడ జగడ... జగడ జగడజాం...!

అసలే లేటు....! అందునా ఆదివారం. మరింకేం ! హాయిగా ఎనిమిదిన్నరకి వాకింగ్‌కి బయలుదేరి జనాల్నందర్నీ పలకరించి తొమ్మిదిన్నరకి ఇంటి ముఖం పట్టా ! గేటు తియ్యంగానే ఘుమ ఘుమా ! శనివారం చేయాల్సిన పెసరట్టుప్మా ఆదివారానికి షిఫ్టయ్యింది. 'ఆహా' అనుకుంటూ బాత్రూంలో దూరాను. "రామ్‌చంద్ర్ కెహ గయా సియాసే" అనుకుంటూ గట్టిగా ఓ పాట మొదలెట్టా. పక్కింటి బాత్రూంలోనించి "ఉన్ కణ్ణిల్ నీర్ వరిందాల్... ఎన్నెంజిల్ ఉదిరం కొట్టుదడీ" అని పక్కింటావిడ పాడటం మొదలెట్టింది. ఛీ.. లాభం లేదని..."సంగమం...సంగమం..త్రివేణీ సంగమం..శృంగారప్పదమాడుం యామం..." అని మళయాళం పాట శృతి చేశా. వెనుక వేపు బాత్రూంలోంచి ఇంకో ఆవిడ "తొట్టాల్ పూమలరుం..." అని సూపర్‌గా పాడ్డం మొదలెట్టింది. "ఇదుగో... బాత్‌రూంలో దూరి ఆ పాటలు పాడొద్దన్నానా?" తలుపుకొట్టి అరిచింది మా ఆవిడ. ఠక్కున నోరు మూసేశా. విచిత్రంగా మిగతా వాళ్లూ ఆపేశారు.

దేముడికో దీపం వెలిగించి వచ్చేసరికి అల్లం పచ్చిమిర్చి దట్టించిన నేతి పెసరట్టు కన్నుల పండుగ్గా కనిపించింది. ఇంకా బొంబాయి రవ్వ ఉప్మా అయితే..."రా రా నా రాజా..." అంటూ జీడిపప్పుల్తో కవ్వించింది. యీ యొక్క పెసరట్టు ముక్కని ఆ యొక్క ఉప్మాతో నింపి ఆ పక్కనున్న అల్లంచెట్నీలో ముంచి నా యొక్క నోట పెట్టగానే ....వా...హ్...!

"తొందరగా కానిస్తావా? ఇప్పటికి మూడుసార్లు నీ కోసం నటరాజనూ, వరదరాజనూ వచ్చారు !" అంది నా పెళ్లాం ఈసారి ఉల్లి పెసరట్టు వేస్తూ.

"ఎందుకు? మహత్తరంగా వున్న మరో పెసరట్టు ముక్కని అల్లం చెట్నీలో ముంచుతూ అడిగా.

"తంబిదురైని అసోసియేషన్‌కి పిలిపిస్తారుట..!" కొబ్బరి చట్నీవంక వేలు చూపిస్తూ అంది మా కూచిపూడిది.

(మా ఆవిడ పెసరట్టుతో పాటు అల్లంచెట్నీనే కాక కొబ్బరి చెట్నీ కూడా విధిగా చేస్తుంది. చిన్న పెళ్లాన్ని మరిగిన రాజు పెద్ద పెళ్లాన్ని ఎలా పట్టించుకోడో...అల్లంచెట్నీ పెసరట్టు వున్న రోజున నేను కొ॥చె॥ని కొంచెం కూడా పట్టించుకోను)

నేను నోరు విప్పేలోగానే "ఎన్న టీసీ సారూ... ఇన్నుంరెడీ కాలేదా" అంటూ వరదరాజనూ, నటరాజనూ వచ్చేశారు. (మాంచి టిఫెన్ తినేటప్పుడు ఇలా డిస్టర్బ్



చెయ్యకూడదని అరవ్వాళ్లకి ఎలా చెప్పడం?) మొత్తానికి లుంగీ షర్టులోకి మారి బయటకొచ్చా.

"తంబిదుర్రైని అసోసియేషన్‌కెందుకూ పిలవడం?" నటరాజన్నడిగా.

"అదేమిసారూ...మీకు తెలీదా? రెండునెల్లుగా వారానికి రెండుసార్లు ఫుల్‌గా మందేసి పెండ్లాన్ని తంతా వున్నాడు. ఆయమ్మ నోరు విప్పదుగానీ పిల్లోళ్లు ఒకటే ఏడుపు...! ఇలాగే ఒదిల్తే ఆ ఆండ బిడ్డ ఏదో ఓ నాడు సచ్చిపూడుస్తాది...!" నా వంక ఆశ్చర్యంగా చూస్తూ అన్నాడు నటరాజన్.

"పోలీసోండ్లకి ఓ ఫోన్ కొడితే పబ్లిక్ న్యూసెన్స్ కింద తంబిదుర్రైని మూసేస్తారుగానీ - మంచి ముండావాడు గదా అని మన అసోసియేషన్‌కి పిలుస్తున్నాం..!" వివరించాడు వరదరాజన్.

తంబిదుర్రై బి.ఎస్.ఎన్.ఎల్.లో జె.ఇ. చాలా మంచివాడు. ఆవిడ ఎప్పుడూ ఇంట్లోనే ఉంటుంది. ఆవిడ మొహం ఎలా ఉంటుందో కూడా చాలా మందికి తెలీదు. ఇక తంబిదుర్రై మొహం చూస్తే 'ఈ మనిషి అసలు ఎవర్నైనా కోప్పడగలడా?' అనిపిస్తుంది. అలాంటి వాడ్ని అసోసియేషన్‌లో పెడతామనగానే మనసు చివుక్కుమంది.

"అసలు తంబిదుర్రై తాగడుగా...!" అడిగా. ఎందుకంటే రెండుమూడు సార్లు మా పార్టీలకి వచ్చినా కోకాకోలా తప్ప ఏం పుచ్చుకోలేదు.

"అదే సారూ విచిత్రం ! రెండ్నెల్లుగా వారానికోసారో రెండుసార్లో తాగొచ్చి మరీ పెళ్లాన్ని తంతా వున్నాడు..!" భోగట్టా విప్పాడు నటరాజన్.

అసోసియేషన్ హాలుకి వెళ్లేసరికి ఫుల్లుగా జనాలున్నారు. తంబిదుర్రై ఇంకా రాలేదు కానీ 'చర్చ' మాత్రం హాట్‌హాట్‌గా సాగుతోంది.

"వేలాయుధం సార్...మందెయ్యడం పెళ్లాన్ని తన్నటం మన అసోసియేషన్ పరిధిలోకి రావు. అనవసరంగా మనం తలదూరుస్తున్నాం" అన్నాడు పరమశివం.

"అయినా...మందేశాక ఆ మాత్రం 'గలాటా' చెయ్యకపోతే మజా ఏం వుంటాది సారూ..! తాగాల..! అప్పుడప్పుడు తన్నాల! అదిదా బెస్టు పాలసీ!" పళ్లికిలిస్తూ అన్నాడు నీలకంఠం.

"అందుకేగా అప్పుడప్పుడూ నీ నెత్తి బొప్పెలు కట్టేది !" జోకేశాడు మాతృభూతం అయ్యంగార్. (పరమశివం వుండేది మాతృభూతం ఇంటి పక్కనే. అదీగాక పరమశివం భార్య కూడా 'అంత' సరసురాలు కాదని వినికిడి. మూడ్నెల్లకోసారి అప్పడాల కర్ర మారుస్తూ వుంటుందని పనిమనిషి ప్రచారం చేసింది)

"అసలీ తాగుడు ఎలా అలవాటయిందో ఎవరికెన్నా తెలుసా?" అడిగాడు వేలాయుధం.

"ఆ..! తంబిదుర్రై, సాంబశివన్ మంచి ఫ్రెండ్సు. ఇద్దరిదీ ఒకే వూరు. ఇద్దరూ పనిచేసేది ఒకే డిపార్టుమెంటులో. సాంబశివన్ నేర్పించి వుండాల. అయితే సాంబశివన్ తన మందు తనే కొనుక్కు తాగుతాడుగానీ ఇంకోడిచ్చిన మందు తాగడు.... ఇంకోడికి చస్తే మందు కొనివ్వడు" వివరించాడు తోతాద్రి అయ్యంగార్.

"మీరేమంటారు బీసీసారూ?" అడిగాడు వేలాయుధం.

"అతన్ని పబ్లిక్‌లో నిలదియ్యటం బాగోదు! మెల్లగా పక్కకి తీసికెళ్లి నచ్చచెప్పటం మంచిది!" నా మనసులో మాట నేను చెప్పేశా.

"అయితే మీరే చెప్పండి...! ఎందుకంటే మీరంటే తంబిదుర్రైకి మాంఛి రెస్పెక్టు !" వ్యవహారం మొత్తం నామీద పడేసి నిట్టూర్చాడు వేలాయుధం.

ఇంతలోకి జాతరకి సిద్ధం చేసిన మేకలా తంబిదుర్రై అసోసియేషన్ హాల్లోకి అడుగుపెట్టాడు. నేను లేచి మెల్లగా తంబిదుర్రైని బయటకి తీసుకుపోయా. నడుస్తూ నడుస్తూ మధురవాయిల్ వెళ్లే దారిలో వున్న చింత చెట్టు దగ్గర ఆగా. అక్కడెవరూ వుండరు.

"చూడు తంబిదుర్రై..! మీరెంతో మంచివాళ్లు. పెర్ఫెక్ట్ జంటెల్‌మెన్. ఈ రెండు నెల్లుగా ఎందుకు తాగుతున్నారో ఎందుకు భార్యని అలా కొడుతున్నారో తెలీటం లేదు. తాగటం, మానటం అనేది మీ ఇష్టం. కానీ ఇంటి వ్యవహారం రచ్చకెక్కకూడదుగా? అదీగాక ఏ తగలరాని చోటో దెబ్బ తగిల్తే ఏమవుతుంది ? జన్మంతా ఏడ్చినా ఏం లాభం వుంటుంది ? మిమ్మల్ని అవమానించాలనో, నిలదియ్యాలనో నా వుద్దేశ్యం కాదు. ఒక మంచి మనిషి కళ్ల ముందే చెడిపోతుంటే చూడలేక ఇలా తీసుకొచ్చా. అసలు ప్రాబ్లం ఏమిటీ ?" అనునయంగా అడిగా.

తంబిదుర్రై భోరుమన్నాడు.

"సారూ..! నేను కొట్టాలని పెళ్లాన్ని కొట్టలేదు. నా పెండ్లాం ఎంతో మంచిది. రెండు నెల్లనించీ నన్ను గిల్లి గిల్లి రెచ్చగొడుతోంది. ఎక్కడో దూరంగా వున్న మా అమ్మని సాధిస్తా వుండాది. సారూ... మా అమ్మ నీళ్ల బిందెలు మోసీ, మిషను కుట్టీ నన్ను చదివించింది. అట్టాంటి తల్లిని నా పెండ్లాం చెడ్డ మాటలతో సాధిస్తే నా కెల్లా వుంటాది సారూ? మీ అమ్మని మీ పెండ్లాం తిడితే మీరూరుకుంటారా?" కళ్ల నీళ్లతో అన్నాడు తంబిదుర్రై.



"పోనీ విషయం క్లియర్‌గా మీ ఆవిడతో చెప్పొచ్చుగా?" అడిగా.

"చెప్పాను సారూ. ఆ రోజు సారీ అంటుంది మళ్లీ మామూలే. నాక్కోపం వచ్చి తాగుతా..! తాగాక దాన్ని తంతా..! అసలు తాగుడంటే నాకు అసహ్యం సారూ..!" తలొంచుకున్నాడు తంబిదురై.

"పోనీ ఒక పని చెయ్యండి. మీరు ముందర తాగుడు మానెయ్యండి. ఆవిడ ఏమన్నా పట్టించుకోవద్దు. ఎందుకంటే -మీరు కొట్టే దెబ్బలే బయటికి తెలుస్తున్నాయి కానీ ఆవిడ మిమ్మల్ని పెట్టే బాధ లోకానికి తెలీదుగా? అదీగాక.. ఇలా చేస్తుంటే రేపు మీ పిల్లల సంగతేమిటీ? వాళ్లకి మీ మీద ఎటువంటి అభిప్రాయం డెవలప్ అవుతుంది? అసలు వీధివీధంతా మిమ్మల్ని ఓ తాగుబోతుగా, పెళ్లాన్ని హింసించే మనిషిగా చూడ్డం మీకు బాగుందా?" అతని ప్రస్తుత పరిస్థితి అతనికే వివరించా.

"ఓకే సారూ...! మీరు సొప్పినట్టే వింటా..! మళ్లీ తాగితే మీ మీదొట్టు." ధృఢంగా అన్నాడు తంబిదురై.

నా గుండె ఆనందంతో ఉప్పొంగిపోయింది. నేను చెప్పిన మంచి మాటలవల్ల ఓ వ్యక్తి ఒక నికృష్ట వ్యసనాన్నించి బయట పడబోతున్నందుకు నా మనసు గాలిలో తేలిపోయింది.

"శభాష్ తంబిదురై..! యూ ఆర్ గ్రేట్! తప్పు చెయ్యటం తప్పు కాదు! తప్పు సరిదిద్దు కోవటం నిజంగా గ్రేట్" అంటూ ఏవేవో మాట్లాడి నేను ఉత్సాహపడి - అతన్ని ఉత్సాహపరిచి ఇంటికి పంపి - నేను మాయింటికొచ్చా. మా నటరాజనూ, వరదరాజనూ, పరమశివం నా కోసం ఎదురు చూస్తున్నారు.

జరిగినదంతా వివరించి 'ఒక క్షణంలో' తంబిదురైలో ఎలా పరివర్తన తెచ్చానో మహోత్సాహంగా చెప్పా.




"శభాష్ బీసీసారూ...!మీరు దా రైట్ పర్సన్ అని మాకు తెలుసు..." అంటూ వాళ్లు నను చాలా మెచ్చుకుని మదర్పిత కూల్ డ్రింక్స్ తాగేసి వెళ్లిపోయారు.

వాళ్లని పంపించి లోపలికి వచ్చేసరికి భోజనం 'తయార్'. మెత్తని వేడి వేడి అన్నంలో కొత్తావకాయ కందిపొడీ కొంచెం గోంగూర పచ్చడీ కలగలిపి...కొంచెం పెరుగూ కొంచెం వెన్నా జతపరిచి బుల్లి బుల్లి ముద్దలు నోట్లో పడేసి నములుతుంటే - అబ్బా ! అలా మింగుతూ నా 'విజయకథ'ని మా ఆవిడకి నోరారా వివరించా.(మెచ్చుకుంటుందేమోనని చూశా గానీ.. ఆ లక్షణాలేం కనపడలేదు! అయినా ఏ పెళ్లామైనా మొగుడ్ని మెచ్చుకున్న వైనం ప్రపంచ చరిత్రలో ఎక్కడైనా ఉందా! నా పెళ్లాం మాత్రం ఎందుకు మెచ్చుకుంటుందీ? నేను చేసిన పనే వాళ్లన్నయ్యో, తమ్ముడో చేస్తే మురిసి మురిసి ఎస్.టి.డీ.లు చేసి చుట్టాలకీ పక్కాలకీ వినిపిస్తుంది గానీ నన్నెందుకు అభినందిస్తుందీ?) కోపం వచ్చి మధ్యలోనే చెయ్యి కడిగేద్దా మనుకున్నాగానీ - ఆ పక్క వడియాలు, పచ్చి పులుసూ ఈ పక్క పొట్లకాయ, పెరుగుపచ్చడీ - మధ్యలో అప్పడాలూ, వూర మిరపకాయలూ ఊరిస్తుంటే ఎలా చెయ్యికడిగేదీ? అందుకే ఫుల్‌గా లంచి బిగించి మంచం ఎక్కేశా.

ఓ రెండు వారాల తరువాత మా ఆవిడ అంది...."మీ తంబిదురై మళ్లీ మందేసి పెళ్లాన్ని తన్నాడు తెలుసా?" అని.

నా నవనాడులు కృంగిపోయాయి. (తంబిదురై మందేసి నందుకు కాదు..! ఆ రోజు నేను వరదరాజన్ తోటీ మిగతా వాళ్ల తోటీ తెగగప్పాలు కొట్టినందుకు!) సైలెంటైపోయా.

"అవునుగానీ చింతలపూడాయనా... మొగుడూ పెళ్లాల మధ్య తలదూర్చమని నీకెవరు చెప్పారు? అసలు తంబిదురై బ్రెయిన్‌ని వాష్ చేసేవని అరవ్వాళ్లందరూ నీకెందుకు అంటగట్టారో నీకేమైనా తెలుసా? ఇవ్వాళ వాళ్లు నీ గురించి ఎలా నవ్వుకుంటారో ఊహించగలవా?" రేవు పెట్టేసింది మా ఆవిడ. మొహం వేలాడేసుకుని కూచున్నా.

"సరే సరే..! నువ్వు చేసింది నిజంగా మంచి పనే. పదిమంది ఎదుటా పరువు పోకుండా ఒక మనిషిని నువ్వు పక్కకి తీసుకెళ్లి మంచి మాటలు చెప్పడం చాలా మంచిపనే. అసలు విషయం ఏమిటో తెలుసా? మొగుడ్ని రెచ్చగొట్టి మరీ తన్నులు తినేది తంబిదురై పెళ్లాం..!"

ఇదో షాకు. "నిజంగానా?" అడిగా.

"ముమ్మాటికీ నిజం. తంబిదురై పెళ్లాం పేరు మాలతి. వాళ్ల నాన్న నాలుగు నెలల క్రితం చనిపోయాడు. తల్లీ, ఇద్దరు చెల్లెళ్లూ ఏ దిక్కూ దివాణం లేక వూళ్లో వుంటున్నారు. సొంతిల్లు కూడా లేదు. దాంతో ఆకలికి మలమల లాడుతున్నామనీ, తలదాచుకోవటానికైనా చోటులేదని, దయుంచి ఎంతో కొంత సొమ్ము పంపిస్తే జన్మంతా కృతజ్ఞులుగా వుంటామనీ మాలతీ వాళ్లమ్మ తంబిదురైకి - అంటే - అల్లుడికి ఉత్తరం రాసిందంట. అది చూసి మనవాడు 'మా అమ్మ నన్ను నీళ్ల బిందెలు మోసీ, మిషనుకుట్టీ పెంచిందిగానీ ఇలా బిచ్చం అడుగుతూ పెంచలేదు.... అయినా ఒకసారి మనం జాలితో పంపితే అదే వాళ్లకి అలవాటైపోతుంది... ఆ తరువాత జన్మంతా వాళ్లని పోషించే భారం మన



మీదనే పడుతుందని' నానా గలాటా చేశాట్ట. పాపం మాలతి ఏం చెయ్యగలదు? ఓ రెండ్రోజుల తరువాత సాంబశివన్ పుట్టిన రోజని బలవంతం చేస్తే తంబిదురై తాగి ఇంటికి వచ్చాడుట. ఆనాడు మాటా మాటా పెరిగి ' మీ అమ్మ నీళ్ల వోసి పెంచిందని మీరు గొప్పగా చెప్పుకుంటున్నారు... అలాగే కొద్దో గొప్పో మీరు మా యింటికి సద్దితే మా అమ్మకూడా ' నా అల్లుడు రెక్కల కష్టం మీద మమ్మల్ని బతికిస్తున్నాడ'ని గొప్పగా చెప్పుకుంటుంది గదా' అని అందిట. దాంతో మీ అమ్మకీ మా అమ్మకీ పోలికా అని తిట్టి కొట్టాట్ట. మరుసటి రోజున పెళ్లాన్ని కొట్టినందుకు సిగ్గుపడి ఓ అయిదొందలిచ్చి చీరో సారో కొనుక్కోమన్నాట్ట. ఆ డబ్బుని మాలతి ఇంటికి పంపించింది. అప్పట్నించీ ఎప్పుడు తన తల్లికి ఎం.ఓ. పంపాలన్నా కావాలని మొగుడ్ని రెచ్చగొట్టేదట. దాంతో తంబిదురై తాగటం - పెళ్లాన్ని కొట్టడం - ఆ మరుసటి రోజున ఎంతో కొంత పరిహారంగా ఇవ్వటం జరుగుతోంది!'' మొత్తం కథ వివరించింది మా ఆవిడ.

''ఇదంతా ఎవరు చెప్పారు?'' అడిగా.

''ఇంకెవరూ? మాలతే ! నువ్వు తంబిదురైని పక్కకి తీసుకెళ్లి తాగుడు మాన్పించావు. నువ్వు చేసిన పనివల్ల వాళ్లమ్మ చెల్లెళ్ల నోట్లో మట్టిగడ్డ మిగిలిందని మాలతి నా దగ్గర భోరుమంది..!''

''అంటే ? తన తల్లినీ చెల్లెళ్లనీ పోషించుకోవటానికి మొగుడ్నీ తాగుబోతునీ, వెధవాయినీ చెయ్యాలా? అసలా మాలతి ఆడదా? గాడిదా?''




కోపంగా అరిచా.

''నువ్వు మరీ అంత ఆవేశపడఖర్లా..! ఇంకో పదహారు జన్మలెత్తినా తంబిదురై తాగుబోతు కాలేడు. అతను అరపెగ్గు తాగి ఆరుగంటలు ఊగే టైపని సాంబశివన్ చెప్పాట్ట. మందు స్టామినా గురించి గొప్పలు చెప్పుకోడం మీ మగాళ్లకి మామూలేగా..!''

''నువ్వేన్నన్నా చెప్పు...! మగాడి వీకెనెస్‌ని ఆయుధంగా మలుచుకోవడం చాలా అసహ్యకరమైన విషయం'' నాకు కోపం తగ్గలా.

''అసహ్యం కంటే అమ్మ చెల్లెళ్ల మీద జాలిపడటం మంచిది. మగవాడిగా కంటే మనిషిగా ఆలోచిస్తే తంబిదురై చేసేదీ తప్పే. చిన్నతనంలో పడ్డ కష్టాలు మనిషిలో మానవత్వాన్ని పెంచాలిగానీ నిర్దయని కాదు. అతనూ కాస్త జాలిపడి కొద్దో గొప్పో సహాయం చేస్తే మాలతి ఇంత నీచానికి సిద్ధపడదుగా?''

''అయితే ఎంత కాలం ఇలా? ఇవ్వాళ అరపెగ్గుతో ఊగేవాడు లైఫ్‌లాంగ్ అక్కడే ఆగడుగా?''

''అది తెలిసే మాలతిని కేకలేశా...! తల్లీ చెల్లెళ్ల కోసం మొగుడి వీక్‌నెస్‌తో ఆటలాడకూడదని నచ్చ చెప్పా. విన్నది. అన్నట్టు మాలతికి అల్లికలూ కుట్లూ అవీ వచ్చు. మా మహిళా మండలి వాళ్లందరం ఆవిడదగ్గరే టేబుల్ క్లాతులూ, కర్టెన్లూ కొంటామని చెప్పాం...! సో...ఇక పైన తంబిదురై తాగి పెళ్లాన్ని కొట్టే అవకాశం రాదనే అనుకుంటున్నాం..!'' చిద్విలాసంగా అంది మా ఆవిడ.

ఇదంతా జరిగిన నాలుగు రోజులకి మళ్లీ వరదరాజన్ పరిగెత్తుకుంటూ వచ్చి " బీసీ సారూ... పరమశివం పెళ్లాన్ని తన్నాడుట.. ఆవిడా తిరగబడి ఒకటిచ్చిందంట..! మనవాడు వాళ్లావిడ మేటర్ అసోసియేషన్లో పెడదా మంటున్నాడు.... ఓకే నా" అన్నాడు.

''సారీ అది ఆడవాళ్ల విషయం...! అసోసియేషన్ పరిధిలోకి రాదు..!'' అన్నా.

**(నాకూ ఓ కంప్లైంటుంది..! 'హాసం' ముందుకు తెద్దునా?)**

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటి జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

6

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

'పగలే వెన్నెలా' పాటలో నారాయణరెడ్డి గారి గొప్పతనం ఏమిటంటే- అసలు ఆ పాటకి ఆయన్నే అర్థం అడిగి తెలుసుకోవాలి. పగటి పూట అసలు వెన్నెల ఎలా వస్తుంది. రాదు కదా! రాత్రి పూట వెన్నెల ఉంటుంది. అయితే సాహిత్యపరంగా చూస్తే ఎంతో లోతైన అర్థం ఉంది అందులో. రాజేశ్వరరావు గారు కూడా చాలా గొప్పగా ట్యూన్ చేశారు - 'ఆధా హై చంద్రమా'ను గుర్తు చేస్తూ ! జానకి గారు ఫీల్ అయి మరీ పాడారు. హమ్మింగ్ కూడా గొప్పగా హై పిచ్‌లో పాడారు. సుశీల, జానకిగార్లను నేను బాగా లైక్ చేస్తాను. ఇక్కడ జానకి గారి గొప్పతనం ఏమిటంటే - ఎంత హై పిచ్‌లోకి వెళ్లినా భావం చెదరదు. కొంత మంది హై పిచ్‌లోకి వెళ్తూనే భావం పోయి ఒట్టి రాగమే ఉంటుందక్కడ. నేను చాలా మందిని అబ్జర్వ్ చేశాను. జానకి గారి గొప్పతనం అదే. మురిపించే మువ్వలు లో 'నీ లీల పాడెద దేవా' పాట కూడా ఎంతో గొప్పగా పాడారు. హాట్సాఫ్ టు జానకి.

'పగలే వెన్నెలా' - ఆ పాట నిజంగా ఎంత పాపులర్ అయిందంటే - ముఖ్యంగా అమెరికాలాంటి దేశాల్లో నేను పర్యటించినప్పుడు బాగా గమనించాను.... సామాన్యంగా కల్చరల్ గెట్ టు గెదర్స్,

## పూజా ఫలము

రచన: సి. నారాయణ రెడ్డి    సంగీతం: యస్. రాజేశ్వరరావు

పగలే వెన్నెల - జగమే ఊయెల
కదలే ఊహలకే కన్నులుంటే
పగలే వెన్నెల - జగమే ఊయెల
నింగిలోన చందమామ తొంగిచూచె
నీటిలోన కలువభామ పొంగిపూచె
ఈ అనురాగమే జీవనరాగమై
ఎదలో తేనెజల్లు కురిసిపోదా ॥పగలే॥
కడలి పిలువ కన్నెవాగు పరుగుదీసె
మురళిపాట విన్న నాగు శిరసునూపె
ఈ అనుబంధమే మధురానందమై
ఇలపై నందనాలు నిలిపిపోదా ॥పగలే॥
నీలిమబ్బు నీడలేచి నెమలి ఆడె
పూల బుతువు సైగచూచి పికముపాడె
మనసే వీణగా ఝుణఝుణ ప్రాయగా
బ్రతుకే పున్నమిగా విరిసి పోదా ॥పగలే॥











'పూజాఫలం' చిత్రంలో...







కల్చరల్ ఆర్గనైజేషన్స్ వారు కండక్ట్ చేసే ప్రోగ్రామ్స్‌లో చాలా మంది అమ్మాయిలు ఈ పాటని పాడటం తటస్థించింది. అమెరికా పర్యటనలోనే...ఎక్కడో గుర్తు లేదుగానీ ఒకచోట మాత్రం ఆ పాట నా చే ఆర్కెస్ట్రాతో పాడించారు. జానకి గారు పాడినట్టు నేనెలా పాడతానండీ అంటే - మీరు పాడాలి ఆ పాట మేము వినాలి అని నాచేత మొదలు పెట్టించారు. సరే...'పగలే వెన్నెలా' అని పల్లవి మొదలు పెట్టాను. తరువాత చరణాలు గుర్తుకు రాలేదు. వాళ్లే అందిస్తూ ఉంటే కొంత పాడాను. తరువాత ఒక అబ్బాయి చేతిలో ఆ పాట స్క్రిప్టు ఉంటే మిగతాది చూసి పాడేశాను. జానకి గారు వింటే భయపడి పారిపోయేవారేమో. అమెరికాలో చాలా చోట్ల సుశీల, జమునారాణి గార్ల ప్రోగ్రామ్స్‌లో వాళ్లు పాడిన పాటల్ని మధ్యలో స్టేజ్‌పైకి పిలిపించి పాడిస్తూ ఉండేవాళ్లు. ఈ మధ్య 'జమున హిట్స్' అని హెచ్.ఎం.వి.వాళ్లు ఒక క్యాసెట్ వేశారు. దానిమీద పేరు 'పగలేవెన్నెలా'. అలాగే నారాయణరెడ్డి గారి పాటల సంకలనం కూడా 'పగలే వెన్నెలా' అంటూ వచ్చింది. ఈ సినిమాలో క్యారెక్టర్ లెంగ్త్ పరంగా చిన్నదే అయినా స్ట్రెంగ్త్ పరంగా పెద్ద క్యారెక్టర్ అనే చెప్పాలి.

నే నూ నా పా ట లు



చిత్రం : వీరకంకణం | రచన : ఆరుద్ర
సంగీతం : సుసర్ల దక్షిణామూర్తి | గానం : ఏ.ఎం.రాజా, జిక్కి



కట్టండి వీరకంకణం
పట్టండి ధర్మఖడ్గమే
దేశభక్తి చూపుటకై
దుర్మార్గుల బాపుటకై ॥కట్టండి॥
స్వార్థపరులు పెచ్చురేగి
స్వదేశమునే పీడించగ ॥స్వార్థ॥
చూసి వూరకుందురా
లేచి శక్తి చూపరా



కట్టండి వీరకంకణం ॥3॥
భద్రకాళివంటి వీర
రుద్రమాంబ మన సోదరి...మనసోదరి ॥భద్ర॥
కొంచెమైన జంకనట్టి ॥భద్ర॥
మాంచాల మన చెల్లెలు



ప్రమాదమున దేశమున్న
ప్రాణమైన యిచ్చుటలో
ఆడువారు వెనుకాడరు - ॥2॥
ఓడిపోవుటే ఎరుగరు ॥2॥ ॥కట్టండి॥
కట్టండి వీరకంకణం - ॥4॥



పట్టండి ధర్మఖడ్గమే
తెలుగు కీర్తి నిలుపుటకై
దేశభక్తి చూపుటకై ॥కట్టండి॥

చిత్రం : వీరకంకణం | రచన : ఆరుద్ర
సంగీతం : సుసర్ల దక్షిణామూర్తి | గానం : ఘంటసాల, జిక్కి

అతడు : రావే...రావే...
పోవు స్థలం అతి చేరువయే
నా రాణి ॥పోవు॥



ఆమె : ఆహా - చల్లగా వీచును గాలి
అంతయు వింతగ తోచునే ॥ఆహా॥
అతడు : ఇంతకుమించిన వింతదనాలు
చెంతకు చేరుట నేడే - ఇంత చూడే॥రావే॥
ఆమె : తనివి తీరునా - మేను తిరుగునా ॥తనివి॥
మమతలే మైకముగ మారునే



అతడు : సుఖముగా మేను మరచుట॥సుఖముగా॥
గిరిశిఖరమందునే - రావే రావే...
ఆమె : హాయిగా ఇకను మనసు తీరగా
స్వర్గ సౌఖ్యమే చూద్దాం... ॥హాయిగా॥
అతడు : నీకీరోజే నిజముగా నేనే
స్వర్గద్వారములు తీస్తా ॥నీకీ॥
రావే... రావే...
భూమిని వీడి పోవుట నేడే
రావే... రావే...



ఆ రోజుల్లోని చాలా సినిమాలలో దేశభక్తికి సంబంధించిన పాట ఒకటైనా ఉండేది. పాత్రపరంగా దేశభక్తికి సంబంధించిన సినిమాల్లో 'వీరకంకణం' ఒకటి. మోడ్రన్ థియేటర్ వాళ్లు నిర్మించారు. 'మంత్రి కుమారి' అని తమిళ్ లో తెలుగులో 'వీరకంకణం' అని తీశారు. మంచి పేట్రియాటిక్ పిక్చర్. అందులో సబ్జెక్ట్ ఏంటంటే - అలనాటి రాజులలో కూడా ఆ రాజు సుభిక్షంగా ఉండాలి అని త్యాగాలు చేసే పాత్ర. అందులో రామారావుగారు, కృష్ణకుమారి ఒక జంట. నేనూ, జగ్గయ్య గారూ ఒక జంట. జగ్గయ్యగారు విలనిష్ టైప్. దోపిడీ దొంగ. అది తెలిసి కూడా అతన్ని పెళ్లి చేసుకుంటుందా పాత్ర. ప్రేమించాను కాబట్టి అతన్ని పెళ్లి చేసుకొని, మారుస్తాను అని అంటుంది. ఆఖరికి అతను మారకపోగా రాజద్రోహి అయిపోయి పెళ్లాన్నే కొండమీదనుంచి తోసి చంపేయాలని తీసుకువెళ్తాడు. అక్కడ ఓ మంచి పాట. 'రావే...రావే పోవు స్థలం అతి చేరువయే నా రాణి' అంటూ రెండర్థాలు వచ్చేటట్లుగా చాలా బాగా రాశారు ఆరుద్ర గారు. పాట అయిపోయిన తర్వాత అక్కడ తన నిజస్వరూపం బయటపెట్టి 'నిన్ను ఇక్కడ నుండి తోసేస్తాను' అంటాడు. నరే ఈ అమ్మాయి ఆలోచిస్తుంది.

ఇవాళ సోనియాగాంధీ గారు ప్రధానమంత్రి పదవి వచ్చినా త్యాగం చేసిందావిడ. ప్రధానమంత్రి అంటే మాటలు కాదు. అటువంటి త్యాగమే ఆ రోజున ఆ పాత్ర కూడా చేసింది. రాజ్యం బాగుండాలి, దేశ ప్రజలు బాగుండాలి, సుభిక్షంగా ఉండాలన్న ఉద్దేశ్యంతో ఆఖరుకు మొగుడ్నే కొండమీద నుండి తోసి చంపేస్తుంది. అందులోనే ఇంకో పాట కూడా ఉంది...'కట్టండి వీరకంకణం...' మంచి పేట్రియాటిక్ సాంగ్. ఒళ్లు జలదరించే పాట అది.

ఆ పాటకు నటించేటప్పుడు దేశభక్తి పరంగా నాకు కొన్ని ఫీలింగ్స్ వచ్చాయి. మా కుటుంబం బ్యాక్‌గ్రౌండ్ అంతా దేశభక్తి... మా అమ్మగారు, నాన్నగారు, పెదనాన్న గారు...వీళ్లంతా పేట్రియాటిక్ పీపుల్. స్వాతంత్ర్య సమరంలో జైలుకెళ్లొచ్చారు. రాజకీయ పరంగా

చిత్రం : వీరకంకణం రచన : ఆరుద్ర

సంగీతం : సుసర్ల దక్షిణామూర్తి

ఆత్మ బలిచేసినావు - అమరజీవివమ్మా
నీ మంచితనము మా దేశము మరచిపోదుసుమ్మా ॥ఆత్మబలి॥
దేశ సౌభాగ్యమే ఆశయమ్మ నీకు
ఆశయాల కోసమే అసువు లిచ్చినావు ॥ఆత్మబలి॥
ధర్మనిరతి కొరకె పతిని ధారపోసినావు
నీ త్యాగమే లోకములో చెరగిపోవదమ్మా ॥ఆత్మబలి॥
పూజ్యనీయురాలివే పుణ్యమూర్తివే
మా జేజేల స్వర్గమందు స్వీకరించవమ్మా ॥ఆత్మబలి॥










'వీరకంకణం' పాటల పుస్తకం కవర్‌పేజీ

# నేనూ నా పాటలు



అవీ ఇవీ తెచ్చుకోవాలి అని వాళ్లు ఆశించలేదు. నాకు గుర్తున్నంత వరకూ.... 47 లో దుగ్గిరాలలో ఉన్నప్పుడు మహాత్మాగాంధీ గారు తెనాలి వచ్చారు. అప్పుడు మా ఫ్యామిలీ అంతా రెండెడ్ల బండి కట్టుకుని తెనాలి వెళ్లాం. తెల్లవారు జామున తెనాలి స్టేషన్ దాటి రెండు కిలోమీటర్లు దాటిన తర్వాత ట్రెయిన్ ఆపారు. అక్కడ మా నాన్నగారు తన భుజంమీద నన్ను ఎత్తుకుని మహాత్మాగాంధీ గారిని నాకు చూపించారు. మహాత్మాగాంధీ గారికి ఆ వేళ మౌనవ్రతం. ఆ సూర్యకిరణాలు పడుతూ ఉంటే ఆ బంగారు రంగుతో ఆయన బయటకు వస్తూ ఉంటే అది అన్‌ఫర్‌గెటబుల్ సీన్ అన్నమాట. అందరికీ నమస్కారం పెట్టారు. అందరనీ 'రఘుపతి రాఘవ రాజారాం' పాడమన్నారు. నాకు బాగా చిన్నతనం. 6,7 ఏళ్లు ఉండొచ్చేమో ! ఇవన్నీ నాకు 'కట్టండి వీరకంకణం సాంగ్ చేస్తున్నప్పుడు గుర్తుకువచ్చి వీరావేశం వచ్చింది. నిజ జీవితంలో జరిగిన కొన్ని సంఘటనలను తలుచుకుంటే మూడ్‌కు మంచి హెల్ప్ చేస్తాయి.

ఈ 'వీరకంకణం'లోనే చివర్న నా పాత్ర చనిపోయాక 'ఆత్మ బలిచేసినావు - అమరజీవివమ్మా' అంటూ ఒక పాట వస్తుంది. అది కూడా చాలా మంచి పాట. అక్కడ నా విగ్రహం ఒకటి చేయించి దానిమీద ఆ పాటని చిత్రీకరించారు. (ఇటీవల విడుదలైన సీడీల్లో విగ్రహం అదీ కన్పిస్తుంది కానీ పాట మాత్రం ఉండదు.)

సినిమా పాటలుకాదు కానీ....నేను కాంగ్రెస్ పార్టీ తరపున పనిచేస్తున్నప్పుడు మల్లిఖార్జునశర్మ గారు 'స్వాతంత్రోద్యమ చరిత్ర' రాశారు. స్వాతంత్రోద్యమంలో పాల్గొన్న మహానాయకుల జీవితాలను మొత్తం పాట రూపంగా రాస్తే నేను



రాజీవ్‌గాంధీతో...

దానిని పురుషోత్తమ సాయిగారి చేత మ్యూజిక్ చేయించాను. పార్టీ మీటింగ్ లు, కాంగ్రెస్ పార్టీ సెంటినరీ సెలబ్రేషన్స్ అప్పుడూ అవన్నీ....మా ఆర్కెస్ట్రా, కృష్ణ తులాభారంలో కృష్ణుడు అక్కిరాజు సుందరరామమూర్తి .... మేమంతా పాటలు పాడేవాళ్లం. కంపోజ్ చేయడం కూడా చాలా బాగా చేశారు. అలాగే అందులోనే ఇందిరా గాంధీ గురించి, 'భారతదేశం పూల తోటలో విరిసింది ఒక ఎర్ర గులాబీ' అని నెహ్రూ గారి మీద ఒక పాట ఉంది. నాకు చాలా దేశభక్తి . ఇప్పటికీ అక్టోబర్ 2 న మా ఇంట్లో ఉన్న మహాత్మాగాంధీ ఫోటో ముందు ఓ గులాబీ పెట్టి 'మహాత్మా మీరు ప్రాణాలు అర్పించి సంపాదించిన ఈ స్వాతంత్ర్యం ఎంత దుర్వినియోగం అవుతోంది.. ఈ దేశం ఎటుపోతుందో అర్థం కావట్లేదు. స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకునే శక్తి భారతీయులమైన మా అందరికీ ప్రసాదించండి' అని వేడుకుంటాను.

ప్రత్యక్ష రాజకీయాల్లోకి ఇందిరాగాంధీ గారి పిలుపు మేరకే వచ్చాను. ఆరు సంవత్సరాలలో దాదాపు 8000 ఉపన్యాసాలు చెప్పాను. ఎంతో తిరిగాను. కొన్ని ప్రదేశాలలో అయితే మోకాళ్ల లోతు నదిలో నడిచివెళ్లాను....నా వర్క్ చూసి రాజీవ్‌గాంధీ గారు రాజమండ్రి పార్లమెంట్ సీటు ఆయనంతట ఆయనే పిలిచి ఇచ్చారు. మరి ఆ రోజున గెలిచాను. ఆ తరువాత దురదృష్టం ఏమిటంటే... 1991 మధ్యంతర ఎన్నికలలో కరెక్ట్‌గా 18నో, 19నో రాజమండ్రి వచ్చి ఆయన నాకు కాన్వాస్ చేశారు. 21 న ఆయన మరణ వార్త..! అది వినటంతోనే చాలా అప్‌సెట్ అయిపోయాను. వాళ్ల కుటుంబం అంతా కూడా త్యాగమూర్తులు గానే పేరు తెచ్చుకున్నారు. సోనియా గాంధీ ప్రధానమంత్రి పదవి వద్దన్నారన్న విషయం పేపర్‌లో చదివిన దగ్గర్నుండి ఎంతో ఉద్రేకం కలిగింది...షి హాజ్ టేకన్ ఎ వండర్‌ఫుల్ డెసిషన్. కాంగ్రెస్ నాయకులు, రాష్ట్రాలు మీరు ప్రధాని కావాలి అంటూ...ఆత్మ త్యాగాలకు సిద్ధపడ్డాకూడా... ఎంతో నిబ్బరంగా ఉండి, తప్పుకోవటమే కాక ఒక మంచి వ్యక్తిని ప్రధానమంత్రిగా ఎంపికచేయటం చూస్తుంటే... ఇప్పుడనిపిస్తుంది ఆవిడకు మంచి రాజకీయ పరిణితి వచ్చేసిందని... హ్యాట్సాఫ్ టు హెర్.

(మరికొన్ని పాటల గురించి వచ్చే సంచికలో.... )



ప్రముఖ దర్శకుడు
శ్రీ సింగీతం శ్రీనివాసరావు
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

కరాజు కథలు 14

# పలుకుబడి

కరాజు తన రాజ్యంలోని ఎందరో కవుల్ని పోషించాడు. గద్య రూపంలో రాసిన ఆధునిక కవుల్ని కూడా దగ్గరికి తీశాడు. కరాజు ఆశయం ఒక్కటే. ఈ మహా రచయితలను చూసి రాజ్యంలోని వారంతా భాషా పరిజ్ఞానాన్ని పెంచుకోవాలి. ఊళ్ళో ఎవరు మాట్లాడు కుంటున్నా అది వినడానికి శ్రావ్యంగా ఉండాలి. ప్రతివ్యక్తి మాట తెలుగుభాషలోని మాధుర్య పరిమళాన్ని గుబాళించేలా ఉండాలి.

కాని కొన్నాళ్ళ క్రితం కరాజు మంత్రితో కలిసి మారువేషంలో నగరంలో సంచారం చేసినపుడు ఒక చేదు నిజం తెలిసి వచ్చింది. తాను కన్న కలలకు భిన్నంగా ఊరివారిలో, ముఖ్యంగా యువకులలో భాషాజ్ఞానం మరీ శూన్యంగా వుంది. వారి ఉచ్చారణ దారుణంగా ఉంది. "ఛ" "జ్ఞ" లాంటి అక్షరాలు అసలు పలకలేరు సరికదా తెలుగు భాషలో ఒత్తులుంటాయన్న సంగతే వారికి తెలిసినట్లేదు. కరాజు తన ఆవేదనను మంత్రికి చెప్పుకున్నాడు.

"మహారాజా! మీ బాధ నాకర్థమైంది. ఈనాటి యువకులందరిలో ఈ జాడ్యం వుంది. దీన్ని సరిదిద్దే ఒక విశిష్టమైన పథకాన్ని నేనాలోచించి అమలు పరుస్తాను" అంటూ ధైర్యంగా హామీ యిచ్చాడు మంత్రి.

మంత్రి ఆలోచించిన పథకం ప్రకారం వెంటనే ప్రజలకు ఉచ్చారణలో శిక్షణనిచ్చే ఒక శిక్షణా కేంద్రాన్ని స్థాపించాలి. ఆంధ్ర భాషలో నిష్ణాతులైన వారిని పిలిపించి వారిచేత ఈ కేంద్రంలో మాటల ఉచ్చారణలో పాఠాలు నేర్పించాలి. ఈ కేంద్రం పనితీరు చూసి ఆ తర్వాత మిగతా ఊళ్ళలో ఇలాంటి కేంద్రాలు స్థాపించవచ్చు. తన పథకాన్ని మనస్సులో పలుమార్లు నెమరు వేసుకొని అనతి కాలంలోనే రాజ్యంలోని యువకులంతా నిష్కల్మషమైన ఉచ్చారణతో తెలుగు భాష మాట్లాడగలరనే ఉత్సాహంతో దానిని కార్యరూపంలోకి పెట్టడానికి పూనుకున్నాడు. ఈ కేంద్రానికి "సంభాషణా పాఠశాల" అని పేరు పెడ్తే బాగుంటుందని తానే నిర్ణయించుకున్నాడు.

దీన్ని నడిపించడానికి కావలసిన భవనాన్నొకదాన్ని చూడమని విద్యాశాఖా సిబ్బందికి ఆజ్ఞాపించాడు. వాళ్ళు నాల్గుమూలలా విచారించి ఒక సంతోషకరమైన వార్తని తీసికొచ్చారు. అపర కుబేరుడనే బిరుదు పొందిన సముద్రగుప్తుడనే వ్యాపారి తను అప్పుడే కట్టించిన కల్యాణ మంటపాన్ని ఒక్కరూక కూడా వసూలు చెయ్యకుండా ఇస్తాడట.

సముద్ర గుప్తుడు వంశపారంపర్యంగా బాగా ఆస్తి వున్నవాడు. నగరంలో మంచి పలుకుబడి సంపాదించాడు. అతనున్న పేటలో అతని మాటకు తిరుగులేదు. అతనికి ఒక్కడే కొడుకు. పేరు చంద్రగుప్తుడు. పద్దెనిమిది సంవత్సరాలు నిండిన యువకుడు. ఎప్పుడూ సరదాగా



గడపడం అలవాటు చేసుకున్నాడు. చదువు సంధ్యలలో అంత శ్రద్ధ లేకున్నా తండ్రిలోని ప్రవర్తనా చాతుర్యం ఇతనికి బాగా ఒంటబట్టింది. ఇది గమనించిన సముద్రగుప్తుడు తన కొడుకు తప్పకుండా యోగ్యుడౌతాడని గ్రహించాడు. కొడుకంటే తండ్రికి ప్రాణం. అతడెంత చెప్తే అంతే. దీన్ని ఆసరాగా తీస్కొని చంద్రగుప్తుడు చిన్నప్పట్నుంచీ తండ్రికి సలహాలివ్వడం అలవాటు చేస్కున్నాడు. కొడుకు సలహా అంటే తండ్రికి ఎనలేని విలువ.

కొన్నాళ్ళ క్రితం కొడుకు తండ్రికొక సలహా యిచ్చాడు. "నాన్నా! నీవు ఎంతో సంపాదించావు. ఈ పేటలో వున్న ఇళ్ళన్నీ మొత్తం కొనేయగలవు. అయినా నీ పేరును గొప్పగా ఎవ్వరూ చెప్పుకోవడం లేదు. పేరు సంపాదించినప్పుడే డబ్బుకు సార్థకం. అందుకని నీవిప్పుడు నేం చెప్పినట్టు చెయ్. పాడుబడిన దేవాలయాలను మరమ్మత్తులు చేయించు లేదా ఒక పాత సత్రానికి రెండు గదులు కట్టించు. ఇలా దానం చేశావు కనుక నీ శిలావిగ్రహాన్ని ఆ ఆవరణలో ప్రతిష్ఠింపచెయ్. చిన్న రాయి మీద పేరు రాస్కుంటే ఎవ్వరూ చూడరు."

కొడుకు ఆలోచనకు పొంగిపొయ్యాడు తండ్రి. వెంటనే ఒక పాత సత్రానికి మరమ్మత్తులు చేయించి దానిముందు తన శిలా ప్రతిమను ప్రతిష్ఠింప చేశాడు.

"బ్రతికున్నప్పుడే ఇలా శిలా విగ్రహాన్ని కట్టించుకోవచ్చా?" అన్నాడొకడు.

"నీదేం పోయింది. అతని డబ్బు, అతని విగ్రహం" అన్నాడు మరొకడు.

ప్రజలేమనుకుంటున్నారో అనే నిమిత్తం లేకుండా తను మాత్రం తన ప్రతిమలను అక్కడక్కడ ప్రతిష్ఠింపజేసి మురిసిపోతున్నాడు.

అయితే ఈసారి మాత్రం కొడుకు పేరుమీద ఏదైనా కట్టాలనుకొని ఒక కొత్త కల్యాణ మంటపాన్ని కట్టించాడు. దానిముందు ఈసారి తన కొడుకు విగ్రహాన్ని ప్రతిష్ఠింపజేసాడు. మున్ముందు కొడుక్కి పెళ్ళై మనవడు పుట్టే వేరేచోట అతని ప్రతిమ కూడా పెట్టాలనీ, ఇలా కొన్ని సంవత్సరాలకు ఊరంతా తన వంశీయుల విగ్రహాలతోనే నిండిపోవాలని సముద్రగుప్తుని కోరిక. కల్యాణ మంటపం పోయిన వారమే పూర్తయింది. ఈ సమయంలోనే "సంభాషణ పాఠశాల"కు ఒక భవనం కావాలనే కబురు ఏకంగా మంత్రి గారినుంచే రావడంతో కొడుకు విగ్రహానికి, మంటపానికి మంచి ప్రచారం లభిస్తుందనే ఉద్దేశంతో దాన్ని ఉచితంగా ఇవ్వడానికి ఒప్పుకున్నాడు. ప్రభుత్వం ఖర్చు పెట్టకుండానే తన పాఠశాలకు ఉచితంగా భవనం దొరకడం మంత్రికి వచ్చిన సదవకాశం. వెంటనే సరేనన్నాడు.

పోతే దీని ప్రధానోపాధ్యాయుడు ఎవ్వరనే ప్రసక్తి రాగా అధికారులంతా భాషశాస్త్రి పేరే పేర్కొన్నారు. .భాషశాస్త్రి అని పిలువబడే భానువరపు షణ్ముగశాస్త్రి ఆంధ్రభాషా వ్యాకరణాన్ని రచించి సార్థక నామధేయుడయ్యాడు. మాటల్లో ఒత్తులున్నా, ద్విత్వాక్షరాలున్నా భాషశాస్త్రి కమితమైన ఇష్టం. ఇప్పుడిలాంటి ఉద్యోగం దొరకడం ఆర్థిక సమస్యల్లో మునిగున్న అతనికి ఒక అదృష్టంగా కనిపించింది.

కాకపోతే భాషశాస్త్రికి, సముద్రగుప్తుడికి మధ్య జనానికి తెలియని ఒక సంబంధం వుంది. వ్యాకరణం జీవనోపాధికి పనికిరాదని ఆలస్యంగా తెలుసుకున్న భాషశాస్త్రి భుక్తి కోసం తన జ్యోతిష్యశాస్త్ర పాండిత్యాన్ని ఉపయోగించుకోక తప్పిందికాదు. ఈ యత్నంలో సముద్రగుప్తుడికి కూడా అప్పుడప్పుడు



జాతకాలు చూడసాగాడు.

ఈ ప్రక్రియలో కొంత లౌకికం కూడా నేర్చుకున్నాడు. ఎప్పుడూ భవిష్యత్తు అద్భుతంగా వుందని చెప్పే భాషశాస్త్రి అంటే సముద్రగుప్తునికి ఒక ప్రత్యేక వాత్సల్యం ఏర్పడింది. దాంతో ఒకసారి ఒక అత్యవసర పరిస్థితిలో భాషశాస్త్రికి కొంత డబ్బు కావలసి వస్తే సముద్రగుప్తుడే అతనికి అప్పిచ్చి నిదానంగా తీర్చమన్నాడు. అది జన్మలో తీర్చలేడని భాషశాస్త్రికి తెలుసు. అందుకని వారంవారం సముద్రగుప్తుణ్ణి దర్శించి మంచి భవిష్యత్తుందని చెప్పసాగాడు. అలా చెప్పకపోతే డబ్బు తిరిగి ఇమ్మంటాడేమోనన్న భయం.

సంభాషణా పాఠశాలకు, సముద్రగుప్తుడికి సంబంధం ఉన్నదని తెలుసుకున్న భాషశాస్త్రి తన భవిష్యత్తును గురించి కొంత ఆందోళనకు గురి అయ్యాడు. దానికి తోడు పాఠశాలకు ముఖ్య సలహాదారుడుగా చంద్రగుప్తుడుంటాడన్న వార్త విని మరీ ఖంగుతిన్నాడు. ఉచితంగా భవనం వస్తున్న కారణంగా వీటికన్నిటికీ ప్రభుత్వోద్యోగులు ఒప్పుకున్నారు.

పాఠశాల మొదలు పెట్టీ పెట్టకముందే చంద్రగుప్తుడు ఒక సలహా యిచ్చాడు. "సంభాషణా పాఠశాల' అన్నపేరు అందరికీ అందుబాటులో ఉండదు. దీనికి బదులు తియ్యని తెలుగులో 'పలుకుబడి' అంటే బాగుంటుంది. తెలుగుతనం ఉట్టిపడ్తుంది."

ఇదేం బాగాలేదని చెప్పబోయి తాను తీసుకున్న అప్పు గుర్తుకొచ్చి వెంటనే "చాలాబాగుంది" అన్నాడు భాషశాస్త్రి. దాంతో 'పలుకుబడి' అన్నపేరు రూఢి అయింది. సలహాదారుడి హోదాలో రోజూ తనిఖీ చెయ్యడానికి బడికి వస్తానన్నాడు చంద్రగుప్తుడు. "నువ్వు రోజూ రావడం ఎందుకు? ఇక్కడ శాశ్వతంగా నీ శిలావిగ్రహం ఉందిగా" అని అనబోయి అనలేక భాషశాస్త్రి ఊరికే ఉండిపోయాడు.

పాఠాలు మొదలుపెట్టారు. బడికి వచ్చిన వాళ్ళంతా పెద్దల పోరు పడలేక వచ్చిన పనిలేని కుఱ్ఱాళ్ళు. "రెండు వారాల వరకు కొన్ని క్లిష్టమైన అక్షరాల ఉచ్చారణను సాధన చేద్దాం. ఇప్పుడు 'క్ష' అనే అక్షరంతో మొదలెడ్తాం" అన్నాడు శాస్త్రి. 'క్ష' అంటే అందరూ 'క్ష' 'క్ష' అంటూ ఇలా వందసార్లనాలి. ఇదే మొదటి పాఠం. కాని అందరి నోటినుంచి 'ఛ్ఛ' 'ఛ్ఛ' అని వినిపిస్తూంది. 'ఛ్ఛ' కాదు 'క్ష' అని శాస్త్రి ఎన్నిసార్లు దిద్దినా వాళ్ళు 'ఛ్ఛ' అనే అంటున్నారు. ఇలా గుంపులో గోవిందాలా కాకుండా ఒక్కొక్కర్నీ వేరువేరుగా పిలిచి తర్ఫీదు ఇవ్వాలనుకున్నాడు. కాని ఎవ్వరూ స్వచ్ఛంగా 'క్ష' అని అనలేకున్నారు. చిట్టచివరకు ఒకే ఒక వ్యక్తి, చింపిరి గుడ్డలతో చెదిరిన జుట్టుతో

ఉన్నతను, ముందుకు వచ్చి 'క్ష' అని స్వచ్ఛంగా అన్నాడు. భాషశాస్త్రి ఆశ్చర్యపొయ్యాడు.

"నీకింత స్వచ్ఛమైన ఉచ్చారణ ఎలా అలవాటైంది?" అనడిగాడు.

"రోజూ ఇంటింటికీ వెళ్ళి 'భిక్షాందేహి' అంటాను. అలా అలవాటైంది" అన్నాడా వ్యక్తి.

"ఆహా! 'క్ష' ఇంత స్వచ్ఛంగా ఉచ్చరించగలవు గనుకనే రోజూ బిచ్చమెత్తు కోగలుగుతున్నావ్" అన్నాడు భాషశాస్త్రి ప్రోత్సాహకరంగా.

ఆ తర్వాత 'జ్ఞ' 'భ్య' 'కృ' 'ర్థ్య' లాంటి అక్షరాల్ని వల్లింపజేశాడు. ఎవరిని చూసినా నోట్లో రాళ్ళు పెట్టుకొని మాట్లాడినట్టుందే తప్ప స్వచ్ఛంగా ఎవ్వరూ పలకడం లేదు. భాషశాస్త్రికి కొత్త దిగులు పట్టుకుంది. సంవత్సరం అయ్యేసరికి నువ్వేమి సాధించావని ఎవ్వరైనా అడిగితే ఏమీలేదని చెప్పాల్సొస్తుందేమో. సరిగ్గా ఈ సమయానికే చంద్రగుప్తుడు వచ్చి ఈ యిరకాటంలోనుంచి బయటపడే మార్గం చూపించాడు.

"శాస్త్రిగారూ! నాదొక సలహా" అన్నాడు చంద్రగుప్తుడు వచ్చీరాగానే.

భాషశాస్త్రి అయోమయంగా చూచాడు.

"అసలు 'పలుకుబడి' ధ్యేయం ఏమిటి?" అన్నాడు చంద్రగుప్తుడు.

"అందరూ స్వచ్ఛంగా పలికేలా నేర్పడం" అన్నారు శాస్త్రి.

"కావొచ్చు. కాని తెలుగులో కొన్ని వేల పదాలున్నాయే! కొద్ది సమయంలో అవన్నీ నేర్పడం సాధ్యమా? అందుకని ముఖ్యంగా ఏ పలుకులు నేర్పితే నేర్చుకున్న వారికి ఉపయోగకరంగా వుంటుందో నేను చెప్తాను వినండి!"

అందరూ నిశ్శబ్దంగా చంద్రగుప్తుని మాటల




కోసం ఎదురు చూసారు. చంద్రగుప్తుడు తన ఉపన్యాసాన్ని సాగించాడు.

"అసలు మానవుడికి పలుకే లేకుండా ఏవేవి సాధ్యం, ఏవి అసాధ్యం? ఉదాహరణకు ఒకతను ఒక పండు అమ్ముతున్నాడనుకోండి. మరొకడు కొంటున్నాడు. పండు వెల యెంతో అమ్మేవాడు సంజ్ఞలతో చెప్తాడు. ఒక పండియ్యమని కొనేవాడు సంజ్ఞ చేస్తాడు. అమ్మేవాడు పండిస్తే కొనేవాడు తీస్కొని దాన్ని పరీక్షించి తింటాడు. అమ్మేవాడు డబ్బు కోసం చెయ్యి జాస్తాడు. తన దగ్గర డబ్బు లేదని సంజ్ఞ చేసి కొనేవాడు వెళ్ళిపోతుంటాడు.

వెంటనే కోపంతో అమ్మేవాడు కొట్టు బయటికి వచ్చి కొనేవాడి భుజం పట్టుకొని తన వైపుకు తిప్పుకుంటాడు. ఇంతవరకు మొత్తం వ్యవహారం సంజ్ఞలతో నడిచింది కదా? ఇప్పుడిక సంజ్ఞలతో ముందుకు పోలేడు. 'ఏరా? నా డబ్బులిస్తావా? కాళ్ళు విరగ్గొట్టమంటావా?' అని తీరాలి. ఈ మాటల్ని సంజ్ఞలతో చెప్పడం కుదరదు. దీని అర్థమేమిటి? జీవితంలో దేన్నైనా పలక్కుండా సాధించవచ్చు. కాని తిట్టడం మాత్రం పలుకుతోనే సాధ్యం. పలుకు లేనిదే తిట్టు లేదు. తిట్టు లేనిదే జీవితం సాగదు"

చంద్రగుప్తుడి ఉపన్యాసాన్ని విన్నవారంతా నిశ్చేష్టులై మౌనంగా అలాగే చూస్తూ నిలబడ్డారు. చంద్రగుప్తుడు మళ్ళీ అందుకున్నాడు. "అంతేకాదు. తిట్టేవాడెప్పుడూ పై అంతస్తులో ఉంటాడు. తిట్టించుకునేవాడు కింది అంతస్తులోనే ఉంటాడు. దాంతో అందరూ తిట్టేవాడికే మద్దతు పలుకుతారు. అంటే సమాజంలో తిట్టేవాడికే పలుకుబడి. ఆ 'పలుకుబడి'ని సంపాదించేట్టు చెయ్యడమే ఈ 'పలుకుబడి' ధ్యేయం కావాలి. అందుకని భాషశాస్త్రి గారూ! రేపట్నుంచి తెలుగులో ఎన్ని తిట్లున్నాయో సేకరించి వాటిని ఏయే సందర్భాల్లో ఏ రీతిని పలకాలో వివరించి మన విద్యార్థులందరికీ నేర్పండి. సంవత్సరం అయ్యే సరికి ఇందులో ఉత్తీర్ణులైన విద్యార్థులు స్వచ్ఛమైన స్పష్టమైన తిట్లు తిట్టడంలో ప్రావీణ్యత సంపాదించి రాజ్యంలో విపరీతమైన పలుకుబడిని సంపాదించగలరు."

భాషశాస్త్రి తల తిరిగింది. తాను రచించిన ఆంధ్ర వ్యాకరణాన్ని పక్కనపెట్టి తిట్లను సేకరించడం ప్రారంభించాడు. ఇవి ఎటూ భారతభాగవత రామాయణాల్లో దొరకవు కనుక వీధులెంబడి తిరిగి వివిధ మండలాల తిట్లను సేకరించాడు.

తననుకున్న పథకం ఇలా వేరే దోవ పట్టడం చూసి కంగారు పడ్డ మంత్రి నేరుగా కరాజు దగ్గరకు పరుగుతీశాడు.

జరిగినదంతా శాంతంగా విన్నాడు కరాజు. "ఇదొకందుకు మంచికే వచ్చింది మంత్రీ!" అన్నాడు. "అదేమిటి మహారాజా!" అన్నాడు మంత్రి అర్థం కాక. వ్యక్తులు ఒకర్నొకరు తిట్టు కోవడం సహజం. అలా తిట్టుకోని పరిస్థితిలో కొట్టుకుంటారు, చంపుకుంటారు, నరుక్కుంటారు. అలా కాకుండా తిట్టుకున్నా రనుకోండి, - కాస్త వేడి తగ్గి, శాంతించి ఊరుకుంటారు. ఇక రాజ్యంలో రక్తపాతాలుండవు కదా!" అన్నాడు కరాజు.

వేరేవేరే కోణాల్నుంచి ఆలోచించే రాజుగారి కుశాగ్ర బుద్ధికి జేజేలర్పించుకున్నాడు మంత్రి. వెంటనే రాష్ట్రంలో పలుచోట్ల ఇదే విధంగా 'పలుకుబడు'లను స్థాపించి తద్వారా రాజ్యంలో శాంతి భద్రతలను నెలకొల్పాలని నిశ్చయించాడు. ◆



జూన్ 4 ఆరుద్ర వర్ధంతి సందర్భంగా....

# ఆరుద్ర పేరు సినీగీతాలపై ఓ పచ్చబొట్టు



-కె.రామలక్ష్మి

నేను ఆరుద్ర జీవితంలోకి ప్రవేశించడానికి ముందే అతను కవి. సినీ కవి. కానీ నేను అతనిలోని కవినే ఇష్టపడ్డాను.

సినీ కవిగా ఆరుద్ర గురించి నాకంతగా తెలియదు. అంటే - ఆ పాట ఇలా. ఇది అలా అంటూ కబుర్లు చెప్పుకోవడం ఉభయులకీ అలవాటు లేదు. సాహిత్యం గురించి పోట్లాడుకునే వాళ్లం కాని సినీ కబుర్లు కాదు.

అయితే - ఎవరేనా ఆరుద్ర సినీ గీతాల గురించి - అడిగితే - స్పష్టంగా స్పందించలేను. ఒక్కొక్కప్పుడు ఓ పాటలో మాట నన్ను అపరిమితంగా ఆకట్టుకుంటుంది. ఒక లైను ఆకర్షిస్తుంది. 'అధిక చక్కని దొరగారూ' అన్న ప్రయోగం వంటిది. ' ఎదలోపలి మమకారం ఎక్కడికీ పోదు' అన్నా చాలా కదిలిస్తుంది.

సినీ సాహిత్యం - అదొక అవసర సాహిత్యం. దానికి రంగు రుచి వాసన చూపు కూడా చేర్చాలి. కవిత్వం లాగా చదివి ఆనందించకల్గడం చాలా అరుదని నేను నమ్ముతాను. బహుశా ఆరుద్ర కూడా ఇదే అభిప్రాయంలో ఉండేవాడేమో నాకు తెలియదు. కారణం ఒక్కటే - మా ఇంటి గేటు దాటి లోపలికి వచ్చాక సినిమాల గురించిన కబుర్లు ఉండేవి కావు. దానివల్లే పిల్లలు కూడా సినిమాలకి ఎగబడటం అనేది చాలా అరుదు.





ఆరుద్ర పాటలు నేను మొదట్లో సేకరించ లేదు. ఆ రోజుల్లో రికార్డులు చేటల్లా ఉండి స్థలం ఎక్కువ ఆక్రమించేవి. అంగుళం స్థలం ఉన్నా అది ఆరుద్రకి కావాలి, పుస్తకాలు పెట్టుకునేందుకు! చాలా రికార్డులు నేను వి.ఎ.కె.రంగారావు గారికి ఇచ్చేశాను. కాసెట్లు కూడా చేయించలేదు. తరువాత అభిమానులు చేసి పంపినవి, ఆరుద్ర శిష్యులు రవికుమార్, సంగయ్యలు సేకరించినవీ చేరాయి. 25 సంవత్సరాల సినీ జీవితం సందర్భంగా రంగారావు గారు 'కొండగాలి తిరిగింది' రూపొందించారు. తరువాత ఇప్పుడు సంకలనాలు తేవడం జరిగింది.

ఆరుద్ర గీతాలు వినడం చాలా యిష్టం. కాని అన్నీ కాదు. నాకు తిలక్ సినిమాలలో పాటలు, బాపు గారి సినిమా గీతాలు బాగా ఇష్టం. కారణం - వాటిలో జీవం జవం వేగం అన్నీ ఉంటాయి. అవి ఆహ్లాదం కలిగిస్తాయి. ముఖ్యంగా 'ఎదగడానికెందుకురా తొందరా' - అన్నది ఎన్నో సత్యాలని చెప్పక చెప్తుంది. 'రాయినయినా కాకపోతిని' - ఎంత విషాదం ఆవిష్కరిస్తుంది !

ఆరుద్ర క్లబ్ సాంగ్స్ కూడా కొన్ని చాలా బాగుంటాయి. "పాట ఏదైతేనేం? రాయడం వృత్తి అయినప్పుడు - నిజాయితీతో రాయాలి. క్లబ్ సాంగ్స్ అయితేనేం? భక్తి పాట అయితేనేం?" అన్నదే ఆరుద్ర భావన.

చాలా మంది పాటల గురించి చాలా చాలా మాటలు చెప్పగలరు. ఇలా రాశారు. అలా అయిందని- ఆయా పాటలు రాసిన సందర్భాలు కవి పత్నులు వర్ణించగలరు. కానీ నేనా పని చేయలేను. ఎందుకంటే నేనెప్పుడూ ఆరుద్ర చేతిలో ఏ సినిమా పాట పూర్తి పాఠాన్ని చూడలేదు! 'కవిగారు ఐదు నిముషాల్లో పాట రాశారు. పాట మీద గట్టిగా - కూర్చోలేదు' అని (ఆ రోజుల్లో నిర్మాతలు) అంటారని వినేదాన్ని. దానికి ఆరుద్ర సమాధానం -' ఆ ఐదు నిముషాల వెనుక - పాతిక సంవత్సరాల అనుభవం ఉందని. నిజమే సినిమా పాట బ్రహ్మ పదార్థం కాదు. నేర్పు. దానికి కొంచెం అనురక్తి జత చేయడం.

అందుకే - ఈ రోజుల్లో ఆరుద్ర పాటల్లో నీకు ఏది ఇష్టం? అని అడిగితే - ఇదీ అని చెప్పలేను. ఏదీ లేదని చెప్పలేను. నేను ఎన్నడూ - మరిచిపోనిదీ - పాడేదీ కూడా ఒక్కటే - అది 'ఎవరు కన్నారెవరు పెంచారు'(ముద్దుబిడ్డ) ఇంతకంటే క్లుప్తంగా భాగవతసారం ఎవరు చెప్పగలరు అనిపిస్తుంది.

ఈ జూన్ 4 కి ఆరుద్ర కనుమరుగై ఆరు సంవత్సరాలు అవుతోంది. కాని - అతను లేడన్న భావన నాకు లేదు. కారణం ఒక్కటే - అతనితో నేను పంచుకున్న జీవితం 42 ఏళ్లు. స్నేహించిన జీవితానికి 46 ఏళ్లు. వాటి ముందీ ఎడబాటు కాటు నాకు ఎదలో ముల్లు అనిపించడం లేదు...

సినీ గీత జగత్తులో ఆరుద్ర స్థానం సంఖ్యాపరంగా నిర్ణయించే వాళ్లు , స్వారస్యం పరంగా నిర్ణయించేవాళ్లూ, ఏం లేదనే వాళ్లూ కూడా వుండొచ్చుకానీ - ఆరుద్ర పేరు తుడిచి వేయడానికి సాహసించలేదు. అది సినీ గీతాలపై ఓ పచ్చబొట్టు.

బాపురమణీయం
Bapu Ramaneeyam

# పెళ్ళిపుస్తకం

## దర్శకత్వం : బాపు

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
ఇలపావులూరి మురళీమోహనరావు

వెండితెర నవల **8**

### జరిగిన కథ

మధ్యతరగతికి చెందిన కృష్ణమూర్తి, సత్యభామలకు పెళ్ళవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. భామకు ఇది కంటగింపుగా ఉంటుంది. శ్రీధరం బావమరిది గిరి సత్యభామపై కన్నేస్తాడు. -(ఇక చదవండి)



కృష్ణమూర్తి ఆ విధంగా శ్రీధరం ఆదరణ పొందితే తన వినయవిధేయతలు, అణుకువతో మంగళను ఆకర్షించింది సత్యభామ.

"నేను వెళ్ళొస్తానండీ మరీ" నమస్కరించింది.

"వెళ్దువుగానిలే ఉండూ. ఇదంతా మనతోట చెరుకే... ఇంద" అంటూ బెల్లం అచ్చు ఒకటిచ్చింది మంగళ.

ఉన్నట్లుండి గిరి వచ్చాడు. "అక్కయ్యా... నేను ఉద్యోగానికి రిజైన్ ఇచ్చేస్తున్నాను" అన్నాడు.

"మళ్ళీ ఏఁవొచ్చిందిరా" అడిగింది మంగళ.

"నాకు అర్జెంటుగా కూచిపూడి, భరత నాట్యం నేర్చుకోవాలనుంది" చెప్పాడు గిరి.

భామ పక్కున నవ్వి "అవి రెండూ వేరు వేరండీ" అంటూ మంగళ ఇచ్చిన బెల్లం ముక్కను కొద్దిగా కొరికింది.



"రెండు డాన్సులే కదా మేడం" అన్నాడు గిరి భామ దగ్గరగా వచ్చి.

వసుంధర కూడా వారి దగ్గర కొచ్చి "హనుమంతుడికి సంగీతం వచ్చు కానీ డాన్స్ నేర్చుకోలేదట" నవ్వుతూ అన్నది.

"ఏం?" వెక్కిరింతగా అన్నాడు గిరి.

"తోకుందిగా - బాగుండదని" జోక్ పేల్చింది వసుంధర.

"ఇంకేం నాకు లేదుగా"

"అదొక్కటే తక్కువ"



వారి వ్యంగ్య సంభాషణకు నవ్వొచ్చి కిలకిల మంది భామ.

"అక్కా - ఈ కోతికేం గానీ - మీ ఆడకోతికి అర్జెంటుగా నేర్పించు. ఆ చొక్కాలు, లాగులు పోయి భారతీయతత్వం, మన లక్షణాలు వంటపడితే.." మంగళతో అన్నాడు గిరి.

"అవున్రా ..మంచి మాటే చెప్పావ్. రేపు ఆ డాన్సు స్కూల్‌కు ఫోన్ చేయించి..." మంగళ చెబుతుండగా "భలే దానివే, స్కూల్ మన ఆఫీసులో ఉంటే...అన్నాడు గిరి.

"ఎవరూ...మన కె.కె...గారా?" అన్నది వసుంధర.



"కాదు... నీ ఎదురుగానే ఉంది" భామను చూపించాడు గిరి - తన దుష్టపన్నాగం అమలు చేయడంలో భాగంగా.

"అవునురా, మంచి ఊహే, ఏమ్మా భామా మా అమ్మాయికి...." అంటూ డాన్సు నేర్పుతావా అన్నట్లుగా అడిగింది మంగళ.

"అబ్బే... నా కంత శాస్త్రం రాదండీ," సిగ్గుపడుతూ చెప్పింది భామ.

"మేమంతా చూశాం గదమ్మా, ఎంతో బాగుంది. రాదంటావేం?" అన్నది మంగళ.

"కొందరు అన్నీ వచ్చినా ఏమీ రాదంటారు. కొందరు ఏమీ రాకపోయినా అన్నీ వచ్చంటారు" అన్నాడు గిరి.

"నీలాగే" వ్యంగ్యంగా అన్నది వసుంధర.

"నా సంగతి సర్లే, నీకా ఆర్టుగారే నేర్పాలనే ఆశగా ఉంటే చెప్పు" కోపంగా అన్నాడు గిరి.

"అయన్నే అడిగేద్దాం, బ్రహ్మచారట...నీలాగే కోతి" కోపంగా అన్నాడు గిరి.

"ఏయ్ .." అంటూ వసుంధర గిరిని కొట్టబోయింది.

భామకు అయోమయంగా ఉంది. ఏమంటే ఎవరికి ఎక్కడ కోపం వస్తుందో ఎక్కడ తనకు స్థాన భ్రంశం కలుగుతుందో..?

"అక్కా భామాజీ అయితే నీలాంటి మహా ఇల్లాలు. పాపం భర్తకు ఎక్కడో కేరళ అడవుల్లో వైద్యం... డబ్బుఅవసరం. లేడీస్ హాస్టల్లో ఉంటోంది. మన అవుట్ హౌస్‌లో చోటిస్తే పొద్దున్న, సాయంత్రం గంటో, అరగంటో తకధిమి తోం అంటే ఇట్టే వచ్చేస్తుంది" నూరిపోశాడు.

"అవున్రోయ్... ఒక్కనిమిషం" అని అవతలి కెళ్ళింది.

వసుంధరకు మాత్రం ఇది ఇష్టం లేదు. తనకు కె.కె.తో స్నేహం చెయ్యాలని కోరిక. అందుకు అడ్డుపడుతున్న గిరి అంటే మంటగా ఉందామెకు "మామయ్యా, నీ సిల్కు దుప్పటిలాగినందుకు నా మీద పగతీర్చు కుంటున్నావు కదూ ఉండు నీ పని చెప్తా" పళ్ళు కొరికింది.



ఇంతలో మంగళ ఒక ప్లేట్లో పూలు, పండ్లు పెట్టుకుని వచ్చింది. భామను పిలిచింది "అమ్మా, మాపెద్ద కూతురులాంటి దానివి, నీ చెల్లిలికి విద్యాదానం చెయ్యమ్మా. నీ కష్టం ఉంచుకోను, నెలకు వెయ్యి రూపాయాలు, మా ఇంట్లోనే మకాం, భోజనం, కాఫీ,టిఫిను, కాదనకమ్మా....." అంటూ పక్కకి తిరిగి "ఒరే తమ్ముడూ, అమ్మాయికి వసతి ఏర్పాట్లు అవీ చూడు" అన్నది గిరితో.

తన పథకం పారినందుకు సంతోషించాడు గిరి, "ఆవిషయం నా కొదిలెయ్ ఐడియానాది, పూచీనాది" అని ఎగిరి గంతేశాడు.

* * *

ఇంట్లో కుర్చీలో కూర్చుని ఏదో డిజైన్ వర్క్ చేసుకుంటున్నాడు కృష్ణమూర్తి. సత్యభామ సడీ సవ్వడి లేకుండా వెనుక నుంచి వచ్చి కృష్ణమూర్తి కళ్ళు మూసింది అరచేతులతో.



"ఎవరో చెప్పుకోండి?"

''ఎనవంండఁగిరిలో ఎవరబ్బా? ఊ ...రుక్మిణి"

"ఎవరా రుక్మిణి"?

"ఉన్నదిఒక్కరే, రుక్మిణి భామ".

"ఒక్కరే అయితే సత్యభామే, రుక్మిణిభామ అంటే ఒకటిన్నర కేసులా ఉంది".

"అబ్బా...అలా అనకు".

"అబ్బా...అలా అనకు" అని పది పచ్చ కాగితాలు చూపించింది భామ.

"ఇదేంటి?" నెల మధ్యలో ఒకటో తారీకు రెండోసారి వచ్చిందా అన్నట్లు చూశాడు కృష్ణమూర్తి.

"నా కొత్త జీతం" గర్వంగా చెప్పింది భామ.

"దేనికి?" ఆశ్చర్యంగా అడిగాడు కృష్ణమూర్తి.

"మనకే" జవాబిచ్చింది భామ.

"ఎవరికి అనలేదు. ఎందుకని? ఏ పనికని?" అడిగాడు కృష్ణమూర్తి.

"డాన్స్‌కి"

"ఆడటానికా"

"ఆడించడానికి"

"ఎవరిని"

" మీ ఒకటిన్నర కేసుని" అని నవ్వుతూ మంచం మీద పడుకుని ఏదో పత్రిక తిరగేయసాగింది భామ.

"ఎవరా ఒకటిన్నర కేసు?" అడిగాడు కృష్ణమూర్తి.

"మీ చిన్నబాసుకు డాన్స్ నేర్పమని మీ పెద్దబాసు గారి పై బాసుగారు అడ్వాన్స్ ఇచ్చారు. నెలకు వెయ్యి. వారానికి ఐదు క్లాసులు. బంగళాలో ఫ్రీ క్వార్టర్స్. ఫ్రీ భోజనం, టిఫిన్లు, కాఫీలు, ఓవల్టీన్లూ, హార్లిక్సులూ...."



"బంగళాలో బసా?"

"ఏం? ఇక్కడ వంటెలాగనా?"

"బొంబాయిలో మొన్నటి దాకా హోటలు తిండే కదా... బంగళాలో మకాం ఎందుకని?"

"పాపం....ఉమెన్స్ హాస్టల్లో తిండేగా. హాయిగా ఇక్కడుండి ఇంటి భోజనం తినీ...."



''అని వాడన్నాడా?'' కోపంగా అన్నాడు కృష్ణమూర్తి.

"వాడెవడు?" తెలియనట్లు అడిగింది భామ.

''నీ ఒకటిన్నర కేసం, కీచకుడు" గిరి దురుద్దేశ్యాన్ని పసిగట్టినట్లు అన్నాడు కృష్ణమూర్తి.

"వాడి మొహం. అన్నట్లు ఐడియా వాడిదేనండోయ్" అన్నది భామ.

"అదే మరి"

"అంటే?"

"వల"

"చేపల వలా"

"వలపుల వల"

"ఏడిశాడు - వాడి మొహం".

"మోహం గురించే... పరిగెత్తే నీళ్ళకి ఒళ్ళంతా కాళ్ళు. భగ భగ మండే మంటకు ఒళ్ళంతా నోళ్ళు కీచకులకు వళ్ళంతా కళ్ళు..."

''ఓహో... పుట్టుమచ్చ చూశాడనా..?"



"ఫొటో తీశాడుగా".

"చింపేశానుగా, మీకు అసూయ" చిలిపిగా అన్నది భామ.

''అనూయ ఫూటైన ప్రేమకు ధర్మా మీటరు" అన్నాడు కృష్ణమూర్తి.

"కొటేషన్ బాగుందండోయ్, అయినా మీరేం భయపడకండి. నాపేరు సత్యభామ. డాన్సే కాదు, కరాటే కూడా వచ్చు. మీరొకమాటు లెండి.." అన్నది భామ.

లేచాడు కృష్ణమూర్తి.

''ఊ.. వెనుకనుంచి నన్నోసారి పట్టుకోండి" అన్నది సత్యభామ. పట్టుకున్నాడు కృష్ణమూర్తి.



కరాటే స్టైల్లో ఓ పెద్ద అరుపు అరిచి ఎగిరి తన్నింది భామ. కుయ్యో మొర్రో అంటూ మంచం అవతల పడ్డాడు కృష్ణమూర్తి. భామకు ఈ విద్య వచ్చని అతనికింతవరకూ తెలియదు.

(ఇంకావుంది)



"ఎందుకురా అలా ఏడుస్తున్నావు?" అడిగాడు తండ్రి ఏడుస్తున్న తన కొడుకుని.
"అమ్మ కొట్టింది డాడీ" ఇంకా గట్టిగా ఏడుస్తూ చెప్పాడు కొడుకు.
" ఈ మాత్రం దానికే ఏడ్వాలా? భరించాల్రా... నేనెప్పుడన్నా ఏడ్చానా?" అంటూ నాలుక కరుచుకున్నాడు తండ్రి.



"ఇదిగో ఎలక్షన్లో గెలిచినందుకు పార్టీ వాళ్ళు మీకు ఇచ్చిన కారు" అని గెలిచిన అభ్యర్థికి ఓ కారుని చూపించాడు పార్టీ సెక్రటరీ.
"ఇదేమిటి? ఈ కారుకు స్టీరింగ్ లేదు" ఆశ్చర్యపోయాడు అభ్యర్థి
"స్టీరింగ్ పార్టీ ప్రెసిడెంట్ దగ్గరుంటుందిలే. మీరు స్టార్ట్ చేసి కూర్చుంటే చాలు " చెప్పాడు సెక్రటరీ.



ఈ రోజు నేను చేసిన ఉప్మా ఎలా వుంది? ఆఫీసు నుంచి ఇంటికొచ్చిన చలపతిని అడిగింది కొత్తగా కాపురానికి వచ్చిన భార్య.
"చాలా బావుంది. మా డిస్పాచ్ క్లర్క్‌కు మరీ మరీ నచ్చింది. వారానికొకసారైనా ఓ డబ్బాతో తెచ్చిపెట్టమన్నాడు" అన్నాడు చలపతి.
"డబ్బాతో ఎందుకూ ?" అడిగింది భార్య.
"కవర్లు అంటించుకోటానికి పనికొస్తుందని".

**ఈ జోకులను పంపించిన వారు : ముని శ్రీలత. రేపల్లె.**



"అమ్మా ! ఆడుకోడానికి వెళ్లొస్తా !"
"ఏంట్రా, ఈ కొత్త డ్రెస్‌తోనా? "
"అబ్బే కాదమ్మా! పక్కింటి ఉషతో !"



కొడుకుతో తల్లి : ఈరోజు స్కూల్‌లో ఏం చెప్పార్రా?
"ఎలా రాయాలో చెప్పారమ్మా"
"ఏం రాసావురా? "
"దాన్ని ఎలా చదవాలో రేపు చెప్తానన్నారమ్మా!"

**ఈ జోకులను పంపించిన వారు: పులుగుర్త వెంకట కృష్ణారావు, చెన్నై**



హోటల్లో భోజనం చేసి బయటకొస్తూ ఆ హోటల్ మేనేజర్తో ఇలా అన్నాడు సుబ్బారావు :
"నీకో చెడ్డ న్యూసూ, ఛండాలమైన న్యూసూ చెప్పాలి! ఏది ముందు చెప్పమంటావు?"
మేనేజరు : ముందు చెడ్డ న్యూసే చెప్పు!
సుబ్బారావు : కూరలో బొద్దింక వచ్చింది!
మేనేజరు: సరే! మరి ఛండాలమైనదేట్టి?
సుబ్బారావు: కూర మొత్తానికి బొద్దింకే బావుంది!



"నిన్న బాగా అలిసిపోయినట్టున్నావు" బ్రేక్‌ఫాస్ట్ చేస్తూ అడిగాడు కుమార్ తన భార్య రాధని.
"అవునండి బ్యాంక్‌లో తలతిప్పుకోలేని పని...అయినా ఆ విషయం మీకెలా తెలిసింది...!?" అడిగింది రాధ కుతూహలంగా.
"రాత్రి నిద్రలో నీ మీద చేయివేస్తే 'ఈ కౌంటర్ ఖాళీగా లేదు పక్క కౌంటర్‌కి వెళ్లండి', అన్నావులే" అన్నాడు కుమార్ తాపీగా.

భార్య కాన్పుకని పుట్టింటికి వెళ్లినరోజే ఇంటికి వేసిన తాళం చెవి ఎక్కడో పారేసుకున్నాడు చలపతిరావు. "అర్జంటుగా నీ దగ్గరున్న రెండో తాళం చెవి పంపు" అని టెలిగ్రావ్ ఇచ్చాడు భార్యకి. తాళం చెవి వచ్చేవరకూ ఫ్రెండ్ రూంలో వుండసాగాడు.



వారం గడిచింది. 10 రోజులు వెళ్ళాయి. .. పదిహేనురోజులు తరువాత చిరాకెత్తి పోస్ట్‌మేన్‌ని కలిసి, "నాకేం పోస్ట్ రాలేదా?" అని అడిగాడు.
"వారం రోజుల క్రితం ఓ కవరు వచ్చింది సార్. మీ ఇల్లు తాళం వేసుంటేనూ కిటకీ లోంచి లోపల పడేశాను...మీరు తీసుకోలేదా !?" అన్నాడు పోస్ట్‌మేన్.

**ఈ జోకులను పంపించిన వారు: యం. అరుణ్ కుమార్,చెన్నై**



"చిన్నప్పుడు మీ నాన్న..నాకు భలే క్లోజ్.. ఇద్దరం ఒకే రూంలో ఉండి..కల్సే చదువుకున్నాంలే. అప్పట్లో...వంట భలే చేసేవాడు.. ఇంతకీ ఇప్పుడు చేస్తున్నాడు..?"

"సేమ్....అదే"



"ఇదేమిటి...టార్చిలైట్ పట్టుకొచ్చావ్..." శోభనం గదిలో ఆశ్చర్యంగా అడిగాడు రమేష్.

"నేను గదిలోకి రాగానే మీరు లైటు ఆర్పేస్తారని అంతా చెప్పారండి" అంది వనజ అమాయకంగా.



"చూడు కాంతం..మా అమ్మని ఏం అనకే ....పాపం... ఆవిడే గనక నన్ను కనివుండకపోతే... నేను ... నీ భర్త నయ్యేవాడినా చెప్పు"

"అందుకే.... అందుకే ఆవిడంటే నాకు తెగ వళ్ళుమంట"



"నువ్ లేకుండా ఒక్క క్షణం కూడా బ్రతకలేను....డార్లింగ్"

"ఒకళ్ళపై ఆధారపడి బ్రతికే వాళ్ళంటే నా కసహ్యం.."



"చిన్నప్పట్నుంచీ 'పప్పా' అనే దానివి, కొత్తగా ఇప్పుడు డాడీ అంటున్నావేంటమ్మా"

"పప్పా అంటుంటే లిప్‌స్టిక్ పాడైపోతోంది... డాడీ.."



"ఎప్పుడూ మా అమ్మని ఆడిపోసుకోవడమేగానీ, ఒక్కసారన్నా పొగిడావా?" కోపంగా అన్నాడు భర్త.

"అలాగా ! దానికేముందిలెండి. ఇప్పుడు పొగుడుతాగా.. మీకోసం మీ అమ్మగారు.. ఎంతో అందమైన, లక్షణమైన, అణుకువగా ఉన్న పిల్లని వెదికి,వెదికి తెచ్చి మరీ పెళ్లి చేసింది...చాలా !?" అంది భార్య బహు శాంతంగా.

"అందంగా ఉన్న అమ్మాయి కావాలా, బాగా ఆస్తి ఉన్న అమ్మాయి కావాలా, తెలివైన అమ్మాయి కావాలా ?" అడిగాడు మేరేజ్ బ్యూరో బ్రోకర్!

"నాకు మంచి ఆస్తీ, తెలివీ ఉన్న అందమైన అమ్మాయి కావాలి" అంటూ బదులలిచ్చాడా పెళ్లికొడుకు అతి తెలివితేటలతో...

"అయితే...నీకీ జన్మకి పెళ్లికాదు"... అంటూ చేతులెత్తేశాడా బ్రోకర్.



**ఈ జోకులను పంపించినవారు:**
**వేంద్ర. బాల స్వప్న**
**దిల్‌సుఖ్‌నగర్.**



విజయవాడలో కొంత మంది ఆడవాళ్ళు సిటీ బస్సెక్కి టికెట్లు తీసుకోవటం మొదలు పెట్టారు. వారిలో ఒకామె 'అప్సర' అని మూడు రూపాయలు కండక్టర్ చేతిలో పెట్టింది. రెండో ఆమె 'శాంతి' అని నాలుగు రూపాయలు ఇచ్చింది. మూడో ఆమె 'ఊర్వశి' అని ఐదు రూపాయలు ఇచ్చింది. మొదటిసారి పట్నానికి వచ్చి బసెక్కిన ఒక పల్లెటూరు ఆమె ఆ ముగ్గురూ తమ పేర్లు చెబుతున్నారనుకొని 'అప్పల నర్సమ్మ' అంటూ తన పేరు చెప్పి ఐదురూపాయలు కండక్టర్ చేతిలో పెట్టింది.(వాళ్లు చెప్పింది దగ్గర్లో థియేటర్లున్న బస్టాపులు)

**ఈ జోకును పంపించిన వారు : ముని శ్రీలత. రేపల్లె.**

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన ముని శ్రీలత- రేపల్లె, పులుగుర్త వెంకట కృష్ణారావు- చెన్నై, యం. అరుణ్ కుమార్ - చెన్నై, వేంద్ర బాల స్వప్న - దిల్‌సుఖ్‌నగర్ గార్లకు సోహన్ మ్యూజిక్ వారు సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.



# "మహాప్రస్థానం రచించిన మీ కుడి చేతిని ఒక్కసారి ముట్టుకోవచ్చా" అన్నాను

**- సుద్దాల అశోక్‌తేజ**

"1930 దాకా కవిత్వం నన్ను నడిపించింది. ఆ తర్వాత కవిత్వాన్ని నేను నడిపిస్తున్నాను - ఈ శతాబ్దం నాది" అని సాధికారికంగా చెప్పుకున్న మహాకవి శ్రీ శ్రీ.

"ఈ రోజు నా సినిమా పాటని ఓకే చేశారు సరోజా" అని పసిపిల్లాడిలా ఆనందపడి కేరింతలేసిన శ్రీశ్రీ -

ఎన్ని వైవిధ్యమైన అనుభూతులు ఆ మహాకవి జీవితంలో అనిపిస్తుంది.



1950లో విడుదలైన 'ఆహుతి' డబ్బింగ్ చిత్రానికి మాటలు, పాటలు రాయడంతో సినీ ప్రస్థానం ప్రారంభమై అనేకానేక చిత్రాలలో అద్భుతమైన గీతాలతో సినీపాటకో మహోన్నత స్థాయి నందించాడు శ్రీశ్రీ.

చాలామంది అజ్ఞానులు అనుకుంటున్నట్టు సినీగీతం రాయడం అంత సులభం కూడా కాదు అని సినీకవులకు ఒక నుడుగు అందించి మరీ పోయాడు శ్రీశ్రీ.

ఆయన అనేక రకాల రసాల గీతాలు రాసినా తన పాటలో సామాన్యుని గొంతు - సామాన్యుని ఆక్రోశం ఎంతగా ముద్రపడిందంటె "కారులో షికారుకెళ్లే పాల బుగ్గల పసిడీ చాన" అనే పాట మనసు ఆత్రేయ రాసినా అది మహాకవి శ్రీశ్రీ దే అనుకునే వాళ్లు ఇప్పటికీ వున్నారన్నా అతిశయోక్తి అవదు.

సినీ గీతాలలో పాజిటివ్ థింకింగ్ గురించి - పర్సనాలటీ డెవలప్‌మెంట్ గురించి ఇటీవల మేం - అంటే - సీతారామశాస్త్రి గారు "ఎప్పుడూ ఒప్పుకోవద్దురా ఓటమి..." చంద్రబోస్ "రేపన్నది మాపన్నది పనికి రాదులే..ఓ మారియా", నేను "ఒకటే జననం ఒకటే మరణం.." రాసినా - ఆనాడే "కలకానిది విలువైనది బతుకు కన్నీటి ధారలలోనే బలి చేయకు" అంటూ ఒక విజయ పథగమనాన్ని చూపించే గీతా సంజీవనీ పర్వతాన్ని నిలిపి "ఏదీ వదలలేదు శ్రీశ్రీ" అనిపించుకున్నాడు. అంతేకాదు "ఎవరో వస్తారని ఏదో చేస్తారని ఎదురుచూసి మోసపోకుమా" అంటూ మనిషికి సినీగీతోపదేశం ఆనాడే చేశారాయన.

'పాడవోయి భారతీయుడా' అనే పాట వింటుంటే ఇది 2004 ఎన్నికల ముందు రాసిన పాటకాదు కదా అన్నంత వర్తమాన సామాజిక వాస్తవికత విశ్వరూపంలా మనసును జిగులు మనిపిస్తాడు. ఆ పాట ఇప్పటికి సరిపోయేంత గొప్పగా రాసినందుకు గర్వపడాలా - ఇప్పటికీ ఆ పాటకు కాలదోషం పట్టించేలా సామాజిక స్థితి మారనందుకు సిగ్గుపడాలో అర్థంకాని మీమాంసలో పడవేస్తుంటాడు శ్రీ శ్రీ.

ఎంత గొప్పకవికైనా - మహాత్మునికైనా ప్రారంభపు గడియలు అందరిలాంటివే - తను మహాప్రస్థానంగా మారక ముందు - సొంత గొంతు రాక ముందు విశ్వనాథ సత్యనారాయణలా పద్యం రాయాలనీ - కృష్ణశాస్త్రిలా ఆత్మాశ్రయ భావ బావుటా ఎగరేయాలనుకున్న ప్రభావానికి లోనైనవాడే. షెల్లి, స్విన్‌బర్న్, నజ్రుల్ ఇస్లాం, హరీంద్రనాథుల ప్రభావం కూడా శ్రీశ్రీ పై లేకపోలేదు. అయితే ఈ సాహిత్యపు మఱ్రి వృక్షాలలోంచి ప్రచండ ప్రభాకరునిలా చీల్చుకురావడానికి 1930 దశకంలో మహాకవి శ్రీశ్రీ పురిటి నొప్పులు పడుతున్నప్పుడు - గుండెలోంచి గొంతులోంచి ధ్వనించిన జయభేరి - గీతాలలోనే మనం నిజమైన శ్రీశ్రీ ని చూస్తాం. "నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను" అని ప్రారంభమయ్యే ఆ గీతం ఎందరికో కంఠస్థం.



నాకు అక్షరాలు రాయడం, చదవడం రాని చిన్న వయస్సులో మా నాన్న ప్రజాకవి సుద్దాల హన్మంతు మహాప్రస్థానం పద్యాలన్నీ కంఠస్థం చేయించిన శ్రీశ్రీ పద్యాలలో ఇదీ ఒకటి. శ్రీశ్రీని ఒక మహాప్రస్థాన మహాకవిగానే కాకుండా - ఒక నవలాకర్తగా - కథా రచయితగా - నాటక రచయితగా - స్వీయాత్మక సాహితీ వేత్తగా మాత్రా చారిత్రక రచయితగా - లేఖలనే పీఠికలుగా వేసుకునేంత అద్భుతంగా రాసిన లేఖా రచయితగా అద్భుత పద్యాలు - జోకులు, చమత్కారాలు 'అబ్బా ఆ శ్రీశ్రీ పాళీకి ఎన్ని కేళీలో' అనిపిస్తాయి.

అతనిదొక విశిష్ట శైలి - ఆయనే

ఒప్పుకున్నట్టుగా పాత వాసనలు పరీమళించే పదబంధాలు పయోధర ప్రచండఘోషం - ఝంఝానిల షడ్జధ్వానం, ఉద్రేకమైన సన్నివేశానికి ఆయన చూపించే శాబ్దిక ప్రభుత్వం "ఔరా" అనిపిస్తుంటుంది.

విప్లవ గీతాలు రాసినపుడు కూడా "

**మూయించిన ఒక వీరుని కంఠం**
**వేయిగొంతుకల విప్లవ శంఖం**
**పతిత దళిత జనరణ హుంకారం**
**ప్రళయ సమయ దిగ్గజ ఘీంకారం"**

ఇలా సంస్కృత సమాసాలతో యుద్ధ వాతావరణాన్ని అనితర సాధ్యంగా ఆవిష్కరిస్తాడు.

మను చరిత్ర - వసు చరిత్రలను రుధిర మథనం గావించిన పాండితీ శౌండీర్యం దండిగా వున్న దండి కవి శ్రీశ్రీ.

హృదయం ఎలా కంపిస్తే ఆ కంపనకి మాటల రూపాన్ని ఇవ్వడం ఆయన సాహితీ స్వాభావిక లక్షణం - అది సామాజిక కవితా ఖండికైనా - సామాన్యుల కోసం రాసే సినీ పాటైనా అంతే - మహాకవుల వాక్యాలను పల్లవులుగా స్వీకరించి రాయడం కూడా శ్రీశ్రీ గారి ఒరవడే -

**"దేవుడు చేసిన మనుషుల్లారా**
**మనుషులు చేసిన దేవుల్లారా"**

పై వాక్యాలు మహాకవి గురజాడ అప్పారావు గారివి అని సాహితీ అధ్యయనం చేసిన చాలామందికి తెలుసు.

అలాగే త్యాగరాజువి - అన్నమాచార్యునివి గీతాల ముకుటాలను వేటూరిగారు, సీతారామశాస్త్రి గారు స్వీకరించి అద్భుతంగా సినీ గీతాలను చేశారు కనుకే

"తెల్లవాడు నిన్ను నాడు భగత్‌సింగ్‌వన్నాడు" అని రాములమ్మలో, " నేను సైతం ప్రపంచాగ్నికి" ఠాగూర్‌లో శ్రీశ్రీ గారి వాక్యాలను సాకీగానూ - పల్లవిగానూ ఈ వ్యాస రచయిత స్వీకరించడం జరిగింది.

దాచుకోకపోవడం, హిపోక్రసీ లేకపోవడం ఆయన నైజం - తెలుగు సినీ కవిని అని చెప్పుకోవడానికి సిగ్గుపడతానంటూ - తెలుగు సినీరంగాన్ని పెద్ద పెద్ద తిమింగలాలున్న సముద్రంతో పోల్చాడు. తన పొరపాటుల్ని కూడా ఎప్పుడూ దాచుకోలేదు. 'అల్లూరి సీతారామరాజు' లో 'ప్రతి మనిషి తొడలుగొట్టి - శృంఖలాలు పడగొట్టి సింహంలా గర్జించాలి' అని ఏకవచనంలో రాయాల్సింది సింహాలై గర్జించాలి అని రాశానని, ఈ పాటకే తెలుగు సినీ ఉత్తమ గీతంగా జాతీయ అవార్డు అందుకున్నానని చెప్పారు. ఏనాడు దేవుణ్ణి నమ్మని శ్రీశ్రీ 'దేవత' చిత్రంలో "బొమ్మను చేసి ప్రాణము పోసి..



ఆడేవు నీకిది వేడుక" ఈ పల్లవి వీటూరి (వేటూరి గారు కాదు సుమా) నుండి స్వీకరించానని నిర్మొహమాటంగా చెప్పుకోవడం శ్రీశ్రీ నిజాయితీ. మహాప్రస్థానంలో 'మరో ప్రపంచం మరో ప్రపంచం మరో ప్రపంచం పిలిచింది' అనే గేయం. ఆది శంకరాచార్య - భజ గోవిందం - భజగోవిందం - గోవిందం భజె మూఢమతే" నడకకు అనుసరణ అన్నాడు శ్రీశ్రీ. "పంతాలు -పట్టింపులు" సినిమాలో 'ఇనుకోరా ఈ మల్లన్న మాటే ఇనుకోరా' అనే పాటలో 'ఈ బతుకుందే ఎంతో బరువు' అని శ్రీశ్రీ రాస్తే, పక్కనే వున్న చదలవాడ కుటుంబరావు గారు "ఈ బతుకుందె మాసెడ్డ బరువు" అని మార్పు సూచిస్తే ఎంతో సవినయంగా స్వీకరించాడు. అదే రాత్రి చదలవాడ గారు బరువైన తన బతుకుని ముగించడం ఒక విషాదాశ్చర్య సత్యం.

రసాలూరే రాజేశ్వరరావుగా పేరుగాంచిన ఎస్.రాజేశ్వరరావు గారు ఏటవాలుగా నవ్వుతూ కవులలోని ప్రతిభను రెచ్చగొట్టే వారట. 'బొబ్బిలియుద్ధం' సినిమాకోసం శ్రీశ్రీ గారితో "మీరు జావళీ కూడా రాయగలరా" అని శ్రీశ్రీ మేధస్సుని గిల్లితే "గలనో- లేనో చూడండని' 'నిను జేర మనసాయెరా - నా స్వామి చనువార దయసేయరా" అతడిచ్చిన ట్యూన్‌కు అలవోకగా కలంతో గిలికి పారేసిన సవ్యసాచి శ్రీశ్రీ.

జావళి రాయడానికి కొన్ని పరిమితులున్నాయ్. సంస్కృత పద పోహళింపులు ఎక్కడ లేకుండా శృంగార రసాత్మకంగా రాయడం జావళీతనం. రూట్‌కెళ్లి (తల్లి వేరులోకి మూలంలోకి) ఆలోచించే తార్కిక శక్తి కంఠదఘ్నంగా వున్న కలం యోధులు ఏ రూట్లో (దారి)నైనా - రాయగలరు అనడానికి ఆయన రాసిన ఎన్నో అందమైన మరుపు రాని పాటలు "ఆకాశవీధిలో అందాల జాబిలి", "నా హృదయంలో నిదురించె చెలి", "పాడవేల రాధికా', 'ఎవరివో నీవెవరివో' - ఇలా ఎన్నో రాశాడు శ్రీశ్రీ - వుంటే ఎన్ని వందలైనా రాసేవాడు కూడా!

బాలభారతంలో "మానవుడే మహనీయుడు" అనే పాట, గాంధారి గర్వభంగంలో "మనుష్యుడిల మహానుభావుడే" అనే శ్రీశ్రీ పాట థాట్‌కు అనుగుణంగా వచ్చిందే.

"రాస్తే ఇలాంటి పాట రాయాలి సరోజా" అని మురిసి పోయిన పాటల్లో 'రాముడు - భీముడు'లో "ఉందిలే మంచికాలం ముందు ముందునా" అన్న పాట ఉంది.

ఒకే రోజు "శ్రీ వళ్ళి" అనే తమిళ చిత్రంలోని పది డబ్బింగ్ పాటలను రాశానన్నాడు శ్రీశ్రీ. తన సినీ గీత రచనా వన్‌డే స్కోర్ చెబుతూ.

ఎన్నో పాటలు నిర్మాత- దర్శకుల కోసం ఉదరపోషణార్థం రాసినపుడే - అద్భుతమైన సినీ మాధ్యమాన్ని సమర్థవంతంగా - సమాజ శ్రేయస్కరంగా ఉపయోగించుకునే పాటలు కొన్ని అత్యంత ప్రభావం కలిగించే విధంగా రాసే అవకాశం సినీరంగంలో వుందని నాలాంటి రచయితలకు రాసి మరీ రస్తా చూపించిన మహాప్రస్థాన కవి శ్రీశ్రీ -"అవకాశం దొరికిన ప్రతి అక్షరంలో శ్రీ శ్రీ కనిపిస్తాడు సరోజా. లేకుంటే మరొకరి చేత రాయించుకొంటారు. నీ కోసం పిల్లలకోసం అయినా రాయాలి. లేకుంటే మన పొయ్యిలో పిల్లులు కాపురం పెడతాయి" అంటూ - అంత గొప్ప కవి కూడా సినీ రంగంలో అన్నేళ్ళు - అన్ని వేల పాటలు రాసినా ఇన్‌సెక్యూరిటీ ఫీలయ్యాడని తెలిసినప్పుడు మనసు 'శివరంజని' అవుతుంది. ఆయనకే తప్పలేదు మనమెంత అని ధైర్యనిట్టూర్పు విడుస్తుంటాం. లోకంలో మనం బాధావమానాలకు గురైన సన్నివేశంలో "దొంగలంజా కొడుకులసలే మెసలే లోకంలో తలవంచుకు వెళ్లిపోయావా నేస్తం' అన్న కొంపెల్ల జనార్దనరావు స్మృతి కవితలోని వాక్యంతో మనల్ని అనునయిస్తుంటాడు శ్రీశ్రీ.

మన దృష్టిలో కవిత్రయం అంటే నన్నయ్య-తిక్కన-ఎఱ్ఱాప్రగడ. కానీ శ్రీశ్రీ దృష్టిలో తిక్కన -వేమన-గురజాడ. వీళ్లే నా కవిత్రయం అంటాడు శ్రీ శ్రీ. నన్నడిగితే గురజాడ-శ్రీశ్రీ-గద్దర్ అంటాను. ఇది అందరు ఆమోదించాలని కాదు. వారి వారి ఆశయాలకనుగుణంగా వారు అనుకునేదే -

ఆయననందరూ ''కమ్యూనిస్టు'' అంటుంటారు. కానీ వినడు ఆయన. నేను కమ్యూనిస్టుని, మార్కిస్టుని అని చెప్పుకోలేదు. కమ్యూనిజం గురించేం తెలియకుండానే నేను అభ్యుదయ మహాప్రస్థానం చేశానంటారు. అయితే ఆ కాలపు సాహితీ సంస్కార ప్రభావం సమకాలిక చారిత్రక ఘట్టాల ప్రభావం (ఉదాహరణకు స్పానిష్‌లో అంతర్యుద్ధం)వుంది అంటూ లండన్ నుండి వెలువడ్డ "అభ్యుదయ రచయితల మానిఫెస్టో'' చదివి 'పొలాలన్ని హలాల దున్ని అంటూ కర్షక వీరుల కాయం నిండా కాలువగట్టి ఘర్మజలానికి ఖరీదు కట్టె



షరాబు లేడోయ్' అంటూ మహోన్నతమైన 'ప్రతిజ్ఞా' గీతం రాశాడు శ్రీశ్రీ.

గురజాడ అప్పారావు రాసిన కన్యాశుల్కం నాటకం శ్రీశ్రీకి నోటికి వచ్చు. దైనందిన జీవితంలో ఎదురయ్యే ఏ సన్నివేశానికైనా కన్యాశుల్కంలోని మాటల్ని మనం ఆశ్చర్యపడేలా అన్వయించగలడు శ్రీశ్రీ.

మన సాహిత్యంలో ఒక మృచ్ఛకటికం - ఒక కన్యాశుల్కం రెండు గొప్పనాటకాలు అని పెన్ను గుద్ది మరీ చెప్పారు శ్రీశ్రీ.

"కమ్యూనిజానికి నిర్వచనం ఏంటని" శ్రీశ్రీని అడిగితే నిజాయితీగా నువు ఇవ్వగలిగిందంతా సమాజానికి ఇచ్చి నీకు కావలసినది సమాజం నుండి తీసుకోవడమేనని, కమ్యూనిజం ఇంకా ఏ దేశంలోనూ రాలేదని, ఇన్నేళ్లుగా కమ్యూనిస్టు దేశంగా పేరుపడిన చైనాలోనూ రాలేదని అన్నాడు శ్రీశ్రీ.

లోకం యొక్క చాంచల్యం (గోపీతనం అంటే గోడమీది పిల్లివాటం) ఎంతద్భుతంగా చెప్పాడు. "నెత్తురు కక్కుకుంటూ నేలకు నే రాలిపోతే నిర్దాక్షిణ్యంగా వీరే - నిప్పులు చిమ్ముకుంటూ నింగికి నేనెగిరిపోతే నిబిడాశ్చర్యంతో వీరే" అని లోకాన్ని దాకరా కొడుతూ నీదైన లక్ష్యానికి సాగిపో అంటాడు శ్రీశ్రీ. తిరువూర్ చంద్ర ప్రతాప్ అనే ఆయన మహాకవి శ్రీశ్రీ కి

"సంప్రదాయ కవిత చక్కగా వ్రాసెడి
ప్రజ్ఞ కలిగినట్టి విజ్ఞులయ్యు
వచన కవితనేల రచియించుచున్నారు
ఛందమేల మీకు శత్రువాయె"

అని పద్యంలో ప్రశ్నిస్తే -

"ఛందమెందు నాకు శత్రువు కాదండి
సంప్రదాయ భక్తి సన్నగిల్లదు
మారిపోవుచున్న మన దేశ కాల -పా
త్రాలననుసరించి రచనమారె'' అని

పద్యంలోనే జవాబు వాగ్రుచ్చిన వాచస్పతి శ్రీశ్రీ.

ఇలా ధారావాహికంగా శ్రీశ్రీ సాహితీ సముద్రాన్ని చెంచాలతో తోడడం సాధ్యమా. (ఇది ఆయన పల్లవే ...

చెంచాతో సముద్రాన్ని తోడడం శక్యమా
కమ్చీతో విమానాన్ని తోల సాధ్యమా'
చిలకా-గోరింకా చిత్రంలోనిది) అని ఈ రచయిత నిశ్చితాభిప్రాయం.

నాకు శ్రీశ్రీ గారితో పరిచయం రెండుసార్లు -ఒకటి ఆలేరులో ట్రయిన్ ఆగినప్పుడు దూరం నుండి శ్రీశ్రీ గారిని చూసి కదులుతున్న ట్రెయిన్‌తో పాటు నడుస్తూ శ్రీశ్రీ గారితో 'మహాప్రస్థానం రచించిన మీ కుడి చేతిని ఒక్కసారి ముట్టుకోవచ్చా" అన్నాను.

ఆయన రవంత తుళ్లిపడి నా చేయిని ఆప్యాయంగా స్పర్శించడం ఆ 'టచ్' తాలూకు అనుభూతి ఇప్పటికీ నాలో తడి ఆరక పోవడం.

ఇక రెండోసారి

నా జీవింతలో తీసుకున్న ఏకైక ఆటోగ్రాఫ్ ఆంధ్ర పరిషత్ హాల్ రాం కోటీలో శ్రీశ్రీ గారిదే. అది ఇప్పుడు లేదు. ఎక్కడో మిస్ అయింది.

ఒకసారి ఆయన అన్న మాటలు చెప్పి ఈ వ్యాసం ముగిస్తాను.

''కు కవుల శైలి నాకు నచ్చదు. గవర్నమెంటాలిటీ నాకు నచ్చదు. డొంక తిరుగుబాట - బుఱ్ర తిరుగుడు మాట నాకు నచ్చదు. రూపాయలు మాటాడే శైలి అసలే నాకు నచ్చదు" అన్నాడాయన.

ఆ మహాప్రస్థాన కవిని

ఆ మహానీ రచయితనీ - మహా కమిట్‌మెంటు వున్న మహాకవి శ్రీశ్రీని (మహాకవికి కూడా నిర్వచనమిచ్చాడు - ఏ కవిని తర్వాత కవులు మనసా, వాచా, కర్మణా త్రికరణ శుద్ధిగా అంగీకరిస్తారో, అనుసరిస్తారో ఆ కవే మహాకవి అన్నాడు శ్రీ శ్రీ) ఇలా అక్షరరూపంగా తలుచుకోవడానికి అంగీకరించిన 'హాసం'కి గొప్ప రచయిత వడ్డెర చండీదాస్ గారి స్టయిల్‌లో కృతజ్ఞతలతో.... కాదు కృతజ్ఞతలతో....

**- సుద్దాల అశోక్‌తేజ**

# Some వీక్షణం

ఆలాపన (వ్యాస సంకలనం)
-వి.ఏ.కె.రంగారావు
**వెల : 250/- రూ॥లు**
**పబ్లిషర్ : డా॥భార్గవి, పొమ్మర్రు,**
bhargavipmr@yahoo.com.in
**ప్రతులకు - విశాలాంధ్ర, నవోదయా**

'ఆలాపన' శీర్షికలో రంగారావు పుస్తకాలనే కాదు, పత్రికలనూ సమీక్షించారు. 39 ఏళ్లగా కర్ణాటక సంగీతంపై వెలువడుతున్న 'గానకళ' గురించి 39 వ వ్యాసంలో, లలిత చిత్రసంగీత ప్రియులకై 15 మాసాలుగా నడుపుతున్న 'రసమయి' గురించి 70 వ వ్యాసంలో, ఆంధ్రప్రభ వీక్లీలో నడిపిన 'మధురగీతాలు' 'కళాదర్శనమ్' 'హరివంశబచ్చన్ ఆత్మకథ' శీర్షికల గురించి 88 వ వ్యాసంలో ముచ్చటించారు. 'హాసం' తొలి మూడుసంచికలు చూడగానే వెంటనే 56 వ వ్యాసంలో పత్రికగురించి తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. (హాసం 5వ సంచికలో పూర్తి వివరాలున్నాయి) 'కొనండి, కొనిపించండి, చేయూత నివ్వండి' అంటూ పాఠకులకు పిలుపునిచ్చారు. 'హాసం'లో వ్రాస్తున్న ఘంటసాల సావిత్రమ్మ గారి 'ఘంటసాల కథ' అందరూ చదవాలి అని 94వ వ్యాసంలో సలహానిచ్చారు.

నచ్చినచోట అడక్కుండానే ఇతరుల కృషిని ఇలా మెచ్చుకునే రంగారావు నచ్చనిచోట అతి కర్కశంగా తిట్టిపోస్తారు. HMV కంపెనీ వారి గురించి 'బ్రిటిషు ఈస్టిండియా కుంఫిణీలాగే యీ కుంఫిణీ కూడా కొల్లగొట్టుతున్నది. నిర్మాణసంస్థల పేర్లు వేయక వాటికి రావలసిన రాయల్టీ గడ్డివాము చేస్తున్నది. తానివ్వవలసిన రాయల్టీ ఎగగొట్టి తందనాలాడుతున్నది' అంటూ విరుచుకుపడ్డారు. ఈ ధర్మాగ్రహాన్ని అర్థం చేసుకోగలం, సమర్థించగలం. కానీ 'రాజేశ్వరరావు-బాలసరస్వతి పాడిన ప్రైవేటు పాటలు నా దగ్గర నూరు నిమిషాలవి ఉన్నవి. కుంఫిణీ గడ్డివాములోని గ్రామసింహంలా వున్నప్పుడు మనమేం చెయ్యగలం' అని వాపోవడం అర్థం చేసుకోలేం. క్యాసెట్ కావచ్చు పుస్తకం కావచ్చు ఫలానాది వెలువరించాలో, మానాలో వాణిజ్యపరమైన లెక్కలు ప్రతిసంస్థకు ఉంటాయి. 'ఆలాపన' వంటి పుస్తకం ఇన్నాళ్లూ ఎందుకు రాలేదు? అని అడిగి లాభమేమిటి? ఆర్థికకారణాలను విస్మరించి కంపెనీపై విరుచుకుపడినా ప్రయోజనం ఉండదు.

ఒక్కోచోట భాష పదును ఎక్కువైపోయి 'తండ్రి' అనవలసినచోట 'అమ్మమొగుడు' అన్నట్టుంటుంది. సాంకేతికంగా అది వాస్తవమే కావచ్చు. కానీ వ్యక్తీకరణ ఎబ్బెట్టుగా ఉండి విషయం మరుగున పడుతుంది.టీవీ ఛానెల్స్‌ను 'కాలువ' అనడంలోనూ, 'యాంకర్'ను 'లంగరు' అనడంలోనూ వెక్కిరింత కనబడుతుంది. 'హీరోపాత్రను రౌడీగా చూపే ఈ రోజుల్లో మా పాటలు దేవులపల్లి పాటల్లా ఎందుకుంటాయం'టూ ఓ రిసెప్షన్‌లో రంగారావుతో వాదనకు దిగిన ఓ పాటల రచయిత గురించి వ్రాస్తూ 'ఆయన కాస్త మందులో ఉన్నాడు, కానీ ఆ మందు అతని వాదన బలాన్ని తగ్గించలేదు' అని అదనపు సమాచారం ఇవ్వడం దేనికి? అలాగే అపజయం పొందిన హిరేన్ బోస్ 'జయదేవ' గురించి చెబుతూ - 'బెంగాలీ వర్షన్‌లో పాటరాని నాయిక హిరేన్ బోస్ తాలూకా అట' - అన్న సమాచారం ఇవ్వడం అవసరమా?


వీఏకె, మన్నాదే

అజ్ఞానంవల్లనో, నిర్లక్ష్యం వల్లనో పుస్తకంలో దొర్లే తప్పులను పొరబాటు అనడం సహజం. కానీ రంగారావు వాటిని 'అబద్ధాలు'గా పేర్కొంటారు. ఏదైనా ప్రయోజనాన్ని ఆశించి చెప్పే అసత్యాన్ని 'అబద్ధం' అనడం రివాజు. హెచ్.ఎం.రెడ్డి 'గృహలక్ష్మి' నిర్మాణసంస్థ పేరును 'రోహిణి'కి బదులు 'రమణి' అని రచయిత వ్రాస్తే దాన్ని పొరబాటనాలా? అబద్ధమనాలా? ఈ పుస్తకంలో 29 వ పేజీలో ఎం.ఎస్.విశ్వనాథన్‌కు బదులు 'ఎం.ఎస్.స్వామినాథన్' అని పడితే 107 పేజీలో 'కన్నెవయసు'(1973) కు మాతృక 'చెంబరత్తి'(1992) అని పడితే నాబోటివాడు వాటిని అచ్చుతప్పులని అనుకుంటాడు. పుస్తకం చివర తప్పొప్పుల పట్టిక ఇస్తే బాగుండేదని ఆశిస్తాడు. అదే రంగారావు గారయితే వాటిని అబద్ధాలు అంటారు. ఓ పుస్తకం గురించి ఘాటుగా విమర్శిస్తూ '.....లాంటి ప్రభుత్వాధికారులు, .....కుర్చీమనుషులు, కమిటీ సభ్యులూ సమకూరితే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ బహుమతి యీ పుస్తకానికి రావచ్చు! హతవిధీ!!' అని వ్రాస్తూ అధికారి పేరు వ్రాశారు. సంస్థాపరంగా పొరబాటు జరిగిందని అనిపించినప్పుడు పదవిపేర విమర్శించవచ్చు. కానీ వ్యక్తి పేరు పేర్కొనడం ఎంతవరకు సమంజసం?

రంగారావు ఒక మిషనరీ. 'చదువులు కొనే కొందరికీ, వాటినమ్మే కొందరికీ సినిమా అంటే ఉండే నిర్లక్ష్యం, దీనివలన ఉత్పన్నమయే తప్పులు బయటకు చెప్పాలి. నిర్లక్ష్యం చేస్తే వారి కర్మ అని ఊరుకోవచ్చు. తప్పులు వ్రాస్తే ఊరుకోకూడదు. వాటినెందరో తిరిగి రుబ్బుతారు. ఈ వాస్తవమేథాన్ని నేను ఆపలేకపోయినా అడ్డే ప్రయత్నమైనా చేయాలి.' అని మనసా నమ్మి వాచా అమలు చేసే వ్యక్తి. కానీ ఈ క్రమంలో అక్కడక్కడ దూకుడు కనబడుతుంది.

'దివ్యప్రేమ' కాన్సెప్ట్ గురించి 'హాసం' ఆడియోరివ్యూను ప్రస్తావిస్తూ 'ఈ విషయాలు సినిమా పాటల గురించి, ప్రైవేటు పాటల గురించీ నా కన్నా ఎంతో ఎక్కువ తెలిసిన రాజాకు - తెలియకపోవడం నమ్మశక్యంగా లేదు' అని వ్రాశారు. రాజాతో ప్రత్యక్షపరిచయం లేకుండానే ఆయన తెలివిడి గురించి ఒక అంచనాకి వచ్చి, కావాలనే రాజా తనకు ఇవ్వాల్సిన క్రెడిట్ ఇవ్వలేదన్న అభిప్రాయానికి రావడం దేనికి? (ఓ పత్రికలో వెలువడిన విషయానికి సంబంధించిన విమర్శ ముందు ఆ పత్రిక వారికి వ్రాయకుండా తన శీర్షికలో వ్రాసుకోవడం సంప్రదాయ బద్ధమేనా?) 'సంశయలాభం'(బెనిఫిట్ ఆఫ్ డౌట్) ఇచ్చి చూడవచ్చుగా!

ఉదాహరణకి 'పల్లెపడుచు'లోని ''ఏరు నవ్విందోయ్' పాట తనపేర వెలువడిందని ఆరుద్ర 'సినీమినీ కబుర్లు' లో వ్రాశారు. 'ఆలాపన' 95 వ వ్యాసంలో మల్లాదివారి పేర వెలువడినట్లు వ్రాశారు. సంశయలాభం ఇచ్చి ఓపికగా చూస్తే 'క్రెడిట్స్‌లో, పాటల పుస్తకంలోను నా ఒక్కడికే క్రెడిట్స్ ఇచ్చారు' అని ఆరుద్ర వ్రాయగా, 'రికార్డుపైన రచన మల్లాది రామకృష్ణశాస్త్రి అని ఉంది' అని రంగారావు వ్రాశారు. తొందరపడితే వారిదో, వీరిదో తప్పనేసేవాళ్లం!

ఈ మే 11తో 75 సంవత్సరాలు పూర్తి చేసుకున్న రంగారావు స్వీయచరిత్ర వ్రాసే ఉద్దేశ్యంలో ఉన్నట్టు ఇంటర్వ్యూలో అన్నారు. ఆయనకున్నన్ని రకరకాల అభిరుచులు పాఠకుడికి కూడా ఉంటే తప్ప ఆ బహుముఖప్రజ్ఞాశాలి ఆత్మకథను ఆస్వాదించడం కష్టం. ఆ లోపున కళపై, కళామూర్తులపై రంగారావు తెలుగు, ఇంగ్లీషు భాషల్లో వ్రాసిన వ్యాసాలు సేకరించి పుస్తకంగా వేస్తే బాగుంటుంది. కానీ ఆ పుస్తకం దీనంత సులభంగా తయారవ్వదు. ఆయన వ్రాసిన వ్యాసాలన్నిటినీ సేకరించి గుదిగుచ్చాలి. సంబంధిత ఫోటోలు జోడించాలి. 'ఆలాపన'లో ఏ కళాకారుడి గురించీ సమగ్రచిత్రం లభించటంలేదన్న లోటు ఆ పుస్తకంలో తీరుతుంది. ఉదాహరణకి సి.రామచంద్ర గురించి, వయలార్ రామవర్మ గురించి తన భాషాపాటవం ప్రదర్శిస్తూ రంగారావు పదేసి పేజీల వ్యాసం వ్రాస్తే ఆ వ్యాసాలు శిరోధార్యాలవుతాయి. ఆ వ్యాస సంపుటి పాఠ్యపుస్తకాల స్థాయిని సంతరించుకుంటుంది. ఈ పబ్లిషర్లే ఆ పనినీ చేపడితే మరింత అభినందనీయులవుతారు.

**- ఎమ్బీయస్ ప్రసాద్**

# 'హాసం' క్లబ్ కార్య

## రాజమండ్రి

'హాసం క్లబ్' తృతీయసమావేశం మే 16న కృష్ణారావు ప్రార్థనతో ప్రారంభమయి, పాటకారి జిత్‌మోహన్‌మిత్ర మాటకచేరీతో ముందుకుసాగింది. ప్రభల సుబ్రహ్మణ్యశర్మ సాహిత్యంలో చమత్కారాలను ఉటంకిస్తూ 'పాలసముద్రంలో పవళించే పరంధాముడు గొల్లవారింట్లో పాలను దొంగిలించనేల' అనే వేమన పద్యాన్ని ఉదాహరణగా పేర్కొన్నారు. కృష్ణమాచార్యులు తెలుగులోకి రూపాంతరం చెందిన పాత హిందీపాటలను జ్ఞప్తికి తెచ్చారు. రిటైర్డ్ గవర్నమెంటు హాస్పటల్ సూపరిండెంట్ డా॥ తేతలి వెంకటేశ్వరరావు పాడటం, నవ్వటం వలన ఊపిరితిత్తులు వ్యాకోచించి ఆక్సిజన్ ఎక్కువగా తీసుకోవటం వలన రోగనిరోధక శక్తి పెరుగుతుందని వివరించారు. 'హాసం'లో ప్రచురించిన 'కురులు కురులతో కలబడితే' ప్యారడీపాటను విజయలక్ష్మి పాడి వినిపించారు. వైజాగ్ నుండి సన్యాసిరావు వ్రాసిపంపిన నవ్వులలేఖను పిఎస్‌బి శ్రీదేవి చదివి వినిపించారు.

ఎస్వీ రాయుడు, జోరాశర్మ, ఫణి నాగేశ్వరరావు, NRK మూర్తి R సూర్యనారాయణ, మాటూరి రంగారావు, నందుల వెంకటేశ్వరరావు, డి.మురళీధరరావు, RS వెంకటేశ్వరరావు VSRమూర్తి, M సురేష్, రాకా సుధాకర్, మహాలక్ష్మి, చిరంజీవులు ప్రఘోష్, ఆసీష్ జోకులు, పాటలు వినిపించగా ఉత్తమజోక్ చెప్పిన రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు బహుమతి గెలుచుకున్నారు.

కార్యక్రమానికి ముందు 'సురేఖ' కార్టూన్ల ప్రదర్శన ఏర్పాటయింది. నేపథ్యంలో వినిపించిన సాలూరి రాజేశ్వరరావు పాటలు ప్రత్యేక ఆకర్షణగా నిలిచాయి. స్కిట్ ప్రదర్శనతో బాటు తన చెణుకులతో సభను ఆద్యంతం రక్తి కట్టించిన డి.వి.హనుమంతరావు తదుపరి సమావేశం 20.6.04 మూడవ ఆదివారం సాయంత్రం 5.30 కు అక్కడే జరుగుతుందని తెలిపారు. ఈ 'హాసం క్లబ్' కార్యక్రమాన్ని ఈ టీవీ 2 వారు చిత్రీకరించి 17 05 04 నాటి 'ఆంధ్రావని'లో ఉదయం 7.55 గం॥లకు ప్రసారం చేశారు.

అంతకంతకూ పెరుగుతున్న ఆదరణ, ఆడియన్స్ లో ఓ భాగం





'సురేఖ' కార్టూన్ల ఎగ్జిబిషన్, క్రింద వరుసలో బాపు, ముళ్లపూడి పుస్తకాలు

### సమావేశంలో వినబడిన జోకులు

✦ ఎస్.ఎస్.కృష్ణన్, టీ.యే.మధురం భార్యాభర్తలు. తమిళ సినీరంగాన పేరుకెక్కిన హాస్యజంట. వారిద్దరూ ఓ సారి హోటల్ కెళితే సర్వర్ అడిగాడట - 'కాఫీయా? టీయా? ఏం తీసుకుంటారు?' అని.

తన భార్య కేసి ఓరగా చూస్తూ కృష్ణన్ చెప్పాడట - "టీయే మధురం!"

✦ ప్రఖ్యాత నటీమణి కన్నాంబ భర్త కడారు బాల నాగభూషణం గొప్ప నిర్మాత, దర్శకుడు. ఆయన తన పేరును కె.బి.నాగభూషణంగా రాసుకునేవాడు. తెరవెనుక నున్న వారికంటె తెరముందు ఉన్నవారికే ఎక్కువ గుర్తింపు ఉంటుందన్న విషయాన్ని చెబుతూ ఆయన మిత్రులు "నీ పేరులో కె.బి. అంటే 'కన్నాంబ భర్త' అనుకుంటున్నారోయ్" అని ఆయనను ఉడికించేవారట!

కస్టమర్ - (చుట్టలషాపు యజమానితో) మీరే బ్రాండ్ చుట్టలు కాలుస్తారండీ?

యజమాని - నేనసలు చుట్టలు కాల్చనండి. వ్యాపార రహస్యం చెప్పమంటారా, ఏ వస్తువు అమ్మే వ్యాపారస్తుడు ఆ వస్తువును వాడకూడదు. మిఠాయిషాపువాడు కొట్లో మిఠాయంతా వాడే తినేస్తే నష్టం కాదూ!

కస్టమర్ - మీ ఫిలాసఫీ బాగుంది కానీ దయచేసి బట్టలకొట్టు మాత్రం పెట్టకండేం!

'హాసం క్లబ్స్' ప్రారంభించదలచిన వారు సంప్రదించవలసినది
శ్రీ ఎస్.వి.రామారావు, 040-2416 0279, 98491 39030

# క్రమ విశేషాలు

## ఏలూరు

మే 16 సాయంత్రం ఏలూరు 'హాసం క్లబ్' కన్వీనర్లలో ఒకరైన డి.రామకృష్ణారావు గారి వేడపై జరిగిన తృతీయ కార్యక్రమంలో పలువురు పాల్గొని జోక్స్, పాటలు వినిపించారు. ప్రఖ్యాత స్కిన్ డాక్టరు కె.కృష్ణమూర్తి ముఖ్య అతిథిగా వచ్చి జీవితంలో హాస్యం ఆవశ్యకతను వివరించారు. ఆహ్లాదకర వాతావరణంలో జరిగిన కార్యక్రమం గ్రీష్మంలో హేమంతాన్ని తీసుకువచ్చిందని సభకు విచ్చేసినవారు ప్రశంసించారు. పత్రికలద్వారా ముందుగా సమాచారాన్ని అందజేసి ఈ క్లబ్ నిర్వహణ గురించి పదిమందికీ తెలియజేయాలని వక్తలు కోరారు. సంగీత విభావరులు నిర్వహించేవారు పాల్గొని పాటల జనరంజకత్వాన్ని గురించి సోదాహరణంగా వివరించాలని, పాతకాలం నాటి పద్యాలను రాగయుక్తంగా పాడి యువతరాన్ని ఆకట్టుకోవాలని పలువురు అభిలషించారు. ఆహూతులకు బులియన్ మర్చంట్ శీమా రామమోహనరావు జ్యూయల్ కంటెయినర్ బ్యాగ్స్ పంచిపెట్టారు. జూన్ నెల కార్యక్రమం 20 వ తారీకున ఇక్కడే జరుగుతుందని కన్వీనర్లు తెలిపారు.



జోక్ చెప్పి బహుమతి గెలుచుకున్న డా॥బి.ఎస్.ప్రసాద్, వేదికపై శ్రీ డి.రామకృష్ణారావు, డా॥కృష్ణమూర్తి

**ఏలూరు 'హాసం క్లబ్' లో వినబడిన జోక్**

బస్‌స్టాపులో ఒకాయన - మీరే బస్ కోసం నిలబడ్డారండి?
రెండో ఆయన - ఒకటో నెంబరు, మరి మీరు?
మొదటాయన - మూడో నెంబరు, అవునూ ఆ వచ్చే బస్ నెంబరేమిటి?
రెండో ఆయన - పదమూడో నెంబరు... హమ్మయ్య,.. ఇద్దరి నెంబర్లూ కలిసే వచ్చాయి. రండి ఎక్కేద్దాం.

## విశాఖపట్టణం

మహారాణిపేట జిల్లా కేంద్ర గ్రంథాలయంలో మే 16 న జరిగిన సమావేశంలో ప్రియ అతిథిగా వచ్చిన రంగస్థల, సినీనటుడు కళ్ళు చిదంబరం తను సెంటిమెంటుగా వాడే పాత సువేగా మోపెడ్‌ని ట్రాఫిక్ పోలీసులు పట్టుకుని పెట్టిన పాట్ల గురించి చెప్పి నవ్వుల జల్లు కురిపించారు. సూరిశెట్టి లీలారాణి 'సత్యం శివం సుందరం' పాటతో సభికులను తన్మయులను గావించారు. విశాఖ హ్యూమర్ క్లబ్ కళాకారులు శివరామకృష్ణ, ఆర్.ఎస్.గోపీకృష్ణ, నండూరి ప్రభాకర్ ప్రదర్శించిన స్కిట్స్, శ్రీనివాసరావు ఆలపించిన సాలూరు రాజేశ్వరరావు గీతం 'పాట పాడుమా కృష్ణా' రక్తికట్టగా వింజమూరి రామకుమార్ 'ప్రేమ్‌పూజారి' హిందీపాట పాడుతూ లవకుశ పద్యంలోకి జారడం వెరైటీగా ఉంది. స్వర్ణ, చక్రధర్, సిహెచ్.ఆర్.కె.మోహన్ హాస్యకవితలు వినిపించారు.

కన్వీనర్లలో ఒకరైన మస్తాన్‌రెడ్డి సెల్‌ఫోన్ కవిత వినిపించగా, మరొక కన్వీనర్ వేదికపై కార్యక్రమం నిర్వహించడంతోబాటు ప్యారడీపాటలు, బుల్లితెర పజ్యాలు వినిపించారు. అనేకమంది జోక్స్, సాంగ్స్ వినిపించారు. చోడవరం నుండి వచ్చిన కలీముల్లా 'బాబీ' పాటకు ప్యారడీ పాట వినిపించారు. పాటలకు కీబోర్డు పై ఎ.జగన్, తబలాపై ఆనంద్, జీవితేశ్వరరావు వాద్యసహకారం అందించారు. తన హాస్యరచనల ద్వారా కూడా ప్రసిద్ధి చెందిన ప్రొ॥ కవనశర్మ ప్రభృతులు హాజరయిన ఈ సభలో డాక్టర్ మోటూరి రామకృష్ణ మాట్లాడుతూ "హాసం క్లబ్ కార్యక్రమానికి వచ్చేముందు మీ పల్స్‌రేటు చూసుకోండి. తిరిగి వెళ్లినతర్వాత మళ్లీ చూసుకోండి. హాస్యం, సంగీతం ఎంత ఆరోగ్యాన్ని ప్రసాదిస్తాయో మీకే స్వయంగా తెలుస్తుంది." అన్నారు. ఈ కార్యక్రమాన్ని ఆంధ్రహోటల్ ప్రొప్రయిటరు శివకుమార్ రెడ్డి స్పాన్సర్ చేశారు. తదుపరి సమావేశం జూన్ 20 మూడవ ఆదివారం సాయంత్రం అక్కడే జరుగుతుందని కన్వీనర్లు తెలిపారు.

**విశాఖ 'హాసం క్లబ్'లో వినబడిన కొన్ని కవితలు, జోక్స్**

### బుల్లితెరపై బుల్లిపజ్యాలు

అత్తమామ గార్ల అంతమొందించుటకు
అర్థమైన ప్లాన్లు అమలు జరుపు ఆడవిలన్లు
అంతులేని అరవడబ్బింగు సాగతీత సీరియళ్లు
బుల్లి తెరకు సాటి భువిని లేదు

పగలురేయనక పనిపాట్లు చెడగొట్టి
ఆడువారి నేడిపించి, పిల్లలకు కండ్లజబ్బు నిచ్చి
పిచ్చియాడ్సుతో పెద్దలకు వర్రీలు తెగ పెంచి
బుల్లితెరకు సాటి భువిని లేదు

చెయ్యికోసుకుంటే వెయ్యిరూకలని అబ్బాయిలను
వలువలూడదీయటమే ఫ్యాషనని అమ్మాయిలను
ప్రేరేపించి వెర్రెక్కించి పెడదారుల పట్టించు
బుల్లితెరకు సాటి భువిని లేదు

- టి.ఎల్.ప్రసాద్

**సెల్ కవిత**

జేబులో సెల్లు - గూబపై సెల్లు
బైక్‌పై సెల్లు - స్టేజిపై సెల్లు
కారులో సెల్లు - కాన్ఫరెన్సులో సెల్లు
బెడ్‌రూమ్‌లో సెల్లు - బాత్‌రూములో సెల్లు
ఆలుబిడ్డలతో మాటలు మాత్రం నిల్లు

**జూన్ 6న జగ్గంపేట(తూ.గో.జి.)లో హాసంక్లబ్ ప్రారంభం**

వివరాలకు
శ్రీ సూర్యనారాయణ
08852-234185

జూన్ 6 రాజేంద్ర క్రిషన్ జయంతి సందర్భంగా...



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : అనార్‌కలీ
రచన : రాజేంద్రక్రిషన్
సంగీతం : సి.రామచంద్ర
గానం : లతా మంగేష్కర్
అభినయం : బీనా రాయ్, ప్రదీప్‌కుమార్

యే జిందగీ ఉసీకీ హై, జో కిసీ కా హోగయా
ప్యార్ హీ మేఁ ఖోగయా, యే జిందగీ ఉసీ కీ హై
యే బహార్, యే సమా, కెహ్ రహా హై ప్యార్ కర్
కిసీ కీ ఆర్‌జూ మేఁ అప్‌నే దిల్‌కో బేకరార్ కర్
జిందగీ హై బేవఫా, జిందగీ హై బేవఫా, లూట్ ప్యార్ కా మజా ॥యే జిందగీ॥
ధడక్ రహా హై దిల్ తో క్యా, దిల్ కీ ధడ్‌కనేఁ న గిన్
ఫిర్ కహాఁ యే ఫుర్‌సతేఁ ఫిర్ కహాఁ యే రాత్ దిన్
ఆ రహీ హై యే సదా, ఆ రహీ హై యే సదా, మస్తియోఁ మేఁ ఝూమ్‌జా ॥యే జిందగీ॥

---

యే జిందగీ ఉసీకీ హై, జో కిసీ కా హో గయా
ప్యార్ హీ మేఁ ఖోగయా, యే జిందగీ ఉసీకీ హై
జో దిల్ యహాఁ న మిల్ సకే, మిలేంగే ఉస్ జహాన్ మేఁ
ఖిలేంగే హస్రతోం కే ఫూల్, జాకే ఆస్మాన్ మేఁ
యే జిందగీ చలీ గయీ జో ప్యార్ మేఁ తో క్యా హువా ॥యే జిందగీ॥
సునాయెగీ యే దాస్తాఁ, షమా మేరే మజార్ కీ
ఫిజా మేఁభీ ఖిలీ రహీ యే కలీ అనార్ కీ
ఇసే మజార్ మత్ కహో, యే మహల్ హై ప్యార్ కా ॥యే జిందగీ॥
అయ్ జిందగీ కీ షమా ఆ, తుఝే గలే లగావూఁ మైఁ
తుఝీ మేఁ డూబ్ జావూఁ మైఁ, జహాఁ కో భూల్ జావూఁ మైఁ
బస్ ఎక్ నజర్ మేరే సనమ్, అల్‌విదా అల్‌విదా
అల్‌విదా... అల్‌విదా... అల్‌విదా... అల్‌విదా



ముందు పాట రాయించుకుని, దానికి ట్యూన్ కట్టే సంగీత దర్శకులపై ఆ పాట సాహిత్యం ప్రభావం ఉంటుందని వేరే చెప్పక్కరలేదు. అలా చేసినవారిలో సి.రామచంద్ర, మదన్‌మోహన్ ప్రముఖులు. మరి వారికి రెగ్యులర్‌గా పాటలు వ్రాసిన రాజేంద్రక్రిషన్ ప్రతిభ వారి పాటల్లోని మాధుర్యానికి ఒక కారణమని అనడంలో అతిశయోక్తి ఉండదు కదా!

1919 జూన్ 6న పుట్టిన రాజేంద్ర క్రిషన్ చిన్నతనం నుంచే కవిత్వం పట్ల ఆకర్షితులయ్యారు. పెద్దయ్యాక ఒక మునిసిపల్ ఆఫీస్‌లో క్లర్క్‌గా ఉద్యోగం వచ్చింది. 1942 దాకా ఆ ఉద్యోగం చేసినా కవిత్వం పట్ల ఆసక్తితో రచయితగా మారటానికి బొంబాయి చేరారు. 1947లో వచ్చిన 'జంజీర్'లో ఆయన పాటలు వ్రాశారు. అదే సంవత్సరం వచ్చిన 'జన్‌తా' చిత్రానికి స్క్రిప్ట్ అందించారు. దురదృష్టవశాత్తు రెండు చిత్రాలూ పరాజయం పొందాయి. 1948లో వచ్చిన 'ఆజ్ కీ రాత్'తో ఆయన విజయాన్ని చవిచూశారు. 1949లో శ్యామ్‌సుందర్ స్వరపరచిన 'లాహౌర్', హుస్న్‌లాల్-భగత్‌రామ్‌ల 'బడీ బెహన్' చిత్రాలలోని ఆయన పాటలు అమిత ప్రజాదరణ పొందాయి. 'బడీ బెహన్' చిత్రం సిల్వర్ జూబ్లీ జరుపుకుంది. ఆయనకు తమిళ భాష కూడా తెలియటంతో ఏవీయమ్ సంస్థ నిర్మించిన హిందీ చిత్రాలకు ఆయననే ఎంచుకునేవారు. ఏవీయమ్ సంస్థకు ఆయన 18 స్క్రిప్టులు వ్రాశారు.



ఆయన కలిసి పనిచేసిన సంగీత దర్శకులలో సజ్జాద్ హుసేన్ (సైయ్యాఁ, సంగ్‌దిల్), ఎస్.డి.బర్మన్ (బహార్, సజా, ఏక్ నజర్), సి.రామచంద్ర (అల్‌బేలా, అనార్‌కలీ), చిత్రగుప్త (భాభీ, కంగన్), సలిల్ చౌధురి (ఛాయా), రవి (ఖాన్‌దాన్, దో బదన్), మదన్‌మోహన్ (ఏక్ కలీ ముస్కాయీ, సంజోగ్, అదాలత్, దేఖ్ కబీరా రోయా), ఆర్.డి.బర్మన్ (పడోసన్), కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ (గోపీ, జానీ మేరా నామ్, బ్లాక్‌మెయిల్), లక్ష్మీకాంత్ ప్యారేలాల్ (ఇంతకామ్) ఉన్నారు. హేమంత్‌కుమార్‌తో చేసిన 'నాగిన్' చిత్రంలోని 'తన్‌డోలే మేరా మన్ డోలే' ఎంత హిట్టో ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. ఆయనకు అవార్డులు కాస్త ఆలస్యంగానే వచ్చాయి. 1965లో 'ఖాన్‌దాన్' చిత్రంలోని 'తుమ్హీ మేరే మందిర్' పాటకు ఆయనకు ఫిలింఫేర్ అవార్డు వచ్చింది.

ఆయన వ్రాసిన క్లాసిక్ గీతాలలో మచ్చుకి కొన్ని - 'యే జిందగీ ఉసీకీ హై', 'ఇత్‌నా న ముఝ్‌సే తూ ప్యార్ బఢా', 'చల్ ఉడ్‌జారే పంఛీ', 'ధీరే సే ఆజా రే', 'న తుమ్ బేవఫా హో', 'హమ్ ప్యార్ మేఁ జల్‌నే వాలోఁకో', 'వో భూలీ దాస్తాఁ', 'ఎక్ చతుర్‌నార్', 'యూఁ హస్రతోఁ కే దాగ్', 'పల్ పల్ దిల్ కే పాస్', 'అ జానేజాఁ', 'జబ్ చలీ ఠండీ హవా' ఈ పాటలు చాలు ఆయన గొప్పదనాన్ని తెలియజేయటానికి.

సి.రామచంద్ర పాటలలో కొన్ని ట్యూన్లు తెలుగు 'అనార్‌కలి' కోసం ఆదినారాయణరావు గారు అనుసరించారు. తెలుగులో కూడా అద్భుతమైన విజయాన్ని సాధించాయి ఆ ట్యూన్లు. ముఖ్యంగా 'జీవితమే సఫలము' (యే జిందగీ ఉస్‌కీ హై), రాజశేఖరా (జాగ్ దర్ద్-ఎ-ఇష్క్ జాగ్) పాటలు ఇప్పటికీ సజీవంగా ఉన్నాయి.

అనార్ అంటే దానిమ్మ. కలీ అంటే మొగ్గ. అనార్‌కలీ అంటే దానిమ్మ మొగ్గ. ఓ అందగత్తెకు అక్బర్ పాదుషా ఇచ్చిన బిరుదు అది. సలీమ్ అనార్‌కలీల ప్రేమ సంగతి తెలిసిన తర్వాత అదే అక్బర్ పాదుషా అనార్‌కలీని సజీవసమాధి చేయిస్తాడు. ఈ ప్రేమకథ అమరంగా నిలిచిపోయింది. ఇదే కథ ఆధారంగా వచ్చిన 'ముగల్-ఎ-ఆజమ్' అఖండ విజయాన్ని సాధించింది.



'యే జిందగీ ఉస్‌కీ హై' పాట సలీమ్ అనార్కలీలు ప్రేమ పరవశంతో ఉన్నప్పుడు వచ్చే పాట. అతన్ని మామూలు సిపాయి అనుకుని ప్రేమించింది ఆమె. అతని ప్రేమ మాధుర్యానికి మైమరచిపోయింది. ప్రేమను ఆస్వాదించే వారిదే జీవితం అని పాడుతోంది.

జిందగీ అంటే జీవితం. 'కిసీ కా హోనా' అంటే ఒకరి సొంతమవటం. 'ఖో జానా' అంటే మైమరచిపోవటం అనే అర్థం వస్తుంది ఇక్కడ.

**'జీవితమంటే వారిదే, ఒకరి సొంతమైన వారిదే**
**ప్రేమకంకితమైన వారిదే, వారిదే జీవితం'**

ఒకరికి అంకితమైనదే జీవితం అని ఎంతో గాఢమైన విషయాన్ని సునాయాసంగా చెప్పేశారు. ఆధ్యాత్మికంగా ఆలోచించినా మరొకరి కోసం జీవించడమే సరైనది అనే విషయం ఇందులో ఇమిడింది. అందుకే 'ప్రేమే దైవం' అంటారు. తెలుగు పాటలో 'జీవితమే సఫలము' అనటం ఆ భావాన్ని మరింత ఉదాత్తమైన స్థాయికి తీసుకువెళ్ళింది.

బహార్ అంటే వసంతం. సమా అంటే సమయం. ఆర్‌జూ అంటే ఆశ, కోరిక. బేవఫా అంటే మోసకారి, నమ్మదగనిది. బేకరార్ అంటే తపించటం, 'మజా లూట్‌నా' అంటే ఆస్వాదించటం.

**'మధురమైన ఈ సమయం, ఈ వసంతం**
**ప్రేమకు పురికొల్పుతున్నాయి, తపించమన్నాయి**
**వగలమారి ఈ జీవితానిది రేపు ఏదారో**
**వలపు కౌగిలి బిగించు ఈ నిమిసమే'**

ప్రకృతి అంతా ప్రేమమయం. ప్రకృతి ఇచ్చే సందేశం కూడా ప్రేమించమనే.

ఒకరి కోసం నిరీక్షించటంలో ఆనందం ఉంది. జీవితం ఎప్పుడు ఏ మలుపు తిరుగుతుందో ఎవరికీ తెలియదు. కాబట్టి ఈ తరుణంలో ప్రేమను ఆస్వాదించాలి. ఈ క్షణంలో జీవించాలి.

ధడ్‌కన్ అంటే గుండె సవ్వడి. ఫుర్‌సత్ అంటే సావకాశం, తీరిక. సదా అంటే పిలుపు. మస్తీ అంటే ఆనందం. ఝూమ్‌నా అంటే ఆడటం, నృత్యం చేయటం. రాత్-దిన్ అంటే రేయి పగలు.

**'ఈ మది కీ ఆరాటమేల ?**
**గుండె చప్పుళ్ల లెక్క నీకేల?**
**ఈ అవకాశం మరల లభించేనా?**
**ఈ నిశావిలాసం మరల దొరికేనా?**
**సుఖాల తేలియాడ పిలుపదే**
**వినిపిస్తున్నది నాకు పదే పదే'**

గుండె వేగంగా కొట్టుకుంటోందని జంకి ప్రేమను దూరం చేసుకోకూడదు. అంటే హృదయానికి గాయం అవుతుందని భయపడి ప్రేమించటం మానకూడదు. హృదయం స్పందించినపుడే ప్రేమను వ్యక్తపరచాలి. మళ్ళీ ఆ అవకాశం రాకపోవచ్చు. ప్రేమ అందించే ఆనందానుభూతిలో ఓలలాడమని ప్రకృతి పిలుపునిస్తోంది.

చిత్రం చివర్లో అనార్‌కలీని సజీవ సమాధి చేసేటపుడు ఈ పాట రెండవ వెర్షన్ వస్తుంది. సమాధి చేయబడే అనార్‌కలీ గొంతులో దుఃఖం కన్నా తమ ప్రేమ ఈ లోకంలో కాకపోతే ఆ లోకంలో గెలుస్తుందనే విశ్వాసం ఎక్కువ

ధ్వనిస్తుంది. ప్రేమ పరవశంలోనూ, వియోగ విషాదంలోనూ ఒకే ట్యూన్ అద్భుతంగా పలికింది.

'మిల్‌నా' అంటే కలవటం. జహాన్ అంటే లోకం. మిల్‌నా అంటే విరియటం. హస్రత్ అంటే ఆశ, కోరిక. అస్మాన్ అంటే ఆకాశం.

**'ఇహన కలవని మనసులు మరో లోకాన కలుస్తాయిలే**
**గగనానికి పోయిన పిదప ఆశల కుసుమాలు విరిసేనులే**
**ప్రేమ పథాన ప్రాణమే పోయినా ఏమౌనులే'**

ఈ లోకంలో కలవలేకపోయినా మరో లోకంలో కలుసుకుంటామని ఆమె ధైర్యంగా పలుకుతోంది. ప్రేమ కోసం జీవితాన్ని ధారపోస్తున్నా ఆమెకు ఏ చింతా లేదు.

దాస్తాం అంటే గాథ. షమా అంటే దీపం. మజార్ అంటే సమాధి. ఫిజా అంటే శిశిరం. మహల్ అంటే సౌధం.

**' దీపం చెబుతుంది నా సమాధి ప్రణయగాథ**
**శిశిరాన కూడా విరిసి ఉందీ దానిమ్మ మొగ్గ**
**సమాధి కాదిది ప్రేమ మందిరమే'**

తన సమాది వద్ద వెలిగే దీపమే తన కథ చెబుతుందని ఆమె అంటోంది. ఆకులు రాలే కాలంలో కూడా ఈ దానిమ్మ మొగ్గ (అనార్‌కలీ) విరిసే ఉంది. ప్రతికూల పరిస్థితులకు వాడిపోలేదు. ఆమె సమాధి ఒక ప్రేమ సౌధం వంటిది. ప్రేమ కోసం ప్రాణాలర్పించి చరితార్థురాలయింది ఆమె.

'జిందగీ కీ షమా' అంటే జీవనజ్యోతి. 'గలేలగానా' అంటే కౌగిలించుకోవటం. 'డూబ్ జానా' అంటే మునిగిపోవటం, కలిసిపోవటం, నజర్ అంటే చూపు. సనమ్ అంటే ప్రియుడు. అల్‌విదా అంటే వీడ్కోలు.

**'ఓ జీవనజ్యోతీ, రా, నిను అక్కున చేర్చుకుంటా**
**నీలో ఐక్యమైపోతా, ఈ లోకాన్ని మరచిపోతా**
**కడసారి చూపు సారించు ఓ ప్రియా**
**పోయిరానా, ప్రియా, పోయిరానా'**

చివరి క్షణాలలో కూడా ఆమె మృత్యువు గురించి భయపడకుండా జీవితంలో ఐక్యమైపోయి ఈ లోకాన్ని మరిచిపోతానంటోంది. కానీ ప్రియుడి కడచూపు కోరుకుంటోంది. ప్రేమకున్న సున్నితత్వమది. ప్రేమకున్న శక్తి అది. ప్రేమ కోసం మరణించటానికి వెనుకాడనివారు ప్రేమించిన వారిని ఒకసారి చూడటానికి తపించిపోతారు.

మూడు వందల చిత్రాలకు పైగా పాటలు వ్రాసి కమర్షియల్ రైటర్‌గా రాజేంద్రక్రిషన్ సినీ జీవితంలో అయనకు రావలసినంత గుర్తింపు రాకపోయినా ఆయన పాటలు ఆయన గొప్పదనాన్ని చాటుతూనే ఉన్నాయి.

**- పి.వి.సత్యనారాయణరాజు**

## హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

### 1963

చిత్రగుప్త కు 'తుమ్‌నే హసీ హి హసీ మే', 'ఘర్ బసాకే దేఖో', హేమంత్‌కుమార్ కు 'జబ్ జాగ్ ఉఠే అర్మాన్', 'బిన్ బాదల్ బర్సాత్', మదన్ మోహన్‌కు 'వో జో మిల్‌తే థే కభీ', 'అకేలీ మత్ జయ్యో' లు తప్ప ఈ సంవత్సరం చెప్పుకోతగ్గ హిట్స్ ఏమీ లేవు.

నౌషాద్ తన 60లలో అతి పెద్ద మ్యూజికల్‌హిట్ 'మేరే మెహబూబ్' తో సాధించారు. రెండు వెర్షన్స్‌తో (లతా,



రఫీ)వచ్చిన టైటిల్ సాంగ్‌తో పాటు 'మేరే మెహబూబ్ మేఁ క్యా నహీఁ వో తో లాఖోఁ మే ఏక్ హై'(లతా, ఆశా), 'జానేమన్ ఇక్ నజర్ దేఖ్ లే, తేరే సదికే ఇధర్ దేఖ్ లే'(లతా, ఆశా), 'ఆజ్ ఫర్‌కత్ కా ఖ్వాబ్ టూట్ గయా, మిల్ గయే తుమ్ హిజాబ్ టూట్ గయా...తుమ్‌సే ఇజహారే -హాల్ కర్ బైఠే..'(రఫీ), 'పాస్ రహతే హుయే భీ తుఝ్‌సే బహుత్ దూర్ హై హమ్...తేరే ప్యార్ మే దిల్‌దార్ జో హై (లతా), 'ముహబ్బత్ కో యహాఁ తక్ ఆజ్ కే ఇన్సాన్ లే ఆయే.... అల్లాహ్ బచాయే నౌజవానోం సే'(లతా) పాటలు ఇప్పటికీ మరువలేం కదా! ఇదే చిత్రంలో లతా-రఫీ కలిసిపాడిన 'యాద్ మేఁ తేరీ జాగ్ జాగ్ కే హమ్ రాత్ భర్....' పాట కూడా సూపర్‌హిట్. ఈ పాటనే రీమిక్స్ చేసి 1993లో అనూమలిక్ 'సర్' చిత్రం కోసం 'బంద్ హోంఠోఁ పే' గీతాన్ని రూపొందించారు.

### 1964

చిన్న చిత్రమైనప్పటికీ మ్యూజికల్‌గా అతిపెద్ద హిట్ చిత్రంగా ఈ సంవత్సరం విడుదలైన 'దోస్తీ' చిత్రాన్ని పేర్కొనవచ్చు. 1949లో విడుదలైన 'బర్సాత్' చిత్రం తర్వాత మ్యూజికల్‌గా అతి గొప్ప మార్పులను ఈ చిత్రం తీసుకువచ్చింది. లక్ష్మీకాంత్ - ప్యారేలాల్ సంగీతంలో వెలువడిన 'చాహూంగా మైఁ తుఝే', 'జానేవాలోం జరా', 'గుడియా హమ్‌సే రూఠీ రహోగీ', 'మేరి దోస్తీ తేరా ప్యార్', 'రాహీ మన్‌వా దుఖ్ కీ చింతా', 'మేరా తో జో భీ కదమ్ హై' పాటలు సూపర్‌హిట్ అయ్యాయి.

చరిత్ర సృష్టించిన 'దోస్తీ' చిత్రం మీద చిత్ర సీమలో పలురకాల కథలు ప్రచారంలో ఉన్నాయి. ముందుగా ఈ చిత్రానికి రోషన్‌ని అనుకున్నా చిత్ర విజయావకాశాలపై నమ్మకం లేక ఆయన పక్కకి తప్పుకున్నారని, 'చాహూంగా మేఁ తుఝే..' పాట రఫీ కలగజేసుకునేదాకా పక్కన పడేశారని, చిత్రగుప్త లక్ష్మీ-ప్యారే గురించి హామీ ఇచ్చాకనే మజ్రూహ్ సుల్తాన్‌పురి పాటలు రాశారని, ఈ చిత్రంలో ప్రముఖంగా వినిపించే మౌత్-ఆర్గాన్ ప్లే చేసినది ఆర్.డి.బర్మన్ అని..ఇలా చాలా, చాలా..

'మిస్టర్ ఎక్స్ ఇన్ బాంబే', 'సంత్ జ్ఞానేశ్వర్', 'సతీసావిత్రి' చిత్రాలు లక్ష్మీ-ప్యారేల కెరీర్‌కు చక్కటి ప్రోత్సాహాన్నందించాయి.

'మిస్టర్ ఎక్స్ ఇన్ బాంబే' చిత్రంతో ఆనంద్ బక్షీ, లక్ష్మీ-ప్యారేల కాంబినేషన్ హిట్ కాంబినేషన్‌గా స్థిరపడింది. ఈ బంధం దాదాపు 300పైగా చిత్రాలకు అవిచ్ఛిన్నంగా పనిచేయడం విశేషం. అంతేకాక ఈ చిత్రం కిశోర్‌కుమార్ లక్ష్మీ-ప్యారేల బంధం దగ్గర కావటానికి కూడా దోహదం చేసింది. ఈ చిత్రంలో కిశోర్, లతా పాడిన 'చలీ రే చలీ రే గోరీ పనియా భరన్ కో, పనియా భరన్ కో కీ మిలనే', 'ఖూబ్ సూరత్ హసీనా జానేజా', 'మేరే మెహబూబ్ కయామత్ హోగీ', 'రుక్ జా రోకత్ హై యే దీవానా' (కిశోర్)లతో పాటు లతా సోలో 'జుల్మీ హమారే సావఁరియా హో రామ్', 'హమ్ ఇస్ ఖయాల్ సే' పాటలు సూపర్ హిట్ అయ్యాయి.

'సంత్ జ్ఞానేశ్వర్ చిత్రంలోని 'భక్తి శక్తి హై, కర్మ్, ధర్మ్ హై... జోత్ సే జోత్ జలాతే చలో'(ముఖేష్), 'బహుత్ దిన్ బీతే','ఏక్ దో తీన్ చార్ భయ్యా బనో హోషియార్', 'మేరే లాడ్‌లో తుమ్ ఫూలో ఫలో' (లతా), 'సతీ సావిత్రి' చిత్రంలోని 'జీవన్ డోర్ తుమ్హీ సంగ్ బాంధీ'(లతా), 'తుమ్ గగన్ కే చంద్రమా'(లతా, మన్నాడే), 'ఇత్‌నీ జల్దీ క్యా హై గోరే సాజన్ కే ఘర్ జానే కీ'(ఉషా మంగేష్కర్, కమల్ బారోట్, లతా) పాటలు లక్ష్మీకాంత్- ప్యారేలాల్ కాంబినేషన్‌కు మంచి పేరు తీసుకువచ్చాయి.

(వచ్చే సంచికలో మరికొంత)

జూన్ 15 చక్రి పుట్టినరోజు సందర్భంగా...

# ఇంత టెక్నాలజీ వచ్చినా కూడా ఇళయరాజా గారిలా ఇవ్వలేకపోతున్నాం

**- చక్రి**



**✦ 2002-03 సంవత్సరంలో 18 సినిమాలు చేయటం విషయంలో మీ వర్క్‌స్టయిల్ గురించి కొంచెం చెప్పండి?**

కొన్ని ట్యూన్స్, దానికి సంబంధించిన వర్క్.... ఇలా ఉండాలి, ఆర్కెస్ట్రయిజేషన్ ఇలా ఉండాలి అని ముందే సిద్ధం చేసుకుని ఉన్నవి ఉన్నాయి. నేను ఖాళీగా ఉన్న టైంలో కొన్ని ట్యూన్స్ చేసుకుని ట్యూన్ బ్యాంకులాగా పెట్టుకుంటుంటాను. డైరెక్టర్స్ వచ్చినప్పుడు వాటిలోంచి వినిపించినప్పుడు కొన్ని ఓ.కె.అయినాయి. అది ఒక విధంగా హెల్ప్ అయింది. ఎప్పటినుంచో అవకాశం కోసం ఎంతోమంది డైరక్టర్స్, ప్రొడ్యూసర్స్‌ని అడిగాను. ఆ టైమ్ ఇప్పుడు వచ్చింది. చాలామంది అవకాశాలు ఇస్తున్నారు. కాదని అనలేను. బడ్జెట్ తక్కువ అయినా, ఎక్కువ అయినా చేయాలనుకున్నాను. అందరితో కలిసి పనిచేయాలనుకున్నాను. చేయగలిగాను. అలా చేయగలగటానికి మరొక కారణం - ఎక్కువ టైమ్ స్పెండ్ చేయటం! ఉదాహరణకి మార్నింగ్ బ్రేక్‌ఫాస్ట్ కూడా నా వెహికల్‌లో వనస్తా ఫ్రూట్స్‌గానీ, ఇడ్లీగాని టిఫిన్ బాక్స్‌లో పెట్టిస్తే... స్టూడియోకొచ్చే లోపు తినేసేవాడిని. ఆఖరికి క్రాపు దువ్వుకోవటం కూడా కారులోనే..... భోజనం చేయడానికి రెండో మూడో అయ్యేది. ముందు వర్క్ చేసేసి ఆ తర్వాతే భోజనం చేసేవాడిని. పడుకోవటం కూడా రాత్రి ఏ మూడు గంటలకో అయ్యేది.

**✦ ఈ బిజీ టైంలో మీ ట్యూన్ బ్యాంక్‌లో ఏదీ కొత్తగా చేరలేదా?**

నిజంగా చెప్పాలంటే ఇంత బిజీగా ఉన్నప్పుడు ట్యూన్స్ చేయటం చాలా తక్కువే అయింది. ప్రశాంతంగా కూర్చుని ఆలోచించే టైమ్ లేదు కాబట్టి కేవలం సిట్టింగ్స్ కోసం కూర్చున్నప్పుడే చేసాను.

**✦ అలా సిట్టింగ్స్‌లో చేసిన ట్యూన్స్...?**

శివమణిలో 'ఏలో ఏలో ఎన్నియల్లో', 'సున్ సున్ సుందరి', 'అమ్మా నాన్న ఓ తమిళమ్మాయి' లో 'నీవే నీవే....' అప్పటికప్పుడు చేసింది. అలాగే 'ఏనాటికీ...' పాట కూడా డైరక్టర్ ముందు కూర్చుని అప్పటికప్పుడు చేసింది. 'సత్యం'లో 'ఏమని దాచను ప్రేమా', 'ఐ యామ్ ఇన్ లవ్', అలాగే 'తొలిచూపులోనే' కోసం సిట్టింగ్స్‌లో కూర్చుని చేసిన సాంగ్సే. తర్వాత 'ఒకరాజు ఒకరాణి' లో 'నిదురించే రాతిరిలో', 'వెన్నెలే నీవని', 'కలకంటావు ఈ వేళ' పాటలు, 'నేను సీతామాలక్ష్మి' లో 'కనులు మూస్తే చాలు నీవే కల్లోకి వస్తావు' పాట, కొత్త లిరిక్ రైటర్ రాసిన 'ఏంటేంటో అవుతుంది ఎట్టాగమ్మా' పాట ట్యూన్ బ్యాంక్‌లో సాంగ్స్.

**✦ ఈ ట్యూన్ బ్యాంక్ వ్యవహారం ఎలా జరుగుతుంది?**

కొన్ని కొన్ని మూడ్స్‌లో ఉన్నప్పుడు ఆ మూడ్‌కి సంబంధించిన ట్యూన్స్ వస్తుంటాయి. వెంటనే రికార్డ్ చేసి పెట్టుకుంటాను. నా దగ్గర డిజిటల్ రికార్డర్ ఉంది దానిలో చేస్తాను. లేకపోతే టేప్‌రికార్డర్‌లో చేస్తాను. ఇక స్టూడియోలో ఉంటే నోట్స్ ప్రిపేర్ చేసేసుకుంటాను. ఇంకోటి ఏంటంటే జనరల్‌గా నా దగ్గరకు లిరిసిస్ట్ లు వస్తుంటారు. 'నేను పాటలు రాసానండి. మీరు దీనిని ట్యూన్ చేస్తే బాగుంటుంది. మేం ట్యూన్ వినిపిస్తాం' అంటారు. నేను స్ట్రెయిట్ ఎవే నా కొద్దని చెప్పేస్తాను. నేను అసలు వారి ట్యూన్స్ విననండి. నాకది ఇష్టం ఉండదు.ఎందుకంటే పొరపాటున నేను దానికి దగ్గరగా చేసానంటే వాళ్ల పాటనే కాపీ చేసానంటారు. సో... 'నేనా అవకాశం మీకివ్వను' అని చెప్పి వాళ్ల దగ్గర ఆ లిరిక్ తీసుకుని నాకు ఖాళీ ఉన్నటైంలో

## చక్రి పాటలతో డి.జె.మిక్స్ ...

నా సాంగ్స్‌లోంచి...కొన్ని ఫాస్ట్‌బీట్ యూత్ ఫుల్ సాంగ్స్‌ని చక్రి డి.జె.మిక్స్ పేరుతో మా మిత్రుడు ఒక స్పెషల్ ఆల్బమ్ తయారు చేస్తున్నారు. జూన్ 15 నా పుట్టిన రోజు సందర్భంగా ఆ ఆల్బమ్ రిలీజ్ చేయాలని సన్నాహాలు జరుగుతున్నాయి. చక్రి డి.జె.మిక్స్ అని ఉండి వేరే పేరు కూడా ఉంటుంది. అది ఇంకా అనుకుంటున్నాం.

ఎం.రఘు అని ఆయన ద్వారా ఆ సీ.డీ.లు, క్యాసెట్లు మార్కెట్లో ఉంటాయి. ఇందులో ఏంటంటే - నా ఒరిజినల్ సాంగ్స్‌ని ఇంకొంచెం ఫాస్ట్ చేసేసి, బీట్స్ ఎక్స్‌ట్రా వాయిస్‌లతో యాడ్ చేసి ఉంటాయి. మెయిన్ ట్యూన్ అలాగే ఉంటుంది. ఇందులో స్పెషల్ ఏంటంటే - సినిమాలో నేను పాడిన 'చెన్నై చంద్రమా' పాటను హరిహరన్‌తో ఫుల్ క్లాసికల్‌గా చేసేసి మళ్లీ పాడించడం! వెస్ట్రన్‌ను ఫుల్ వెస్ట్రన్ చేయటం మామూలే, ఒక వెస్ట్రన్ టైప్ సాంగ్‌ని క్లాసికల్‌గా చేయడం మాత్రం కొత్తగా ఉంటుందిందులో.

దానికి ట్యూన్ చేసి రికార్డ్ చేసుకుంటాను. అది స్టోర్ చేస్తాను. అలా స్టోర్ చేసిన ట్యూన్స్‌ని ట్యూన్ బ్యాంక్‌గా వ్యవహరించడం జరుగుతుంది.

**✦ మీ ద్వారా చాలా ఎక్కువమంది లిరిక్ రైటర్స్ పరిశ్రమకు పరిచయం అయ్యారు. కొత్త రైటర్స్ చాలామంది తమ పాటల్ని చక్రికి వినిపిస్తే బాగుంటుంది అని అనుకుంటున్నారు. వాళ్లు లిరిక్ ఇచ్చిన తర్వాత రోజూ మీ చుట్టూ తిరగాలా లేకపోతే దర్శకుడు ఓ.కె. చేసిన తర్వాత మీరు కబురు పెడతారా? కొత్త రైటర్‌ని మీరు ఇంట్రడ్యూస్ చేసే పద్ధతి ఎలా ఉంటుంది?**

యాక్చువల్‌గా లిరిసిస్ట్‌లంతా తిరుగుతుంటే నాకు బాధ అనిపిస్తుంది. మిగతా పనులు అన్నీ వదిలేసుకుని కర్నూలు, కడప, వరంగల్, వైజాగ్ ఎక్కడెక్కడినుండో వస్తుంటారు. ఒకరోజు ఎక్స్‌ట్రా తిరిగితే నెక్స్టడే కి వాళ్లు వెళ్లటానికి డబ్బులుండవు. అలా చాలామందికి తిరిగి వెళ్లడానికి నేను డబ్బులిచ్చాను. నిజానికి ఇవ్వాల్సిన అవసరం లేదు. 'సార్ నిన్నంతా మీ కోసం వెయిట్ చేసాను. మీరు రాలేదు సార్. స్టూడియోకి వస్తారని అక్కడ చూసాను' అనిగానీ, 'మీరు నిన్న వచ్చారు.... బిజీగా ఉండి నన్ను పట్టించుకోకుండా వెళ్లిపోయారు సార్...' అనిగాని బాధగా చెబుతుంటారు. సరే తప్పు మనది కాకపోయినా పరిస్థితి అలాంటిది. కాకపోతే ఏంటంటే డబ్బులివ్వడం గొప్ప కాదు. టాలెంట్ ఉండి పాటల సాహిత్యం బాగుంటే అవకాశం ఇవ్వడం గొప్ప. చాలామంది వస్తున్నారు. చూపిస్తున్నారు. నేనైతే బాగా శాటిస్‌ఫై అయ్యే వరకూ కూడా అవకాశం ఇవ్వను.

**✦ మీ శాటిస్‌ఫాక్షన్‌కి కొలమానం ఏంటి?**

ఏదో ఒక ప్లస్ పాయింట్ అంటే మీటర్ పక్కా ఉండి....కాయినింగ్ సరిగా వేయటం... ఇలా ఉంటే ఇతన్ని మనం మార్చుకోవచ్చు అనుకుంటే



ఇంటర్ చదువుతున్నప్పుడు చక్రి

అవకాశం ఇస్తాను. ఎందుకంటే పుట్టగానే అందరూ పరిమళించరు. అలాగే ఫస్ట్ సాంగ్ సినిమాటిక్‌గా సినిమా రేంజ్‌లో రాయలేకపోవచ్చు. కనీసం దానికి దగ్గరలో ఉన్నా కూడా వారికి అవకాశం ఇస్తాను. నచ్చిన సాహిత్యానికి ట్యూన్ కడతాను. అది డైరెక్టర్స్‌కి సిట్టింగ్స్‌లో వినిపిస్తాను. ఈ పాట ఫలానా కొత్త రైటర్ రాశాడండి. మీకు బాగుంటే అతనికి అవకాశం ఇద్దామండి అంటాను. 'ఎవరైతే మనకేంటి... పాట బాగా రాశాడు కదా' అని ఎంకరేజ్ చేసిన దర్శకులు చాలామంది ఉన్నారు.

**✦ అలా ఎంకరేజ్ చేసిన దర్శకులు, పైకొచ్చిన రైటర్లు ఎవరు ?**

పైడపల్లి శ్రీనివాస్ అని ఒకతన్ని నాగేశ్వరరెడ్డిగారు , వెంకిగారు ఎంకరేజ్ చేశారు. అలాగే పూరీజగన్నాథ్ గారు గానీ, కాశీ గారుగానీ....వీళ్లంతా కందికొండ రాసిన సాహిత్యానికి నేను ట్యూన్ చేస్తే ఆ ట్యూన్ విని ఆయన తెలియకపోయినా లిరిక్‌ని ఓకె చేశారు. అలాగే బండారు దానయ్య. 'ఎంజాయ్' అనే సినిమాకి అతనిచేత పాట రాయించాం. అలాగే చిన్నిచరణ్.





**✦ సింగర్స్ ని పరిచయం చెయ్యటంలో, ఏ పాటకి ఎవరు సరిపోతారు అని నిర్ణయించడంలో మీ వ్యవహార శైలి ఎలా ఉంటుంది ?**

కొంతమంది డైరెక్టర్స్ నాకు ఫలానా సింగర్ కావాలని పట్టుబడుతుంటారు. అప్పుడు 'సరే మీరనుకున్నవాళ్లచేతనే పాడిద్దామండి' అంటాను. కాకపోతే ఆ సింగర్ పాడటం వల్ల పాట పాడవుతుందనుకుంటే మాత్రం ముందే చెబుతాను. 'అతని గొంతు దీనికి అసలు మ్యాచ్ అవదండీ, కావాలంటే మీకు ముగ్గురు నలుగురి పేర్లు చెబుతాను. వాళ్లలోంచి ఎవరిచేతనైనా పాడిద్దామండీ అని అంటాను. జగన్ గారికి బొంబై వెళ్లి సింగర్స్ చేత పాడించటం అసలు ఇష్టం వుండదు. 'ఆ బొంబై ఏదో నువ్వే వెళ్లి కావాలంటే నువ్వే అక్కడ పాడి తీసుకొచ్చి మాకిచ్చేయ్' అని అంటుంటారు. ఆ తరువాత సూర్యకిరణ్ గారు 'కిరణ్... ఈ పాటకు ఈ సింగర్ బాగుంటారు' అంటే వింటారు. మ్యూజిక్ పరంగా ఆయనకు మంచి టేస్ట్ ఉంది. 'మధురమె మధురమె మధురమె' పాటకు నేను శంకర్‌మహదేవన్ పేరు చెప్పాను. ఏ మాత్రం అబ్జెక్ట్ చేయకుండా ప్రొసీడ్ అవమని చెప్పారు. అది శంకర్‌మహదేవన్ గారికి కరెక్ట్‌గా సరిపోయింది.

**✦ ఇప్పుడో చిన్న చిలిపి ప్రశ్న.....మీకు ఏ సింగర్‌తో పాడించాలని వుంటే ఆ సింగర్ వాయిస్‌ని అనుకరిస్తూ ట్రాక్ పాడతారని ఇండస్ట్రీలో ఓ జోక్ వుంది. అదెంత వరకూ నిజం?**

మీరన్నది కరెక్ట్. అలా జరుగుతోంది కూడా. ఈ విషయం జగన్ గారు ఎక్కువగా అంటుంటారు. 'ఉదిత్ నారాయణ్‌తో పాడించాలంటే ఆయనలా ఫీలైపోయి చక్రి ఉదిత్ నారాయణ్‌లా పాడతాడు' అని. అందుకు 'లేలేత నవ్వులా' పాట బెస్ట్ ఎగ్జాంపుల్. ఉదిత్ నారాయణ్ పాడాలని మనసులో అనుకున్నాను. అర్జంటుగా ట్రాక్ తయారుచేసి షూటింగ్‌కి పంపించాలి. ఆ ఫీల్ రావాలంటే ఉదిత్ నారాయణ్‌లాగానే పాడి ట్రాక్ పంపించేస్తే అప్పుడు వాళ్లకి అర్థం అవుతుందని ఉదిత్ నారాయణ్‌లా పాడాను.

**✦ లేటెస్ట్‌గా 'పెదబాబు'లో జగపతిబాబుగారిలా పాడారు కదా...దాని సంగతేంటి?**

జగపతిబాబుగారి వాయిస్‌ని నేను అంత బాగా ఇమిటేట్ చేయలేను. కాకపోతే ఆయన విజువల్స్ చూసి నేను పాడాను. యాక్చువల్‌గా బాలాజీ అని కొత్త సింగర్ చేత ముందు పాడించాం. ఫైనల్‌గా వేరే వాళ్లచేత పాడిద్దామని చూసాను. మ్యాచ్ కాలేదు. తర్వాత విజువల్‌కు మ్యాచ్ అవ్వాలని చెప్పి విజువల్స్ చూశాను. ఇలాగైతే

**చక్రి ద్వారా పేరుతెచ్చుకున్న గాయనీ గాయకులు**

1. రఘు కుంచే
2. వాసు
3. సింహా
4. సందీప్ భౌమిక్
5. మాటిన్
6. గౌరీ శ్రీనివాస్
7. విశ్వ
8. ప్రవీణ్
9. కౌసల్య
10. సుధ
11. మంజు
12. రేవతి
13. పల్లవి
14. సునీతా బాలాజి
15. మణి శాస్త్రి
16. చైత్ర
17. సునంద

## చక్రి సంగీత దర్శకత్వం వహించిన చిత్రాలు

1. బాచి
2. అతను
3. ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం
4. లిటిల్ హార్ట్స్
5. డ్రీమ్స్
6. ఆడుతూ పాడుతూ
7. కనులు మూసినా నీవాయే
8. ఔను వాళ్లిద్దరూ ఇష్టపడ్డారు
9. ఇడియట్
10. ధనలక్ష్మీ ఐ లవ్ యూ
11. జూనియర్స్
12. అమ్మాయిలు అబ్బాయిలు
13. కబడ్డీ కబడ్డీ
14. అమ్మ నాన్న ఓ తమిళమ్మాయి
15. ఒక రాజు ఒక రాణి
16. దొంగ రాముడు అండ్ పార్టీ
17. అనగనగా ఓ కుర్రాడు
18. ఒక రాధ ఇద్దరు కృష్ణుల పెళ్లి
19. తొలి చూపులోనే
20. నేను సీతామహాలక్ష్మి
21. నేను పెళ్లికి రెడీ
22. వీడే
23. శివమణి
24. సత్యం
25. ఆంధ్రావాలా
26. వీర కన్నడిగ
27. ఎంజాయ్
28. అపురూపం
29. కిచ్చా ఉడే కాదల్
30. పెళ్లాం ప్రేమిస్తే

బాగుంటుందనిపించి అలా పాడాను. జగపతిబాబు గారికి కూడా నా వాయిస్ మ్యాచ్ అయినందుకు చాలా హ్యాపీ ఫీలవుతున్నాను.

**✦ రీ రికార్డింగ్‌కు సంబంధించినంత వరకు మీమీద చాలా అపోహలు ఉండేవి.' పెదబాబు' తో అవన్నీ తొలగిపోయాయి. రీరికార్డింగ్‌లో కూడా చక్రి ది బెస్ట్ ఇవ్వగలడని ఒక ఫీలింగ్ 'పెదబాబు' రీరికార్డింగ్ చూశాక తెలిసింది. అసలు మీమద అటువంటి ఆ అపోహలు ఎందుకు కలిగాయి. ఇది ప్రూవ్ అయిన తర్వాత ఇండస్ట్రీలో మీ చుట్టూ ఉన్న వాతావరణం ఎలా మారింది?**

'పెదబాబు' రీరికార్డింగ్ అలా చేయటానికి కారణం నా పర్సనల్ బిహేవియర్‌కు దగ్గరగా ఉండటం. 'అమ్మ నాన్న ఓ తమిళమ్మాయి' కూడా నేను బెస్ట్ చేశానని ఫీల్ అవుతున్నాను. 'పెదబాబు'లో ఏంటంటే ప్యూర్‌గా గ్రామీణ వాతావరణంలో ఒక ఇండియన్ స్టైయిల్ ఆఫ్ ఇన్‌స్ట్రుమెంటేషన్‌తో వెళ్తుంది. అది నాకు బాగా ఈజీ అయింది. సెంటిమెంట్ పండించటానికి చాలా స్కోప్ దొరికింది. ఇందులో వండర్‌ఫుల్ థింగ్ ఏమిటంటే క్లయిమాక్స్ లాస్ట్ 9 మినిట్స్‌లో డైలాగ్స్ లేవు. అలాంటి క్లయిమాక్స్ తీయటం అనేది కత్తిమీద సాములాంటిది. దానిని నిలబెట్టిన డైరక్టర్‌కు జేజేలు. ఆడియన్స్ కూడా ఆ లాస్ట్ 9 నిమిషాలు ఏం జరుగుతుందన్న యాంగ్జయిటీకి లోనయ్యి కూర్చుండి పోయారు. అటువంటి క్లయిమాక్స్‌కి రీ రికార్డింగ్ ఇచ్చి ప్రశంసలు పొందినందుకు నేను సక్సెస్ అయ్యానని ఫీలయ్యాను. మిగతా డైరక్టర్స్ నుండి, ప్రొడ్యూసర్స్ నుండి ఫోన్‌లు రావటం.... 'నీ కెరీర్‌లో బెస్ట్ రీ రికార్డింగ్ ఇది' అని చెప్పటం....'కీపిటప్' అని అనటం నాకు ఆనందంగా ఉంది.

**✦ అక్కడ వాడిన లైవ్ ఇన్‌స్ట్రుమెంట్స్ ఏమిటి?**

దిల్‌రుబా, సోలో వయొలిన్, సారంగి, తార్ షెనాయ్, ఫ్లూట్, ఢోలక్, గటొసింగారీ, తబలా, మువ్వలు, డప్పులు...అవసరం ఉన్నచోట వాయిస్‌లు...ఇలా అన్నీ లైవే వాడాం. విజువల్ లో స్కోప్ ఉంటే బాగా చేయగలం. ఇంత ఎమోషనల్ సినిమా నాకు ఇంత వరకూ దొరకలేదు. అందులో హీరో నడుస్తూ రావటం హాఫ్ మినిట్ ఉంటుంది. దానికి మనం బిల్డప్ ఇవ్వొచ్చు. సమరసింహారెడ్డి, నరసింహ నాయుడు లాంటి సినిమాలు వస్తే బాగుండునని ఎప్పటినుంచో అనుకునేవాడ్ని... పెదబాబు అలాంటి సినిమానే అని నేను ఫీల్ అవుతున్నాను.

**✦ ఓ పర్సనల్ క్వొశ్చెన్...మీరు భోజన ప్రియులని అందరికీ తెలిసినదే. భోజన ప్రియులకు కాస్త నిద్దర కూడా ఎక్కువగా ఉంటుంది కదా. అలా మీకిష్టమైనది మీ వృత్తికి కష్టంగా మారలేదా?**

మధ్యాహ్నం ఒక అరగంట కూడా నిద్రపోను నేను. కానీ రాత్రి ఒకసారి పడుకున్నానంటే పక్కన ఎంత పెద్ద సౌండ్స్ అయినా లేవను. అంత గాఢంగా పడుకుంటాను. నిద్రను నా చేతిలో పెట్టుకున్నాను. నేను రమ్మంటే వస్తుంది. పొమ్మంటే పోతుంది. చాలామంది ఏంటంటే నిద్ర వస్తేనే పడుకుంటారు. నాకు మధ్యాహ్నం పనిలేకపోయినా పడుకోను. అది అలవాటు అయిపోయింది. పనిలేకపోయినా ఏదో ఒక పని కల్పించుకుంటాను.

**✦ మీరు ఫ్రెష్ అవటానికి ఎటువంటి సాంగ్స్ వింటారు?**

ఇళయరాజా గారి పాత పాటల్ని వింటుంటాను.

## చక్రి ద్వారా పేరు తెచ్చుకున్న గీత రచయితలు

1. భాస్కరభట్ల రవికుమార్
2. కందికొండ
3. విశ్వ
4. బండారు దానయ్య
5. పైడిపల్లి శ్రీనివాస్
6. చిన్ని చరణ్

నా కంప్యూటర్‌లో ఉంటాయ్. వినాలనిపిస్తే సడన్‌గా వెళ్లిపోయి వింటుంటాను. బాలు, జానకి గార్ల వాయిస్, ఇళయరాజాగారి కంపోజిషన్.... అద్భుతంగా ఫీల్ అవుతూ వింటుంటాను. ఎంత గ్రేట్...! అప్పట్లో ఆ క్వాలిటీ ఏంటి? ఆ ఆర్కెస్ట్రయిజేషన్ ఏంటి?



అక్కచెల్లెళ్లు, కజిన్ బ్రదర్‌తో చక్రి (ఎడమనుండి రెండో వ్యక్తి)

ఇంత టెక్నాలజీ వచ్చినా కూడా వేం ఇవ్వలేకపోతున్నాం. అప్పట్లోనే ఆయన ఎంత బాగా ఇచ్చారని ప్రతిసారీ అనుకుంటుంటాను.

**✦ ఈ మధ్య వస్తున్న మీ పాటల్లో ఇళయరాజాగారి మెలోడీల ప్రభావం పడుతోంది?**

తప్పేం కాదు. ఎందుకంటే ...మన నుంచి కొన్ని వుడతాయి. రకరకాల సిట్యుయేషన్స్ అనుగుణంగా కాకుండా వేరే వాటి ద్వారా ఇన్‌స్పయిర్ అయి కూడా పాట రావచ్చు. ఇళయరాజా గారు మా మ్యూజిక్ డైరక్టర్స్ అందరికీ గురువులాంటివారు. గురువు బోధించిన పాఠాలు కానీయండి, ఆయన చూపించిన పద్ధతి కానీయండి వాడుకోవడంలో తప్పేం లేదనిపిస్తోంది. సింగర్ అనేవాడు బాలు గారిని చూసి నేర్చుకోవాల్సినది చాలా ఉంది. అలాగే మ్యూజిక్ డైరక్టర్ అన్నవాడు ఇళయరాజాగారిని ఫాలో అవవచ్చు. అందులో ఫీల్ అవ్వవలసిన అవసరం లేదు. అదొక టెక్నికల్ స్టయిల్ కాబట్టి దాన్ని ఫాలో అయితేనే తెలుస్తుంది.

**✦ రకరకాల సిట్యుయేషన్స్‌కి తగ్గట్టు ఒకే అయ్యే ట్యూన్స్ ఇవ్వడమే 'ది బెస్ట్' అనుకుంటున్నారా.... లేక మీరివ్వాలనుకుంటున్న 'ది బెస్ట్' లేదా మాగ్నమ్ ఓపస్ లాంటిదేమైనా మీ మనసులో ఉందా?**

ఈ ప్రశ్న అడిగినందుకు మీకు థాంక్స్. నేను ఎప్పుడూ ఫీల్ అయ్యేది, ఆశపడేది అలాంటి రోజుకోసమే. నేను ఇంకా చేయగలను. స్టూడెంట్స్, మాస్, యూత్, ఫ్యామిలీస్ అందరూ యునానిమస్‌గా మెచ్చే సాంగ్స్ చేయాలి. రీసెంట్‌గా వచ్చిన సినిమాల్లో అన్నమయ్య అలాంటి చిత్రం. ■



# చేటు చేసిన ముహూర్తపు పెళ్లికి ప్రతి ఏటా కళ్యాణం ఎందుకు ?





**పాడ్యమి (ఉగాది ప్రారంభం)**
**నాగుల చవితి**
**సుబ్రహ్మణ్య షష్టి**
**కృష్ణాష్టమి**
**శ్రీరామ నవమి**
**క్షీరాబ్ధి ద్వాదశి**
**నరక చతుర్దశి**
**దీపావళి అమావాస్య**

తెలుగు వారంతా చెడుగా భావించే పాడ్యమి, చవితి, షష్టి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి, అమావాస్య తిథులు ఇలా పండుగలతో ముడిపడి పర్వదినాలుగా - ఆచార వ్యవహారాలలో ఒక భాగంగా - ఇమిడి పోవడంలో అంతరార్థం ఏమైనా ఉందా !?

ఏమో...ఉందేమో...గురుత్వాకర్షణ శక్తి భూమి పుట్టినప్పటినుంచీ ఉంది. కానీ న్యూటన్ చెబితేనే కదా ప్రపంచానికి తెలిసింది. అలాగే కొన్ని విషయాలు వేదాల్లోనూ, పురాణాల్లోనూ ఉన్నాయని చెబుతూ ఉంటారు. కానీ ఎంతమందికి అవి అందుబాటులో ఉన్నాయి. ఎంతమంది వాటిని చదివి అర్థం చేసుకుని ఎదుటివారికి అందించ గలుగుతున్నారు?

ఇక్కడే..ఇక్కడే... ఒక భాష్యకారుడు అవసరం అవుతాడు. అతడు తాత్వికుడు కావచ్చు, మఠాధిపతి కావచ్చు, పీఠాధిపతి కావచ్చు, కవి కావచ్చు... సినీ కవి కూడా కావచ్చు.

పైన ఉదహరించిన వాళ్లలో చెప్పాలనుకున్నది చెప్పే అవకాశం అందరికీ ఉంది - ఒక్క సినీ కవికి తప్ప !!

మనసులోని భావనా బలానికి తాత్వికత జోడించి సంస్కృతి, సంప్రదాయం నిలబడే విధంగా - భాషా పటిమను జతచేస్తూ సామాన్య ప్రేక్షకుడిక్కూడా అర్థమయ్యేలా రాసే అవకాశాన్ని అలవోకగా అంది పుచ్చుకునే సినీ కవులలో ఈ తరానికి సంబంధించి సీతారామశాస్త్రి గారినే చెప్పుకోవాలి.

'తెలివైన వాడు అవకాశాలకోసం ఎదురుచూడడు, అవకాశాల్ని సృష్టించుకుంటాడు' అనే సూక్తికి కూడా ఆయన్నే మళ్లీ చెప్పుకోవాలి. సరైన సన్నివేశం వచ్చినప్పుడు తనలోని తాత్వికతను 'ప్రయోజనరంజకం'గా ఆవిష్కరించుకునే అవకాశాన్ని సృష్టిస్తాడాయన.

అందుకు మరో తాజా ఉదాహరణ... స్రవంతి రవికిశోర్ తీస్తున్న సినిమాలోని శ్రీరామ నవమి పాట. సుమంత్, ఛార్మి ఈ సినిమాలో హీరో హీరోయిన్లు.

శ్రీరామనవమి సందర్భంగా సినిమాలో ఓ పాట ఉండాలని, ఆ పాటలో హీరో హీరోయిన్లతో పాటు ప్రధాన పాత్రధారులు కూడా పాల్గొనే విధంగా ప్లాన్ చేసుకొచ్చారు స్రవంతి మూవీస్ నిర్మాత రవికిశోర్, దర్శకుడు రమణ.

"రాముడు మీద ఎన్ని సినిమా పాటలు రాలేదు..!? చెబితే ఏదైనా కొత్తగా చెప్పాలి" అనుకున్నారు సీతారామశాస్త్రి... అదే మాట బైటిక్కూడా అన్నారాయన.

"శ్రీరామనవమి... రాముల వారి కళ్యాణం..." అంటూ సన్నివేశాన్ని వివరించారు రవికిశోర్, రమణ.

"కర్క్టే... శ్రీరామ నవమి నాడు కళ్యాణం చేయిస్తాం. ఆ ముహూర్తానికి పెళ్లి చేసుకుని ఏం సుఖపడ్డారువాళ్లు? కాపురమంతా కారడవేగా !? అయినా ఆ ముహూర్తానికే ప్రతి ఏటా మనం కళ్యాణం చేయిస్తాం... ఎందుకు !?" అన్నారు సీతారామశాస్త్రి.

"అవును.. ఎందుకు !?" అంటూ ఆలోచనలో పడ్డారు రవికిశోర్, రమణ.

"చేటు చేసిన ఆ ముహూర్తం ఏం చాటిందని పెళ్లయిన జంటని సీతారాముల్లా ఉండాలని దీవిస్తారు?" అన్నారు సీతారామశాస్త్రి.

"అలా మైండ్‌ని ఒక్కసారిగా లాక్ చేసేశారు శాస్త్రిగారు" అన్నారు దర్శకుడు రమణ 'హాసం' తో మాట్లాడుతూ

**బంధం బిగువింతని**
**ఎడబాటే తెలిపిందయా**
**నేస్తం బలమింతని**
**కపి సైన్యం చూపిందయా**
**సముద్రాన్ని లంఘించే హనుమ భక్తిని**
**అధర్మాన్ని దండించే ధర్మశక్తిని**
**నిరూపించింది... అడవికి వెళ్ళి...**
**జగత్కళ్యాణం జరిపిన పెళ్ళి...**

అంటూ ఆయన వేసిన లాక్‌ని ఆయనే తెరుచుకుంటూ వచ్చారు. ఈ పాటకి సుమారు పది పదిహేను రోజుల పాటు రకరకాల వెర్షన్లు రాశారాయన " అంటూ వివరించారు దర్శకుడు రమణ - ఈ పాట చిత్రీకరణ చూడటానికి వెళ్లిన 'హాసం' తో మాట్లాడుతూ...

"జులై మొదటివారంలో ఆడియో విడుదలవుతుంది" అన్నారు నిర్మాత రవికిశోర్.

"ఈ పాటలో ఓ ప్రయోజనం, తాత్వికత ఉన్నాయి కదా కొన్ని లైన్లు మా పాఠకుల కోసం ఆడియో రిలీజ్ కాకుండా వేసుకుంటే మీకభ్యంతరం లేదు కదా !?" అని అడిగింది 'హాసం'.

"భలేవారే... మొత్తం పాటే వేసుకోండి" అంటూ అసిస్టెంట్ డైరెక్టర్‌ని పిలిచి పాట మొత్తం స్క్రిప్ట్‌ని కాపీ చేయించి సహృదయంతో ఇచ్చారు నిర్మాత రవికిశోర్. అంతేకాదు ఈ పాటకు సంబంధించిన స్టిల్స్‌ను సీడీ చేయించి ప్రెస్ రిలేషన్స్ చూసుకునే ఎల్.బాబూరావు (చిత్రం సినిమా పత్రిక ఎడిటర్) గారి ద్వారా అందచేశారు కూడా ! వీరందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటూ ఆ 'శ్రీరామనవమి' పాటను పాఠకుల ముందుంచుతోంది 'హాసం'.

**శ్రీ స్రవంతి మూవీస్ ప్రొడక్షన్ నెం.5** **సంగీతం : కోటి**

**రచన : సిరివెన్నెల సీతారామశాస్త్రి**

సాకీ : వరమాలై నీ మెడలోన
వాలిన జానకి ప్రేమ... ప్రేమ....
మెరుపల్లె నీ మేనంతా
అల్లెను మేఘశ్యామా... శ్యామా...
రామా... రామా... రామా.... రామా.... రామా....!

ప: ఏనాడో జరిగినా ఎన్నాళ్ళో గడిచినా
ఏటేటా కొత్తగా కళ్యాణమా
విల్లును విరిచావనా...
పిల్లను గెలిచావనా...
ఆ సంగతి తెలుసుగా పురుషోత్తమా...
కాపురమంతా కారడివిగా...
జీవితమంతా కష్టాలుగా
చేటుచేసిన ఆ సుముహూర్తం
చాటుతున్నది ఏ పరమార్థం...
పరిణయంలో పరమ రహస్యం
తెలుసుకుంటే తారకమంత్రం

కోరస్: విన్నకొద్ది వింతలెన్నో తెలుపుతున్నది
కళ్ళనిండ కాంతులెన్నో నింపుతున్నది
ఊరువాడనల్లుతున్న పందిరే ఇది.
మన్నుమిన్ను ఏకమైన సందడే ఇది ॥ఏనాడో॥

కోరస్: రాముడేమన్నాడే... సీతా... రాముడేమన్నాడే...
రాముడేమన్నాడే... సీతా... రాముడేమన్నాడే...

చ: త్యాగం నిలిచిందయా...
రఘురామ... నీమూర్తిగా
న్యాయం గెలిచిందయా
శుభనామా... నీ కీర్తిగా...
మమతకి లక్ష్మణ భరతులు తమ్ముళ్ళని
మంచి మనసుకంతా... బంధువులేనని
ఇలా విలువలెన్నో లోకానికీ...
తెలియచెపుతుందా అందరిపెళ్ళి

కోరస్: అందుకే... తలచుకుంటాం మళ్ళీ... మళ్ళీ...
పెళ్ళి ఈడు పడుచులంతా జానకమ్మలై
జంటకోరు పురుషులంతా రామభద్రులై
వీధి వీధి పచ్చనైన పెళ్ళిపందిరే
ఆలుమగలు ఎవ్వరైన పెళ్ళిపెద్దలే ॥ఏనాడో॥

చ: బంధం బిగువింతని
ఎడబాటే తెలిపిందయా
నేస్తం బలమింతని
కపి సైన్యం చూపిందయా
సముద్రాన్ని లంఘించే హనుమ భక్తిని
అధర్మాన్ని దండించే ధర్మశక్తిని
నిరూపించింది... అడవికి వెళ్ళి...
జగత్కళ్యాణం జరిపిన పెళ్ళి...

కోరస్: మనిషిలో... మహిమని
కొలుచుకుంటాం.... గుళ్ళోకెళ్ళి
విన్నకొద్ది వింతలెన్నో తెలుపుతున్నది
కళ్ళనిండ కాంతులెన్నో నింపుతున్నది
ఊరువాడనల్లుతున్న పందిరే ఇది
మన్ను మిన్నుగ ఏకమైన సందడే ఇది



# .... అందుకే హాస్య దర్శకుల్లో ఆయన పరిపూర్ణ దర్శకుడు

**- బ్రహ్మానందం**



ఎంత సీరియస్ విషయమైనా, రొమాంటిక్ విషయమైనా హాస్యం ద్వారా చెప్తే సులువుగా జనంకి అందుతుందన్న ఆలోచనా విధానం వున్న దర్శకుడు ఇవివి సత్యనారాయణ.

ఆయన దర్శకత్వంలో ఇప్పటివరకు ముప్పై ఎనిమిదో, ముప్పై తొమ్మిదో సినిమాలు చేశాను. జంబలకిడిపంబ లాంటి చమత్కారం గల సబ్జెక్టుని - హలో బ్రదర్ లాంటి ఫుల్ ఎంటర్‌టెయిన్‌మెంట్ సబ్జెక్ట్‌ని - అబ్బాయిగారు, తాళి, ఆమె వంటి సీరియస్ సబ్జెక్టులని పెర్ఫెక్ట్‌గా డీల్ చేసిన సామర్థ్యం అతనిది. అబ్బాయిగారు, తాళి, ఆమె లాంటి చిత్రాల్లో సీరియస్‌నెస్‌తో పాటు కామెడీ ట్రాక్ కూడా బ్రహ్మాండంగా నడిపించి చూపించాడు. స్పాట్ ఇంప్రొవైజేషన్ ఆయనకు ఎక్కువ. 'హాస్య నటులంటే చదువు సంధ్యాలేని వాళ్ళు కాదు, సమర్థత కలిగినవాళ్ళు' అనే విషయాన్ని గ్రహించిన దర్శకుడతను. అందుకే హాస్యనటుల్ని కూచోబెట్టుకొని సెట్ మీద స్పాట్‌లో ఇంప్రొవైజ్ చేసిన సంఘటనలెన్నో ఉన్నాయి ఆయనకి.

అసలు సెట్ మీదకి రావడమే బాణాలన్నీ నింపుకున్న అమ్ములపొదితో వచ్చినట్టు వస్తాడు. ఎదుటివాడు ఎదురుబాణం వేసే స్కోపే ఉండదు. ఎందుకంటే కామెడీ బావుంది అని చెప్పుకున్నంత సులువుకాదు - కామెడీ చెయ్యడం, చేయించడం! మిగిలిన వాటిని పేపర్‌మీద రాసినంత సులువు కాదు కామెడీని రాయడం... ఇవన్నీ క్షుణ్ణంగా తెలిసిన దర్శకుడాయన.

ఆయన ప్రతిచిత్రంలోనూ చివర్న ఓ మంచి పంచ్ ఉంటుంది. 'ఆయనకిద్దరు' సినిమా చివర్న నా పాత్ర ఊహతో మాట్లాడేటప్పుడు హాస్యం అపహాస్యం అయిపోతుందేమోనన్న అనుమానం కలిగేలోగా రక్తి కట్టించేసిన సమర్థుడతను. ప్రతి హీరోకి వాళ్ళ రేంజ్‌కి తగ్గ కామెడీతో చిత్రాలను అందివ్వడం ఆయనలోని మరో ప్రత్యేకత. చిరంజీవితో అల్లుడా-మజాకా, నాగార్జునతో హలో బ్రదర్, వెంకటేష్‌తో అబ్బాయిగారు, ఇంట్లో ఇల్లాలు - వంటింట్లో ప్రియురాలు, బాలకృష్ణతో గొప్పింటి అల్లుడు, జగపతిబాబుతో ఆయనకిద్దరు, అలా ఇప్పుడున్న హీరోలందరితోనూ సినిమాలు తీశాడు.

ఇవివి సినిమా అనగానే డైలాగులు డిఫరెంట్‌గా ఉంటాయి, కామెడీ డిఫరెంట్‌గా ఉంటుంది అనే ముద్ర జనంలో ఎంతగా నాటుకుపోయిందో అందరికీ తెలుసు. విషయం ఉన్న కొత్త వాళ్ళతో ఎక్స్‌పెరిమెంట్స్ చేయించటం ఆయన జంధ్యాల గారి దగ్గర నుంచి అలవాటు చేసుకున్నాడేమోనని అనిపిస్తుంది. జంధ్యాల గారు పుచ్చాపూర్ణానందం గారితో సినిమాల్లో నటింపచేస్తే ఈయన డివి నరసరాజు గారితో 'చెవిలోపువ్వు'లో నటింపచేశారు. అసలు జంధ్యాల శిష్యుడు అంటేనే హాస్యానికి ఓ క్వాలిఫికేషన్ కదా!

ఎవరి స్టయిల్‌కి తగ్గట్టుగా వాళ్ళతో కామెడీ చేయించడం ఇవివి ప్రత్యేకతల్లో మరొకటి. ప్రేమఖైదీ, హలో బ్రదర్, ఇంట్లో ఇల్లాలు-వంటింట్లో ప్రియురాలు, అప్పుల అప్పారావు, ఆయనకిద్దరు లాంటి సినిమాల్లో నా స్టయిలుకి తగ్గట్టు నాతో చేయిస్తే - కరుణ, సీరియస్‌నెస్, సెంటిమెంట్‌తో కామెడీ టచ్ ఇస్తూ కోట శ్రీనివాసరావుతో ఎన్నో పాత్రలను చేయించాడు.

గోదావరి జిల్లా యాసతో ఆడుకోవడం అతనికో సరదా. వ్యక్తిగతంగా సున్నితమైన వాళ్ళు, మంచి వాళ్ళు మాత్రమే హాస్యాన్ని ఆస్వాదించగలరు, సృష్టించగలరు, పండించగలరు. ఈ మూడు క్వాలిఫికేషన్లూ సంపూర్ణంగా ఉన్నాయి కాబట్టే ఇవివి హాస్య దర్శకుల్లో పరిపూర్ణ దర్శకుడు.

ఐ లవ్ హిమ్.

రచన: వేటూరి ① గానం: శంకర్ మహదేవన్

బోలో రామభక్త హనుమాన్ కీ..... జై
ఓం మన్ మన్ మన్..........మారుతవేగా
ఓం తత్సత్ సత్ సత్..........తాపసయోగా
ఓం ఓం వానరనేతా ఓం నమో నమ భావి విధాతా
రామలక్ష్మణ జానకీ జయము జయము హనుమాన్‌కీ
భయము భయము రాదెంతకీ జయమనరా హనుమాన్‌కీ
చింత తీర్చెరా సీతకీ జయజయజయ హనుమాన్‌కీ

ప: ఊరేగి రావయ్యా హనుమా జై హనుమా
ఊరేలి చూపించు మహిమ
మా తోడు నీవయ్యా హనుమా మా హనుమా
మా గోడు గోరంత వినుమా
వాయుపుత్రా హనుమా మావాడవయ్యా హనుమా
రామ భక్తా హనుమా మా రక్ష నీవే వినుమా
మమ్ము ఆదుకోరావయ్యా ఆంజనేయా ఆపద కాయ
చూపించ రారా దయ
మమ్ము ఏలుకో రావయ్యా రాక్షసమాయ హతమే చేయ
నీనీడ చాలునయా
వాయుపుత్రా హనుమా మా వాడవయ్యా హనుమా
రామభక్తా హనుమా మా రక్ష నీవే హనుమా
మమ్ము ఆదుకోరావయ్యా ఆంజనేయా ఆపద కాయ
చూపించ రారా దయ
మమ్ము ఏలుకో రావయ్యా రాక్షసమాయ హతమే చేయ
నీనీడ చాలునయా

చ॥ బంటువైనా నువ్వేలే బంధువైనా నువ్వేలే
బాధలన్నీ తీర్చే దిక్కూ దైవం నీవేలే
చూసి రారా అంటేనే కాల్చి వచ్చావ్ మంటల్లే
జానకమ్మ కంట వెలిగే హారతీ నీవే
ఎదలోనే శ్రీరాముడంట కనులారా కనమంట
బ్రహ్మచారీ - మా బ్రహ్మవంట
సరిసాటీ ఎవరంట
సాహో...! మాసామీ నువ్వే హామీ యిస్తూంటే
రామబాణాలు కాపాడేనంట
ఓహో మా జండాపైన అండై నువ్వుంటే
రామరాజ్యాలు మావే లెమ్మంట
మమ్ము ఆదుకోరావయ్యా ఆంజనేయా ఆపద కాయ
చూపించ రారా దయ
మమ్ము ఏలుకో రావయ్యా రాక్షసమాయ హతమే చేయ
నీనీడ చాలునయా

చ॥ మండుతున్న సూర్యుణ్ణి పండులాగా మింగావు
లక్ష్మణుణ్ణి గాచే చెయ్యే సంజీవి మాకు
తోక చిచ్చు వెలిగించి లంక గుట్టే రగిలించి
రావణుణ్ణి శిక్షించావు నువ్వే మాతోడు
శివతేజం నీ రూపమంట
పవమానసుతుడంట
అంజనమ్మ ఆనందమంతా
హనుమా నీ చరితంట
సాహి...! శ్రీరామస్వామీ పల్లకి నువ్వంట
నీకు బోయీలు మేమే లెమ్మంటా
యాహీ...! ఆకాశాలైనా చాలని ఎత్తంట
కోటి చుక్కల్లు తల్లో పూలంటా
మమ్ము ఆదుకోరావయ్యా ఆంజనేయా ఆపద కాయ
చూపించ రారా దయ
మమ్ము ఏలుకో రావయ్యా రాక్షసమాయ హతమే చేయ
నీనీడ చాలునయా
వాయుపుత్రా హనుమా మా వాడవయ్యా హనుమా
రామభక్తా హనుమా మా రక్ష నీవే వినుమా

రచన: సీతారామశాస్త్రి ② గానం: మల్లికార్జునరావు

ప: రామ రామ రఘురామ అని పాడుతున్న హనుమా
అంత భక్తి పరవశమా ఓ కంట మమ్ము గనుమా
సరదాగా నా గాలిపాట వినుమా
విన్నాక బదులిచ్చి ఆదుకొనుమా
గాలికి పుట్టా గాలికి పెరిగా అచ్చం నీలాగ
నిత్యం నీతో వున్నాగా ఇద్దరి లక్షణమొకటేగా...

చ: అమ్మల్లె నను పెంచింది ఈ పల్లె సీమ
నాన్నల్లె నడిపించింది ఊరంత ప్రేమ ॥అమ్మల్లె॥
ఎలా పెంచుకున్నా ఎలా పిలుచుకున్నా
ఈ మట్టి సొంతం నా చిట్టి జన్మం
అన్నీ సొంత ఇళ్లే అంతా అయినవాళ్లే
ఈ స్నేహబంధం నా పూర్వపుణ్యం
బతుకంతా ఇది తీరే ఋణమా... ॥రామరామ॥

చ: ఏ ఆటలాడిస్తావో ఓ కోతిబొమ్మా...
ఏ బాట చూపిస్తావో కానున్న బ్రహ్మా
ప్రసన్నాంజనేయం అనే నామధేయం
ప్రతి మంచి కార్యం జరిపించు దైవం
ప్రభాదివ్యకాయం, ప్రకీర్తిప్రదాయం
నాలోని ధైర్యం శ్రీ ఆంజనేయం
నావెంటే నువ్వుంటే భయమా... ॥రామరామ॥

రచన: సీతారామశాస్త్రి ③ గానం: టిప్పు, శ్రేయ ఘోషల్

అ: అవ్వాయి తువ్వాయి అల్లాడే అమ్మాయి
ఆ: అవ్వాయి తువ్వాయి గిల్లాడే అబ్బాయి
అ: దాగీదాగని సోకే బరువయి ఆగీ ఆగని ఈడే ఇరుకయి
ఆ: తాకీతాకని చూపే చినుకయి దూకీ దూకని ఊపే వరదయి
అ: ఏం చేస్తుందో ఎలా ముంచేస్తుందో
అయ్యోరామా! అసలిదేం లడాయీ ॥అవ్వాయి॥
అ: పాలోసి పెంచా ప్రతి భంగిమా పోగేసి ఉంచా పురుషోత్తమా
అమాంతం తెగిస్తే సమస్తం తమకేగా
అ: కంగారు పెట్టే సింగారమా బంగారమంతా భద్రం సుమా
ప్రమాదం తెలిస్తే సరదా పడతావా
ఆ: ఎన్నాళ్లీ గాలిలో తిరుగుడు
ఇలా నా ఒళ్లో స్థిరపడే దారిచూడూ
అ: బాలామణీ సరే కానీ మరి
పదచెల్లిస్తా ప్రతి బకాయీ ॥అవ్వాయి॥
అ: తెగరెచ్చిపోకే పసిపిచ్చుకా నన్నాపలేదే నీ ఓపిక
పిడుగై పడనా వ్రతమే చెడినాక
ఆ: చిర్రెత్తి వస్తే మగపుట్టుక సుకుమారమిస్తా సుఖపెట్టగా
ఒడిలో పడనా వరమే అడిగాక
అ: కవ్వింతలెందుకే బాలికా మరీ పువ్వంటి సున్నితం కందిపోగా
ఆ: చిచ్చౌతావో నువ్వే చిత్తౌతావో
ఎటూ తేలందే ఇదేం బడాయీ ॥అవ్వాయి॥



రచన: సీతారామశాస్త్రి (4) గానం: శ్రేయ ఘోషల్

ప: పూల ఘుమఘుమ చేరని ఓ మూల ఉంటే ఎలా
తేనె మధురిమ చేదని ఆ మూతి ముడుపేంటలా
ప్రేమంటే పామని బెదరాలా
భీమాగ తిరగర మగరాయడా
భామంటె చూడని వ్రతమేలా
పంతాలె చాలుర ప్రవరాఖ్యుడా
మారనే మారవా మారమే మానవా
మౌనివా మానవా తేల్చుకో మానవా ॥పూల॥

చ: చెలి తీగకి ఆధారమై బంధమై అల్లుకో
దరికొచ్చి అరవిచ్చి అరవిందమయ్యే అందమే అందుకో
మునిపంటితో నా పెదవిపై మల్లెలే తుంచుకో
నా వాలుజడ చుట్టుకొని మొగలిరేకా నడుము నడిపించుకో
వయసులో పరవశం చూపుగా చేసుకో
సొగసులో పరిమళం శ్వాసగా తీసుకో ॥పూల॥

చ: ప్రతి ముద్దుతో ఉదయించనీ కొత్త పున్నాగనై
జత లీలలో అలసి మత్తెక్కిపోనీ నిద్రగన్నేరునై
నీ గుండెపై ఒదిగుండనీ పొగడ పూదండనై
నీ కంటి కోనేట కొలువుండిపోనీ చెలిమి చెంగలువనై
మోజులే జాజులై పూయనీ హాయినీ
తాపమే తుమ్మెదై తీయనీ తేనెని ॥పూల॥

(5) గానం : చిత్ర, కల్పన

శ్రీ ఆంజనేయ దండకము

శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం
ప్రభాదివ్యకాయం ప్రకీర్తిప్రదాయం
భజేవాయుపుత్రం భజేవాలగాత్రం
భజేహంపవిత్రం భజేసూర్యమిత్రం
భజేరుద్రరూపం భజేబ్రహ్మతేజం
భజేహం భజేహం భజేహం భజేహం

రచన: సీతారామశాస్త్రి (6) గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ప: తికమక మకతిక పరుగులు ఎటుకేసి
నడవరా నరవరా నలుగురితో కలిసి
శ్రీరామ చందురుణ్ణి కోవెల్లో ఖైదుచేసి
రాకాసి రావణుణ్ణి గుండెల్లో కొలువుచేసి
తలతిక్కల భక్తితో తైతక్కల మనిషీ
తై దిదితై దిదితై దిదితై
దిదితై దిదితై దిదితై
దిదితై దిదితై దిదితై
దిదితై దిదితై దిది
తికమక మకతిక పరుగులు ఎటుకేసి
నడవరా నరవరా నలుగురితో కలిసీ

చ: వెతికే మజిలీ దొరికే దాకా
కష్టాలు నష్టాలు ఎన్నొచ్చినా క్షణమైన నిన్నాపునా
కట్టాలి నీలోని అన్వేషణ
కన్నీటిపై వంతెన
బెదురంటు లేని మది ఎదురుతిరిగి అడిగేనా
బదులంటూ లేని ప్రశ్న లేదు లోకానా
నీ శోకమే శ్లోకమై పలికించరా మనిషీ
తై దిదితై దిదితై దిదితై
దిది తికమక మకతిక పరుగులు ఎటుకేసీ
నడవరా నరవరా నలుగురితో కలిసీ

చ: అడివే ఐనా కడలే ఐనా
ధర్మాన్ని నడిపించు పాదాలకీ శిరసొంచి దారీయదా
అటువంటి పాదాల పాదుకలకీ పట్టాభిషేకమే కదా
ఆ రామగాథ నువు రాసుకున్నదె కాదా
అది నేడు నీకు తగు దారి చూపనందా
ఆ అడుగుల జాడలు చెరపొద్దురా మనిషీ
తై దిది తరికిటతోం
తరికిటతోం తరికిటతోం
తత్తోం తికమక....మకతిక
తికామకా తిక తికమక మకతిక
పరుగులు ఎటుకేసి
నరవరా నడవరా నలుగురితో కలిసీ...

రచన: సీతారామశాస్త్రి (7) గానం: యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ప: శ్రీఆంజనేయం ప్రసన్నాంజనేయం
ప్రభాదివ్యకాయం ప్రకీర్తిప్రదాయం
భజేవాయుపుత్రం భజేవాలగాత్రం
భజేసూర్యమిత్రం భజేహం పవిత్రం
భజేరుద్రరూపం భజేబ్రహ్మతేజం
భజేవజ్రదేహం భజేహం-భజేహం-భజేహం

చ: ఏయోగమనుకోను నీతో వియోగం
ఏ పుణ్యమనుకోను ఈ చేదు జ్ఞానం
తపస్సనుకోలేదు నీతోటి స్నేహం
మోక్షమనుకోలేను ఈ మహాశూన్యం
నేలపై నిలపక నెయ్యమై నడపక
చేరువై ఇంతగా చేయి విడిచేందుకా
అరచేత కడదాక నిలుపుకోలేవంటూ
నిజము తెలిపేందుకా గాలికొడుకా
ఇలా చూపేవు వేడుకా ॥శ్రీ ఆంజనేయం॥

చ: రామనామము తప్ప వేరేమి వినపడని
నీ చెవికెలా తాకె నా వెర్రికేక
నీ భక్తి యోగముద్రను భంగపరిచేనా
మట్టి ఒడిలోని ఈ గడ్డిపరక
అమ్మ ఇచ్చిన నాటి నమ్మకము మెచ్చి
అమృతపు నదిలాంటి కరుణలో ముంచి
ఈత తెలియని నాతో ఆడుతున్నావా
కోతి చేష్టలు చేసి నవ్వుతున్నావా ॥శ్రీ ఆంజనేయం॥

చ: కన్ను విడిచిన దృష్టి నిన్ను పోల్చేదెలా
గొంతు విడిచిన కేక నిన్ను చేరేదెలా
గుండె విడిచిన శ్వాస నిన్ను వెతికేదెలా
నన్ను విడిచిన ఆశ నిన్ను పొందేదెలా
బతుకోపలేనంత బరువైన వరమాల
ఉరితాడుగా మెడను వాలి
అణువంత నా ఉనికి అణిగేంతగా
తలను నిమిరే హనుమంత నీజాలి
నా చిన్ని బొమ్మవను భ్రమను చెరిపే తెలివి
బ్రహ్మవని తెలిపి బలిచేస్తే ఎలాగయా
నిలువునా నన్నిలా దహించే నీ దయ
నా కెందుకయ్యా ఓ ఆంజనేయా !
ఓ ఆంజనేయా ఓ ఆంజనేయా
ఓ ఆంజనేయా ఓ ఆంజనేయా

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

## తారాగణం

అర్జున్ (ప్రత్యేక పాత్రలో)
నితిన్, ఛార్మి, చంద్రమోహన్, ఎల్.బి.శ్రీరాం, గౌతంరాజు, జోగిబ్రదర్స్, సుబ్బరాజు, టార్జాన్, శివసత్యనారాయణ, పిళ్ళాప్రసాద్, అనంత్, పృథ్వి, నెల్ల శ్రీరామ్, రాజబాబు, గిరి, మూర్తి, దప్పుప్రసాద్, అప్పారావు, ప్రభాకర్, సుభాషిణి, లావణ్య, విమలశ్రీ

కార్తికేయ
ఎంటర్‌టైన్‌మెంట్ (ప్రై) లిమిటెడ్


కృష్ణవంశీ


మణిశర్మ


సీతారామశాస్త్రి


వేటూరి

## సాంకేతిక నిపుణులు

మాటలు : రాధాకృష్ణ
కెమెరా : రాంప్రసాద్
సంగీతం : మణిశర్మ
ఆర్ట్ : ఆనందసాయి
ఎడిటింగ్ : కృష్ణారెడ్డి
ఫైట్స్ : మాంటి, జిమ్మి(యు.ఎస్.ఎ), అమన్‌ఘని, థ్రిల్లర్‌మంజు
విజువల్ ఎఫెక్ట్స్ : గాల్వనాన్ చక్రి(యు.ఎస్.ఎ.)
పబ్లిసిటి : అనిల్ & భాను
పి.ఆర్.ఓ. : ఎల్.వేణుగోపాల్
నిర్మాణ, నిర్వహణ : సూర్యదేవర లలిత ప్రభాకర్
సహ నిర్మాతలు : రాజు, ప్రవీణ్, గిరి, బాబు (ఆర్.పి.జి.)
కథ, స్క్రీన్‌ప్లే, నిర్మాత, దర్శకత్వం: కృష్ణవంశీ






మణిశర్మ కృష్ణవంశీ సీతారామశాస్త్రి

జూన్ 1 ఎస్వీ కృష్ణారెడ్డి పుట్టినరోజు సందర్భంగా...

# అది యమలీల కాదు - కృష్ణలీల !!



కృష్ణారెడ్డి గారి సినిమాకెళ్తే 'అమ్మ పుట్టిన ఊరికెళ్ళినట్టుంటుంది...'
ఆత్మీయంగా ఉంటుంది, ఆర్ద్రంగా ఉంటుంది...
అమ్మ వేడివేడి అన్నం ముద్దలు చందమావని చూపిస్తూ పెట్టినట్టు -మాటలూ...
సుబ్బరంగా స్నానం చేయించి, పౌడరద్దీ, సాంబ్రాణి వేసి ఉయ్యాల్లో జోకొడ్తున్నట్టు పాటలూ...
మన మావయ్యల్నో - అత్తయ్యల్నో - బావ మరుదుల్నో - మరదళ్ళనో చూసిన అనుభూతి లాంటి పాత్రలు...
టిక్కెట్టు కొన్న ప్రేక్షకుడు కడుపునిండీ మనసు నిండీ
కనులు నిండీ తృప్తిగా మరీ వొస్తాడు...
పైగాఈయన సినిమాకెళ్తే గ్యారంటీ ఏంటంటే...
సినిమాలో భూతద్దం పెట్టి చూసినా బూతు కనిపించదు
కనక.... అక్కలతోటీ - చెల్లెళ్ల తోటీ - కూతుళ్ళతోటీ -
కన్నతల్లుల్తోటీ - బంగారు తల్లుల్లాంటి భార్య తోటి హాయిగా వెళ్ళొచ్చు!...
గోదారి ప్రాంతం నించి వచ్చినవాడూ... మర్యాదా మన్ననా తెలిసినవాడు...
రసహృదయుడూ... సరస హృదయుడు అన్నింటినీ మించి సహృదయుడు....
అచ్చిరెడ్డి గారూ కృష్ణారెడ్డి గారూ.... బాపూరమణల్లాగ - అద్వైతం!!!
నేను మద్రాసు నించి... హైదరాబాద్‌కి వచ్చిన కొత్త...
అడపాదడపా వేషాలేస్తున్నాను గానీ... ప్రధానంగా రచనే!
అలాంటి సమయంలో... కృష్ణారెడ్డి గారి నుంచి కబురొచ్చింది...
కాంటాక్ట్ చెయ్యమని... అప్పటికి నాకు ఫోన్ కూడా లేదు....
సరే మర్నాడు.... ఎస్టీడీ బూత్‌కెళ్ళి ఆయన నంబర్‌కి కొట్టా మద్రాసుకి...
"నమస్కారం భరణిగారూ నాపేరు కృష్ణారెడ్డి"
అని పరిచయం చేసుకున్నాడు... అదాయన సంస్కారం
అప్పటికే ఆయన లబ్ధ ప్రతిష్టుడూ...
"చెప్పండి సార్" అన్నాను...
"మీరో వేషం వెయ్యాలి మా సినిమాలో"
"తప్పకుండా సార్ అంతకన్నానా"
"ఫలానా డేట్లు కావాలి!..."
"మంచిది సార్ ఒకసారి చెక్ చేసుకునీ రేపు చెయ్యనా"
"సరేనండీ!... ఉంటా!..."
నాకు తెలుసు ఆయన అడిగిన డేట్లు అప్పటికే ఎడిటర్ మోహన్ గారి సినిమా 'పల్నాటి పౌరుషా'నికిచ్చేసా
కృష్ణంరాజుగారి - బావమరిది వేషం.... మంచి నీచ పాత్ర...
చాలా బాధ కలిగింది! కృష్ణారెడ్డి గారి లాంటి సక్సెస్‌ఫుల్ డైరెక్టరు... మంచివాడని పేరు సంపాదించుకున్న డైరెక్టరు దగ్గర వెయ్యలేకపోతున్నానే అని...
నిజం చెప్పొద్దూ... ఆ రాత్రి నిద్ర పట్టలేదు... మర్నాడు మోహన్ గారి కంపెనీకి ఫోన్ చేసి - ముత్యాల సుబ్బయ్య గారి కో-డైరెక్టర్ భీమనేని శ్రీనివాసరావు గారిని అడిగా - ఏమన్నా అడ్జెస్ట్‌మెంట్ కుదురుతుందా అని!... 'కష్టం గురువుగారూ' అన్నాడు.
కుదిరితే నేను చెయ్యనా?... అన్నట్టుగా
'బంగారం లాంటి అవకాశం పోయిందిరా భరణీ' అనుకుని... పరమేశ్వరుడికో దణ్ణం పెట్టుకుని... మర్నాడు ఎస్వీ కృష్ణారెడ్డి గారికి చేసా!.... "క్షమించండి సార్!... ఆ



డేట్స్ ఆల్‌రెడీ ఎడిటర్ మోహన్ గారికి ఇచ్చేసా!!"

కాస్సేపు సైలెన్స్!.....

"పోనీ!... ఆ షెడ్యూల్ అయిన తర్వాత?..."

"తర్వాతైతే... ఖచ్చితంగా కుదురుతుంది సార్!..."

"ఏం ఫర్లేదు... మీరు మాక్కావాలి!.... నేను షెడ్యూల్ మార్చుకుని పాటలూ అవీ తీసుకుంటా.... మీకు వీలైన డేట్లే ఇవ్వండి!!"

నేను ఎగిరి... గంతేసా!...

రచయిత దగ్గర్నించి.... నటన వైపుకి!!

* * *

సెట్లో ఆయన డే లైట్‌లాగ.... ప్రశాంతంగా... చల్లగా... నవ్వుతూ ఉంటాడు!...

ఆయనకి కోపం రావడం... నేను చూళ్లేదు... బహుశ నాకు తెలిసి ఎవరూ చూళ్లేదేమో...

ఆయన... పరిచయం నాకో దివ్యానుభవం...

మనిషి ఎంత మంచిగా బతకొచ్చు... ఎంత హుందాగా ఆలోచించొచ్చు అన్నది... పునశ్చరణ జరిగింది ఆయన సమక్షంలో...

ఆయన పూటకో కథ చెప్పేవాడు.... చెప్పిన ప్రతిదీ ఫీలయి చెప్పేవాడు! అందులో కొన్ని మంచివి... కొన్ని... ఫరవాలేదు స్థాయివి... మరికొన్ని బాగా చప్పవి... చప్పటి కథలు చెప్పేటప్పుడు ఆయన మన రియాక్షన్ బట్టి... "బాలేదుకదూ!... అనుకున్నాను" అని మానేసేవాడు!! - అంటే జడ్జిమెంట్ కరెక్టుగా తెలిసినవాడు!

- 'యమలీల'లో నాది తెలంగాణా రౌడీ... కమ్... కవీ పాత్ర నాది!... ఒక్క యాసలోకి కొద్దిగా మార్చుకోవడం తప్ప ప్రతీ అక్షరం దివాకర్‌బాబుదే!... చాలామంది 'గల్లీలో నా చెల్లికి - పెళ్లి! నా చెల్లి పెళ్ళి చెయ్యాలి మళ్ళీ మళ్ళీ...'

అనేది... నేనే రాసేనని అనుకునేవారు...

కాదు!!

ఒక్క అక్షరం కూడా నాది కాదు... మొత్తం రచయిత, దర్శకుల... కల్పనే!!

ఆ సినిమాలో హీరో ఆలీ!. అసలు ఆలీని హీరోగా పెట్టి తీయడానికి - ఎన్ని గుండెలు కావాలి!

అక్కడ ఉన్నవే అవి...

కిషోర్‌రాఠీ గారు

అచ్చిరెడ్డి గారు

కృష్ణారెడ్డి గారు

దివాకర్‌బాబు గారు

శరత్ గారు

ఐదు గుండెల ధ్వని 'యమలీల'

అది ఆంధ్రదేశం అంతా దద్దరిల్లేలా ప్రతిధ్వనించింది

ఆలీ 'హీరో' అయిపోయాడు...

ఇంద్రజ హీరోయిన్ అయిపోయింది!..

భరణి - విలనైపోయాడు...

కృష్ణారెడ్డిగారు మాత్రం... తలెత్తాడేమోగానీ... కాలరెత్తలేదు!!

"మీ అందరి కృషీ... ఆ ప్రేక్షకుల ఆశీర్వాదం" అన్నాడు!!

అదీ ఆయన సక్సెస్‌కి... కారణం...

ఆ తర్వాత ఆంధ్రదేశంలో ఎక్కడికెళ్ళినా...

నన్ను 'చెల్లిపెళ్ళి' కవిత చెప్పమనేవారు!...

ఆ సంవత్సరం... నేను 'ముప్ఫైఏడు' సినిమాలు ఒప్పుకున్నాను...

అప్పటిదాకా అడపాదడపా వేషాలేసే నేను...

అప్పట్నించి... 'కలం మూసీ' అటక మీద పెట్టేసాను!

కృష్ణారెడ్డిగారు అంటూ ఉండేవారు!... "నా అసిస్టెంట్లు 'కార్ల'లో వస్తూంటే చూడాలని ఉందండీ" అని

బహుశ కమ్యూనిస్టు విధాత 'కార్ల్‌మార్క్స్' కూడా ఈ విషయం ఊహించి ఉండడేమో!

కృష్ణారెడ్డి గారి కంపెనీలో 'పుడ్డు'... పెళ్ళిభోజనం !

ఎప్పుడైనా పక్కన కృష్ణారెడ్డిగారి షూటింగ్ జరుగుతోంటే ఆర్టిస్టులు, టెక్నీషియన్లు మనీషా సంస్థకెళ్ళి భోంచేసేవాళ్ళు.

వాళ్ళు బంగారం పెడతారని కాదు.

బంగారు వంటి మనసుతో పెడతారని!

'యమలీల'లో కామెడీ విలన్ పాత్ర నిచ్చిన కృష్ణారెడ్డి గారు 'మావిచిగురు'లో ఆమని బాబాయి పాత్రనిచ్చి నన్ను కారెక్టర్ యాక్టర్‌ని చేసారు.

"నేను చెయ్యగలనా సార్" అంటే...

"మీరే చెయ్యగలరు..." అన్నారాయన!

నేను యుద్ధం చెయ్యగలనా కృష్ణా అంటే

నువ్వే చెయ్యాలి అర్జునా - అన్న గీతాకారుళ్ళా!

నేనూ... పుట్టినరోజు సందర్భంగా కృష్ణారెడ్డిగారితో అదే అంటున్నా - గురువుగారూ - యుద్ధం చెయ్యండి!!

గెలుపు వాడి నిర్ణయం!!

మీరు గెలవాలి!

ఇది నా కోరిక!!

భవదీయ

**తనికెళ్ళ భరణి**

# రాజా ఆడియో రివ్యూ

పాటలకు పెద్దపీట వేసే దర్శకులలో కృష్ణవంశీ స్థానం ప్రత్యేకం. సన్నివేశాన్ని, పాత్రల వ్యక్తిత్వాన్ని మరింత లోతుగా తెలియజేయడానికి పాట ప్రయోజనం ఎంత వరకో తెలిసిన దర్శకుడాయన. పాట అవసరం అనిపించిన చోట - తగిన సన్నివేశాన్ని రూపకల్పన చేసుకోవడం దగ్గర్నుండి - దగ్గరుండి పాట రాయించుకోవడం, ట్యూన్ చేయించుకోవడం వరకూ - ఇవన్నీ రచయిత, సంగీత దర్శకుల ముద్ర, సామర్థ్యంతో బైటకి కనిపిస్తున్నా అంతర్లీనంగా ఆయన అభిరుచి, ప్రేరణతో దర్శనమిస్తూ వుంటాయి. అందుకు మరో తాజా నిదర్శనం - శ్రీ ఆంజనేయం !

ఈ చిత్రం పాటలను మారుతి మ్యూజిక్ అనే కొత్త ఆడియో సంస్థ విడుదల చేసింది. ఈ సంస్థ అధినేతలకు పంపిణీదారులుగా చిత్ర పరిశ్రమలో చాలా సంవత్సరాల అనుబంధం ఉంది.

ఈ ఆడియోలో తొలుత వినిపించే - "ఊరేగి రావయ్యా హనుమా జై హనుమా ఊరేలి చూపించు మహిమ' అనే గీతాన్ని వేటూరి రాయగా శంకర్ మహదేవన్, బృందం గానం చేశారు. పల్లవిలోని 'ఊరేగడం, ఊరేలడం' లాంటి వాక్యాలు వినగానే చెప్పెయ్యొచ్చు ఇది వేటూరి రాశారని. 'సిరిసిరిమువ్వ' లోని 'ఊరేగినా వాడే ఊరేలినా వాడే' అనే పాటను ఈ సందర్భంగా ఓ సారి గుర్తు చేసుకుంటే చాలు. 'జానకమ్మ కంట వెలిగే హారతి నీవేలే', 'తోకచిచ్చు', 'శ్రీరామస్వామి పల్లకి నువ్వంట నీకు బోయీలు మేమేలెమ్మంటా' వంటి మంచి ప్రయోగాలు చేశారాయన. ఈ పాటకు చాలాకాలం పాటు గుర్తుండిపోయే ట్యూన్ ఇచ్చాడు మణిశర్మ. గుళ్లలో, పందిళ్లలో, సామూహిక భజనల్లో తప్పనిసరిగా పాడుకునే స్థాయిలో ఉంది ఆయన ఇచ్చిన ట్యూన్. జనరంజకత్వం కోసం ఈ పాటలో కొన్ని తమాషాగా మిక్స్ చేశాడు కూడా.... 'సమాధి' సినిమాలో ఆర్.డి.బర్మన్ స్వరపరిచిన 'బంగ్‌లే కే పీఛే తేరీ బేరీ కే నీచే' పాటలోని చరణాల చివర్న వచ్చే ట్యూన్‌ని (ఉదా॥ 'భూల్‌తో హోగయీ - జో కియా జో కియా తూ బచాలే వనా -ఆజ్ వేంరాజియహ') ఈ పాటలో 'వాయుపుత్రా హనుమా - మా వాడవయ్యా హనుమా/రామభక్తా హనుమా - మా రక్ష నీవే వినుమా' అనే లైన్లకు వాడుకున్నారు. ఆర్డీ బర్మన్ స్వరపరిచిన ఆ పాట 1972లో చాలా పెద్ద హిట్. అన్నపూర్ణా వారు తీసిన 'బంగారుకలలు' సినిమాలో వహీదా రెహమాన్ డ్యాన్స్ చేసిన 'నాలోన వలపుంది నీలోన వయసుంది' పాటకు 'బంగ్‌లే కే పీచె' పాట ట్యూన్‌ని యస్.రాజేశ్వరరావుకే వాడుకోక తప్పింది కాదు. హిందీ పాట తెలియని వాళ్లు, 'బంగారుకలలు' లో పాట మాత్రమే తెలిసిన వాళ్లు ఆ పాట చరణాల చివర్న వచ్చే 'నీ రాణి నేనే - నా రాజు నువ్వే/ ప్రియురాలు నేనే - జవరాలు నేనే' అనే




విడుదల : మారుతి మ్యూజిక్
వెల : రూ.38/-

లైన్స్‌ని జ్ఞాపకం చేసుకుంటే చాలు - 'వాయుపుత్రా హనుమా - మా వాడవయ్యా హనుమా' అనే లైన్లకి మూలం దొరుకుతుంది. (ఆర్డీ స్వరపరిచిన 'బంగ్‌లే కే పీచే' పాటను వినాలంటే ఈ తరం వారికి 'కాంటాలగా' రీమిక్స్ ఆల్బమ్ ఒక్కటే శరణ్యం) ముందుగా చెప్పినట్టు జనరంజకత్వం కోసం ఇది కావాలని, తెలిసి చేసిన తమాషా..... అలాగే తెలియకుండా జతపడిన మరో తమాషా ఉంది.

ఈ పాటలో 'మమ్ముఆదుకోరావయ్యా ఆంజనేయ ఆపద కాయ చూపించ రారా దయ' అనే లైన్ల ట్యూన్‌కి కొన్ని జానపద మూలాలు ఉన్నాయి. 'పాపకోసం' సినిమాలో పెండ్యాల స్వరపరిచిన 'పెళ్లాలు లేకనే పెనవాలు (ప్రసవాలు) లేకనే పాపాయి వచ్చింది మా యింటికి' అనే పాట ట్యూన్‌ని 'బంగారుబాబు' సినిమాలో కెవిమహదేవన్ స్వరపరిచిన 'శ్రీరామచంద్రా నారాయణా ఎన్ని కష్టాలు వచ్చాయిరా నాయనా' అనే పాట ట్యూన్‌ని ఈ సందర్భంగా గుర్తు చేసుకోవడం అవసరం. (**ఇది తెలియకుండానే జతపడిందని ఇటీవల 'సాంబ' ఆడియో ఫంక్షన్‌లో మణిశర్మతో జరిపిన సంభాషణ ద్వారా ఈ సమీక్షకుడికి అర్థమయింది.**) ఏది ఏమైనా ఈ 'ఊరేగి రావయ్యా హనుమా' పాట మంచి పాట, కొన్నేళ్ల పాటు వినిపించే పాట.

'రామ రఘురామ అని పాడుతున్న హనుమా' అనే పాట మణిశర్మ కెరీర్‌లోనూ, గాయకుడు మల్లికార్జునరావు జీవితంలోనూ మధురానుభూతిగా నిలిచిపోయే గీతం. ఈ పాటకి మణిశర్మ సమకూర్చిన ట్యూన్ ఎంత మధురంగా ఉందో వర్ణించడానికి భాష చాలా చిన్నదనిపిస్తుంది. పాడుకుంటున్న కొద్దీ మళ్ళీ మళ్ళీ పాడుకోవాలనిపిస్తుంది. పాట పల్లవిలోని ఎత్తుగడ, బ్రీతింగ్ స్పేస్‌లు 'మిలన్' సినిమాలోని 'సావన్ కా మహీనా' పాట పల్లవిని పోలివున్నా అది కేవలం ఈ పాట అనుపల్లవిలో చెప్పినట్టు - గాలికి పుట్టా - అచ్చం నీలాగా... ఇద్దరి లక్షణమొకటేగా - లాంటి సంబంధమే తప్ప స్వరకర్తను వేలెత్తి చూపేది మాత్రం కాదు. 'రామరామ రఘురామ అని పాడుతున్న హనుమా' పాటను పూర్తిగా హృదయానికి పట్టించేసుకొని మణిశర్మ గతంలో చేసిన మెలొడీల వైపు దృష్టి సారించండి - 'మనోహరం'లో 'సరిసరి నటనల ఓ చెలియా బెళుకుల బెట్టుసరి' పాటనీ 'రాఘవేంద్ర' సినిమాలోని 'నమ్మిన నామది మంత్రాలయమేగా నమ్మని వారికి తాపత్రయమేగా' అనే పాటనీ మరోసారి తెచ్చుకుని వినండి. ఈ రాగంలో ఈ మెలొడీతో మణిశర్మ సినీ సంగీతానికి ఎంత మంచి కంట్రిబ్యూషన్ ఇచ్చాడో అవగాహన కొస్తుంది. యమన్ రాగం ఈ పాటలకు ఆధారం. గాయకుడి పరంగా చెప్పాలంటే ఈ పాట మల్లికార్జునరావుకి దొరికిన వరం. ఎక్కడికి వెళ్ళినా జీవితాంతం ఈ పాటతో ఐడెంటిఫై అవగలడాయన. ఒక విధంగా చెప్పాలంటే శంకర్ మహదేవన్ కోసం చేసిన ట్యూన్ అదృష్టం కొద్దీ మల్లికార్జునరావుకి దక్కిందేమోననిపిస్తుంది. ఈ పాట ట్యూన్‌లోని మలుపులు, విరుపులు, గమకాలు, బ్రీతింగ్ స్పేస్‌లు అన్నీ శంకర్ మహదేవన్ వాయిస్ కల్చర్‌కి దగ్గరగా ఉన్నాయని ఈ సమీక్షకుడి వ్యక్తిగత అభిప్రాయం. శంకర్‌మహదేవన్ పాడే పద్ధతిపై మణిశర్మకిగల నమ్మకం, అతనితో అనుబంధం ఎంతటివో ఈ సమీక్షకుడికి స్వయంగా తెలియడం అందుకు ఒక కారణం అయితే 'మనోహరం'లోని 'సరిసరి నటనల ఓ చెలియా బెళుకుల బెట్టుసరి' పాటని శంకర్ మహదేవన్‌తో మణిశర్మ పాడించిన విధానం మరో కారణం. ఇక ఈ పాటకి సీతారామశాస్త్రి గారిచ్చిన సాహిత్యం గురించి క్లుప్తంగా వివరించడం కొంచెం కష్టం. పాడుకుంటున్న కొద్దీ - భావం లోతులు అందేలా అందరికీ అర్థమయ్యే పదాల్తో రాయడం ఎంత

కష్టమో ఇలాంటి పాట రాయాలనుకున్న వాళ్ళకి మాత్రమే తెలుస్తుంది.

టిప్పు, శ్రీయాఘోషల్ పాడిన 'అవ్వాయి తువ్వాయి అల్లాడే అమ్మాయి' పాట ఓ హుషారైన ఓ యుగళగీతంగా రూపొందడానికి సంగీతం, సాహిత్యం, గానం అన్నీ తగు పాళ్ళలో సమకూరాయి. సాధారణంగా ఇటువంటి పాటలలో కమర్షియల్ ఫార్ములా ప్రకారం శృంగారపరంగా సాహిత్యం గాడి తప్పే ప్రమాదం ఎంతో వుంది. ఆ ఫార్ములా వెూతాదు మించకుండా వీలయినంత నర్మగర్భంగా బాలెన్స్ చేసుకొంటూ వచ్చారు గీత రచయిత సీతారామశాస్త్రి.

శ్రీయాఘోషల్ పాడిన 'పూల ఘుమఘుమ చేరని ఓ మూల ఉంటే ఎలా' పాటకి కూడా 'అవ్వాయి తువ్వాయి' పాటకి చెప్పుకున్న విశేషణాలనే అన్వయించుకోవాలి.

ఈ ఆడియోకి చేకూరిన మరో మంచి పాటగా 'తికమక మకతిక పరుగులు ఎటుకేసి' పాటను చెప్పుకోవాలి. మెలొడీ పరంగా 'రామరామ రఘురామ అని పాడుతున్న హనుమా' పాటకి తర్వాత స్థానంలోను సాహిత్యపరంగా ముందు స్థానంలోనూ ఉంచదగ్గ పాట యిది. మధ్యమావతి రాగచ్ఛాయలలో సాగిన ఈ పాటకి మణిశర్మ తన ట్యూన్‌తోనూ ఆర్కెస్ట్రయిజేషన్ తోనూ మంచి ఊపునిచ్చాడు. పాట మొదట్లోనూ రెండో చరణం మొదట్లోనూ మాండొలిన్‌తో వినిపించిన ఓ బిట్ అందర్నీ ఆకర్షిస్తుంది. ఆ బిట్ గురించి మాట్లాడుతూ అక్కడ ఉపయోగించినది మాండొలినే అని కన్ఫర్మ్ చేస్తూ - కోతికి కుప్పి గంతులు అని అంటారు చూడండి దాన్ని ఇన్‌స్పిరేషన్‌గా తీసుకొని ఆ బిట్‌ని కంపోజ్ చేశాను - అని చెప్పారు మణిశర్మ 'హాసం'తో. సాహిత్యపరంగా సీతారామశాస్త్రి గారిలోని తాత్త్వికత, భావుకత, సామాజిక బాధ్యతలకు అద్దం పట్టే మరో మంచి పాట యిది. 'ధర్మాన్ని నడిపించే పాదాలకి అడవైనా కడలైనా శిరసు వంచి దారి ఇస్తాయి కదా - అటువంటి పాదాల పాదుకలకు పట్టాభిషేకం జరిగిందన్న కథ కూడా మనం రాసుకున్నదే కదా - ఆ కథ నీకు దారి చూపటం లేదా - ఆ అడుగుజాడలు మరచిపోకురా మనిషీ' అంటూ ఆయన రాసిన రెండో చరణం - మనసు బాగులేనప్పుడల్లా విని చూడండి. గుండె రెండు రకాలుగా ఉప్పొంగిపోతుంది - ఎటువంటి సమస్యనైనా ఎదుర్కొనే స్థైర్యం మొదటి రకానికి చెందినది అయితే ఇటువంటి కవి ఎక్కువమందిని ప్రభావితం చేయగలిగిన సినిమా మీడియాలో ఉన్నాడన్న ధైర్యం రెండవ రకానిది. ఏదో ప్రయోజనం ఉండబట్టే ఈయనచేత భగవంతుడు ఇన్ని మంచి పాటలు రాయిస్తున్నాడు. లేకపోతే కమర్షియల్ పాటలలో ఆధ్యాత్మికతతో కూడిన ఇంత లోతైన భావాలను రాసే అవకాశం అందరికీ రాదు. ఇక - బాలూ ఈ పాట పాడకపోయి ఉంటే మణిశర్మ సంగీతం, సీతారామశాస్త్రి సాహిత్యం రెండూ రసహీనతకి గురి అయ్యే ప్రమాదం ఉండి ఉండేది. తెలుగు శ్రోతలు అదృష్టవంతులు, భగవంతుడు వీరిని కూడా చల్లగా చూశాడు.

'ఏ యోగమనుకోను నీతో వియోగం' అనే పాటలో సాహిత్యపరమైన విశిష్టత ఎక్కువ. ఈ పాటని ఆడియోలోని మిగిలిన కమర్షియల్ పాటలతో పోల్చకూడదు. ఎందుకంటే ఈ పాటలోని సాహిత్యాన్ని మననుకి పట్టించుకోడానికి, అర్థం చేసుకోవడానికి, ఆస్వాదించి తృప్తి చెందడానికి మేధోమథనం విపరీతంగా జరగాలి.

అప్పుడే - ఏ పుణ్యమనుకోను ఈ చేదుజ్ఞానం, మోక్షమనుకోలేను ఈ మహాశూన్యం, అమృతపు నదిలాంటి కరుణలో ముంచి ఈత తెలియని నాతో ఆడుకున్నావా - లాంటి ప్రయోగాలతో ఆత్మానుభవం అవుతుంది. కన్ను విడిచిన దృష్టి నిన్ను ఎలా పోలుస్తుంది, గొంతు విడిచిన కేక ఎలా నిన్ను చేరుతుంది, గుండె విడిచిన శ్వాస ఎలా నిన్ను వెదుకుతుంది లాంటి వాక్యాలతో అంతర్ముఖం సాధ్యమవుతుంది. జాలితో తల నిమిరితే అణువంత ఉనికి అణిగిపోవటం లాంటి భావ ప్రకటనతో ఆత్మార్పణ అంటే ఏమిటో అవగతమవుతుంది.

సినిమాలోని సన్నివేశాలకు అనుగుణంగా రాసే గీతాలలో - ప్రతివారు తమకు తాము అన్వయించుకునే విధంగా ఇంతటి సర్వజనీనతను ఆవిష్కరించగలగటం ఏ సినీకవికైనా అరుదుగా దొరికే అదృష్టం. అది శాస్త్రి గారికి ఈ మధ్య అతి తరచుగా లభిస్తోంది. తద్వారా సినీ గీతం 'లాభిస్తోంది'. ●

# సరిగపదమని ఫలితాలు

8

## డ్రాలో గెలుపొందిన వారు

| | |
|---|---|
| ఆల్ కరెక్ట్ | : సన్నిధి రామలక్ష్మి, ఆకివీడు, ప.గో.జిల్లా. |
| ఒక తప్పుతో | : ఎ.సరోజిని దేవి, రాజమండ్రి. |
| రెండు తప్పులతో | : మన్నవ మాధవి, సత్తెనపల్లి. |
| మూడు తప్పులతో | : పి.లక్ష్మీదేవి, కర్నూలు. |

ఈ పోటీ ఫలితాలను డ్రా తీయడానికి - అడగగానే వెంటనే ఒప్పుకొని ఎంతో ఆనందంతో సహకరించిన
సంగీత దర్శకుడు శ్రీ రమణగోగుల గారికి,
విజేతలతో పాటు పజిల్ కూపన్లను పంపిన ప్రతి ఒక్కరికీ 'హాసం' కృతజ్ఞతలు.







సరిగమపదని విజేతగా నిలిచానని 'హాసం' నుంచి ఫోన్ వచ్చినపుడు ఆనందానికి అంతులేకుండా పోయింది. ఆ ఆనందంలో సరిగా మాట్లాడలేక పోయాను కూడా!

సప్త వీక్షణాలతో, కొమ్మ కొమ్మకో సన్నాయిని పలికించిన గానకోకిలల, ఆపాత(ట) మధురాలను అర్థం చేసుకుందాం - ఆస్వాదిద్దాం అంటూ అనేక శీర్షికలను హ్యామర్‌బాక్స్‌తో అందంగా అమర్చి బాపు!(బూ) ఇదిమన తెలుగు రమణీయం అంటూ హ్యామరథంలో ప్రతీ పక్షానికీ మన ఇండ్లకు వచ్చే హాసానికి శతమానం భవతి:

**- యస్. రామలక్ష్మి, ఆకివీడు, ప॥గో॥ జిల్లా.**



మీరు నిర్వహిస్తున్న 'సరిగపదమని' లో నాకు బహుమతి రావడం యిది రెండవసారి. ఇంతకుముందు గాయని ఉష గారు డ్రా తీసిన 'సరిగపదమని-4' లో బహుమతి వచ్చింది. ఈ సారి కూడా బహుమతి వచ్చినందుకు చాలా సంతోషించదగ్గ విషయమే అయినా, సంతోషించలేక పోతున్నాను. కారణం తల్లి లేని నన్ను కన్న తల్లి కన్నా ఎక్కువుగా పెంచి పెద్ద చేసి, నా కష్టసుఖాలలో తోడునీడగా వుండి, నా శరీరములో, నా మనసులో సగభాగముగా వున్న నా ఆరోప్రాణం అయిన మా పెద్దక్కయ్య చనిపోయిన దుఃఖములో మునిగివున్న నాకు యీ విషయం చిన్న ఆనందాన్ని కలగజేసి, నా బాహ్య స్మృతిని మేలుకొలిపింది. అయితే నా ఆనందాన్ని త్రికరణ శుద్ధిగా పంచుకుని ఆనందించే నా అక్కయ్య లేకపోవడం నా దురదృష్టం. డ్రా తీసిన రమణగోగుల గారికి నా కృతజ్ఞతలు. హాస్యముతో నవ్వుల పువ్వులు కురిపిస్తూ, సంగీత నాదములతో రసమయ జగత్తునోలలాడిస్తూ, మీ పత్రిక దినదినాభివృద్ధి పొందాలని కోరుకుంటున్నాను.

**- ఎ.సరోజనీ దేవి, రాజమండ్రి**



'సరిగపదమని' పజిల్ ద్వారా బహుమతి వచ్చినందుకు గోల్డు మెడల్ సాధించినంత ఆనందంగా ఉంది. మా తాతయ్య వై.రోశిరెడ్డిగారి ద్వారా 'హాసం' పత్రిక చదివే మంచి అలవాటు చేసుకున్నాను. మా ప్రాంతంలో చాలామంది ద్వారా 'హాసం' పత్రిక కొనిపిస్తూ చదివే విధంగా మా తాతయ్య కృషి చేస్తున్నారు. చాలా మంచి అభిరుచి కలిగింది. మేము అందరం 'హాసం' పత్రిక వీరాభిమానులం.

**- మన్నవ మాధవి**
**సత్తెనపల్లి.**



"హాసం" - హాస్యానికి ప్రతిరూపం
హాస పఠనం - వినోదానికి మకుటం
హాసం - విజ్ఞాన వినోదాన్ని పెంచుటేకాక ఎన్నో సీరియల్స్, స్పెషల్ ఫీచర్స్ చదువుతుంటే ఇంకా ఇంకా చదవాలనిపించే విధంగా పాఠక హృదయాలలో చిరస్మరణీయంగా నిలిచిపోతుంది ఈ 'హాసం' - హాస్య సంగీత పత్రిక. 'సరిగపదమని' పజిల్‌లో డ్రాలో నా పేరు తీసిన సంగీత దర్శకునికి మరియు బహుమతిని ప్రకటించిన 'హాసం' హాస్య సంగీత పత్రిక యాజమాన్యానికి ధన్యవాదములు.

హాసం అభిమాని
**- పి.లక్ష్మిదేవి, నర్స్, కర్నూలు**

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



**31**

ఇలపావులూరి మురళీమోహనరావు

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





**జరిగిన కథ**

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తుంది. దాన్ని చంపడానికి పెట్టిన ఎలుక మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చు పెట్టిస్తారు. ఎలుకను చంపడానికి పిల్లిని తెస్తే పిల్లికూనలు పెడుతుంది. వాటిలో ఒకటి చస్తుంది. ప్రాయశ్చిత్తం అంటూ తూతూమంత్రాలతో పురోహితుడు దోచుకుంటాడు. ఈ కష్టాలన్నిటికీ వాస్తు సరిగ్గా లేకపోవడం కారణమంటూ వాస్తుపండితులు భయపెడతారు. చుట్టపు చూపుగా వచ్చిన వక్రతుండం వీరిచే ఇల్లు అమ్మించే ప్రయత్నాలు చేస్తాడు.

(ఇక చదవండి)

ఆఫీసులో కూర్చున్నాడన్న మాటేకాని వెంకట్రావు మనసు మనసులో లేదు. కూర్చున్నా నిలుచున్నా ఫైలు తెరిచినా మరో పనిచేస్తున్నా తను కుంటి వాడైనట్లు, గుడ్డివాడైనట్లు, సుందరికి క్షయ, కుష్ఠులాంటి వ్యాధులు సోకినట్లు వరస నికృష్టపుటాలోచనలు మదిని తొలుస్తూనే ఉన్నాయి.

ఆ సమయంలోనే తన కొలీగ్సు వాసు లోపాలతో తామనుభవిస్తున్న కష్టనష్టాలు ఏకరువు పెట్టడం వాస్తు మార్పులు చేసి తామా బాధ నివారణ పొందిన వైనం, రకరకాల పత్రికలలో ఫలానా వారి వాస్తు సలహాలు పొంది తాము సాధించిన విజయాలు వివరిస్తుండటం లాంటివి వెంకట్రావు బుర్రను తినేస్తున్నాయి.

ఈశాన్యం మూలనున్న చెట్టును నరకగానే అమెరికా వెళ్ళడానికి వీసా వచ్చిందని ఒకడు, నైరుతిమూల ద్వారబంధాలు తొలగించగానే తనకు ప్రమోషన్ వచ్చిందని మరొకడు, కాంపౌండ్‌వాల్ కొంచెం ఎత్తు లేపగానే బిజినెస్ బ్రహ్మాండంగా వృద్ధి చెందినదని ఒకడు.... ఇలాంటి అనుభవాలు వెంకట్రావును తీవ్రాలోచనలో పడవేశాయి. ఇల్లు అమ్మడమా లేక వాస్తు పండితులు సూచించిన మార్పులు చెయ్యడమా తేల్చుకోలేక పోతున్నాడు.

"ఏవండోయ్... వెంకట్రావుగారూ... ఇవాళ్టి పేపర్ చూశారా?" అడిగింది భారతి.

"ఆఁ ... ఏ పేపరు చూసినా ఏమున్నది గర్వకారణం! అన్ని పేజీలు స్కాములు, స్కీములు వార్తలమయం" ముభావంగా అన్నాడు వెంకట్రావు.

పక పక నవ్వింది భారతి.

"ఏమిటి అంత మూడీగా ఉన్నారు? కవిత్వం కూడా తన్నుకొస్తున్నది. వద్దుబాబూ వద్దు. నా చెవులు శుభ్రంగా పనిచేస్తున్నాయి" అన్నది.

"అంటే....నా కవిత్వం చెవిటి వాళ్ళముందు




చెప్పమనా మీ ఉద్దేశ్యం?" నవ్వాడు వెంకట్రావు.

"వద్దులెండి. అందరూ బాగుండాలని నా ఉద్దేశ్యం. అన్నట్టు అసలు విషయం. ఈ మధ్య మీ ఇంటిని ఎవరో వాస్తు పండితులకు చూపించారు కదూ ఎవరు వాళ్ళు?"

"ఓ ! వాళ్ళా! అబ్బో...ఉద్దండ పండితులు. వాస్తు భూషణం అని! మహాజ్ఞాని. త్రికాలవేది. మనోనేత్రంతో మా ఇల్లు చూసి లోపాలు చెప్పాడు. అటువంటి వారి దర్శనం దొరకడమే గొప్ప అదృష్టం".

"అవునవును, ఇక వారి విశ్వరూప దర్శనం దొరికితే ఎంత మురిసిపోతారో మీరు?"

"దేనికైనా అదృష్టం ఉండాలి".

"ఆ అదృష్టం ఇవాళ యావద్దేశానికీ కలిగింది. మీరు కూడా చూసి తరించండి " పేపర్ ఇచ్చింది భారతి.

మొదటిపేజీలో వాస్తుభూషణం, వాస్తు విభూషణా చార్యులను సంకెళ్ళు వేసి పోలీసులు తీసుకెళ్తున్న దృశ్యం చూసి పక్కనే బాంబు పడ్డట్టు ఎగిరి పడ్డాడు వెంకట్రావు.

**వాస్తు పేరుతో ఘరానా వంచన! ఇద్దరూ మోసగాళ్ళ అరెస్ట్!!**

వాస్తునిపుణుల పేరుతో గత పది సంవత్సరాలుగా నగర ప్రజలనే కాక యావద్దేశాన్నీ వంచిస్తున్న ఇద్దరు తోడుదొంగలను నగర పోలీసులు నేడు అరెస్టుచేశారు. వాస్తు భూషణం, వాస్తు విభూషణాచార్యులు అనే పేర్లతో చలామణీ అవుతున్న ఈ ఇద్దరూ గతంలో క్రూర హంతకులు. పది సంవత్సరాల క్రితం విజయవాడలో ఒక భూస్వామి ఇంట్లో దోపిడీ చేసి అడ్డువచ్చిన ఆరుగురు కుటుంబ సభ్యులను తెగనరికి ఆచూకీ తెలియకుండా పోయిన కత్తుల శంకర్ పేరు పాఠకులకు గుర్తుండే ఉంటుంది. ఆ తరువాత కూడా పలు దోపిడీలు హత్యలు కొనసాగించిన శంకర్ రాను రాను పోలీసుల నుంచి ముప్పు అధికం కావడంతో నగరానికి వచ్చి వాస్తు నిపుణుడిగా అవతారం ఎత్తాడు. వాస్తుపట్ల ప్రజలకున్న నమ్మకాన్ని ఆసరా చేసుకుని నోటికొచ్చిన సలహాలివ్వ సాగాడు. యాదృచ్ఛికంగా ఫలించడంతో క్లయింట్ల సంఖ్య పెరగడంతో పాటు రాబడి కూడా ఇబ్బడి ముబ్బడిగా పెరిగింది.

దాంతో దోపిడీలు, హత్యలకంటే ఈ వృత్తి బాగుందని నిర్ణయించుకున్న శంకర్ వేషభాషలు పూర్తిగా మార్చి బంజారాహిల్స్‌లో అతి చవకగా రెండెకరాల భూమిని సంపాదించి ఒక ఆశ్రమాన్ని నిర్మించాడు. పెట్టుడు గడ్డాన్ని మీసాలను పెట్టుకుని ముఖాన్నెవరూ గుర్తించకుండా దట్టంగా విభూధి, గంధం పట్టించేవాడు.

తన అనుచరులలో కొందరికి శిక్షణనిచ్చి క్లయింట్ల మాదిరిగా తిప్పిస్తూ తన గురించి వారు గొప్పగా మాట్లాడేటట్లు పకడ్బందీగా ప్లాన్ చేసేవాడు. వారంతా క్యూలలో క్లయింట్ల వెనుక నిలబడి వాస్తుభూషణం మహత్యాలను చిలవలు పలవలుగా వర్ణిస్తూ క్లయింట్లకు విశ్వాసం కలిగించేవారు.

అంతటితో ఆగక సాయంత్రం వేళల్లో రోడ్డు పక్కన బండిపెట్టుకుని మిరపకాయ బజ్జీలమ్మే కొందరు యువకులను చేరదీసి తన ఆశ్రమం ఆవరణలోనే క్యాంటీన్ పెట్టించి జర్మనీకి చెందిన పెసర్దోస్ కంపెనీ వారిదని ప్రచారం చేసి ఆహారపదార్థాలను విపరీతమైన ధరలకు అమ్మించేవాడు. జర్మనీలోనే కాదు. అసలు ప్రపంచంలోనే పెసర్దోస్ అనే కంపెనీ లేదని పోలీసుల విచారణలో తేలింది.

అసలు క్లయింట్లు అయిదుగురుంటే నకిలీ క్లయింట్లు నలభైమంది ఉండేవారు. తాను చాలా బిజీగా ఉన్నట్లు నమ్మిస్తూ అర్జెంటుగా రావాలంటే అధిక మొత్తం ఫీజుగా గుంజేవాడు. క్లయింట్లలో సామాన్య ప్రజలే కాక పెద్ద పెద్ద



అధికారులు, మంత్రులు, న్యాయమూర్తులు కూడా ఉండటం విచిత్రం.

ఇదిలా ఉండగా గుంటూరు జంట హత్యల కేసులో నిందితుడైన గంటు భీముడు కూడా నాలుగు సంవత్సరాల క్రితం వాస్తు విభూషణాచార్యులుగా అవతారమెత్తి, ప్రజలను మోసం చేస్తూ వాస్తు భూషణంతో జత కలిశాడు. గత సంవత్సర కాలంగా వీరి కార్యకలాపాలపై నిఘా ఉంచిన పోలీసులు ఒక ఇరానీ హోటల్లో ఇద్దరినీ రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకున్నారు.

పోలీసులు 'మర్యాద' చేసిన తరువాత నిందితులు తమ నేరాలను అంగీకరించారు. హత్యలు,దోపిడీలలో ఉన్న రిస్కు మూలంగా ఆ వృత్తులను వదిలిపెట్టి ప్రజలలోని బలహీనతలను సొమ్ము చేసుకోవడానికే వాస్తు పండితులుగా అవతార మెత్తినట్లు విలేకరులకు తెలిపారు. నిజానికి వాస్తు విషయాల గురించి తమకేమి తెలియదని, నోటికొచ్చిన సలహాలు ఇస్తుండేవారమని, పొరబాటున అవి నిజమైతే తమ గురించి వారే ప్రచారం చేసేవారని చెప్పారు. నిందితులిద్దరినీ వచ్చేనెల ఇరవై నాల్గవ తేదీ వరకూ రిమాండ్‌లో ఉంచాలని మెజిస్ట్రేట్ ఉత్తర్వులు జారీ చేశారు".

నిర్ఘాంతపోయాడు వెంకట్రావు. మేధావులనుకునే వారు కూడా ఇలాంటి వారి వలలో చిక్కి మోసపోవడం పట్ల చింతించాడు. వారి మాటలు నమ్మి ఇల్లు కూలగొట్టనందుకు సంతోషించాడు.

వెంకట్రావులో కొత్త ఉత్సాహం వచ్చింది. పేపర్ తీసుకుని మేనేజర్ గదిలోకి దూరాడు.

"ఎంటోయ్ వెంకట్రావ్, చాలా హుషారుగా కనిపిస్తున్నావ్? ఏమంటున్నది మా అమ్మాయి? అల్లరీ ఆగం మానేసిందా? " నవ్వుతూ అడిగాడు మేనేజర్ తను వెంకట్రావుకు అంటగట్టిన పిల్లి పిల్లను తల్చుకుని.

"చేసిన అల్లరి చాలుసార్... ఇక పుట్టింటికి పంపించాలనుకుంటున్నాను" అన్నాడు వెంకట్రావ్.

"మైగాడ్..అంతపని చెయ్యకు. మా ఆవిడ చెప్పుచ్చుకు కొడుతుంది. దాన్ని వదిలించు కోవడానికి శతకష్టాలు పడ్డాను. కావాలంటే మరో రెండు ఇంక్రిమెంట్లు శాంక్షన్ చేస్తాను" దణ్ణం పెట్టాడు మేనేజర్.




"దాని పీడ ఎప్పుడో వదిలించుకున్నాను సార్. ఇపుడు మరో అతిపెద్ద పీడనుంచి బయట పడ్డాను"వాస్తు భూషణం విషయం చెప్పాడు వెంకట్రావు.

"ఈజిట్!" సంభ్రమంగా అన్నాడు మేనేజర్.

"యస్సార్.. కొంత ఖర్చయినా గుణపాఠం నేర్చుకున్నాను".

"వెరీగుడ్..వెంటనే మీ ఆవిడకు ఫోన్ చేసి ఈ విషయం చెప్పు. విషాద వార్తలు ముందు తల్లితోను,సంతోష వార్తలు ముందు భార్యతోను చెప్పాలి. వాస్తులో లోపాలున్నవో లేదో గానీ మన మనస్సుల్లో కొన్ని లోపాలున్నాయని ఈ విషయం బుజువు చేస్తున్నది".

వెంటనే సుందరికి రింగ్ చేశాడు వెంకట్రావు.

"మీరు వెంటనే ఇంటికి రండి. ఇక్కడంతా గోలగోలగా ఉన్నది"అన్నది సుందరి.

"మళ్ళీ ఏం గోల?" ఆందోళనగా అడిగాడు వెంకట్రావు.

"మనిల్లు రిజిస్టర్ చెయ్యమని దాదాపు వందమంది వచ్చి గొడవ చేస్తున్నారు. ఇల్లు అమ్ముతున్నామని చెప్పి మా బాబాయి వదిమంది దగ్గర అడ్వాన్సులు తీసుకున్నాడట" చెప్పింది సుందరి.

"రాస్కెల్....అదేమైనా వాడి తాతగాడి ఆస్తనుకున్నాడా? లేక మనిల్లు చూపించి ఎక్కడైనా పేకాడాడా? వాడి మక్కెలు విరగదంతాను. ఇపుడే వస్తున్నాను" ఫోన్ పెట్టాడు వెంకట్రావు.

"వాట్ హేపెండ్?"పైపు వెలిగించి గుప్పు గుప్పున మేఘాలను సృష్టిస్తూ అడిగాడు మేనేజర్.

జరిగింది చెప్పాడు వెంకట్రావు.

"అంతపని జరిగిందా? అయితే నువ్వు తక్షణమే వెళ్ళు. అవసరమైతే నాకు ఫోన్ చెయ్యి. యస్పైతో మాట్లాడి పంపిస్తాను" అన్నాడు మేనేజర్.

"యస్సార్" వెళ్ళబోయాడు వెంకట్రావు.

"వన్‌మినిట్ వెంకట్రావ్... పబ్లిక్ ఏరియాస్‌లో స్మోకింగ్ చెయ్యకూడదని ఈ మధ్య సుప్రీం కోర్టు రూలింగిచ్చింది. కనుక ఆఫీసులో ఎవ్వరూ సిగరెట్లు, బీడీలు, చుట్టలు తాగరాదని నోటీసు తయారు చేసి అంటించమని భారతితోచెప్పు"చెప్పాడు మేనేజర్ మరో మేఘాన్ని సృష్టించి.

"ష్యూర్ సర్... మీ అగ్గిపెట్టె లోంచి రెండు పుల్లలివ్వండి. సిగరెట్ తాగి పదినిముషాలైంది. నాలిక పీకుతున్నది" అన్నాడు వెంకట్రావు.

"రెండు పుల్లలేం ఖర్మ. కావాలంటే అగ్గిపెట్టె తీసుకో మరోటి నా దగ్గరుందిలే" అగ్గిపెట్టె ఇచ్చాడు మేనేజర్.

"థాంక్యూ సార్" అని బయటకొచ్చి సిగరెట్ పీల్చి మేఘాలను వదిలాడు వెంకట్రావు. ఎంతో రిలీఫ్‌గా ఉందిపుడు.

"భారతిగారూ...స్మోకింగ్ ఈజ్ స్ట్రిక్ట్‌లీ ప్రొహిబిటెడ్ ఇన్ ద ఆఫీస్ యాజ్ పర్ రూలింగ్ బై సుప్రీమ్ కోర్ట్ ఆఫ్ ఇండియా విత్ ఇమ్మిడియట్ ఎఫెక్ట్ అని నోటీస్ ప్రిపేర్ చేసి వెంటనే నోటీస్ బోర్డ్‌లో పెట్టమని చెప్పారు మేనేజర్‌గారు" అన్నాడు మరో దమ్ములాగి.

బయటకొచ్చి హెల్మెట్ పెట్టుకుని స్కూటర్ స్టార్ట్ చేశాడు. వాయువేగంతో వెళ్తున్నాడు. సరిగ్గా శాస్త్రిగారింట ముందుకు రాగానే జరిగిందా సంఘటన.

-(ఇంకావుంది)

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

## ఎం.చిత్తరంజన్

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

**రచన** : డా॥ఆచార్య తిరుమల
**సంగీతం** : చిత్తరంజన్ (బృందగానం)
**రాగం** : మిశ్ర రేవతి
బైరాగి బైరవ్ (హిందుస్తాని సం॥)
**తాళం** : ఆది (కర్ణాటక సం॥)
కహరువా (హిందుస్తాని సం॥)
**ఆరోహణ** : సరి మపనిస
**అవరోహణ** : సనిపమరిస
- షడ్జము, శుద్ధరిషభం, శుద్ధమధ్యమం పంచమం,కైశికనిషాదం, యీరాగంలోని స్వరాలు అన్యస్వరాలైన అంతరగాంధారం పల్లవిలోను శుద్ధదైవతం చరణాలలోను ఉపయోగించబడినవి.

### దేశము మీరైై తేజము మీరైై

ప॥ దేశము మీరైై తేజము మీరైై
ఒకటి వుంటే చాలదా
ప్రగతిని కోరే భారతమంతా
వెన్నెల పుంతగా మారదా ॥దేశము॥

చ॥ అందరూ తమతమ బాధ్యతనెరిగి
సంఘోన్నతికై మెలగిన
సక్రమలక్ష్యం సాధించుటకై
సమతావేశం కలిగిన
ప్రపంచ చరితమె పునీతమయ్యే
స్వర్ణయుగమ్మే వెలయదా ॥ప్రగతిని కోరే॥

చ॥ ఎక్కువ తక్కువ తేడాలేక
స్వేచ్ఛగ అడుగులు వేసిన
శోధించిన జ్ఞానం విశ్వశాంతికై
సద్వినియోగం చేసిన
తరతరాలు కదలని పునాదిగా
ప్రజాస్వామ్యమే నిలువదా ॥ప్రగతినికోరే॥

ప॥ సాసస | సరిసని | సాసస | సరిసని | నిరిసని | పాపమ | పానీ |
దేశము | మీ.రై. | తేజము | మీ.రై. | ఒకటిగ | ఉంటే. | చా.ల |
సా; | నినిసప | రిరిస | నిరిసని | పాపమ | పానిని | సాసని |
దా. | ప్రగతిని | కోరే. | భా.రత | మంతా | వెన్నెల | పుంతగ |
సరిమగే | సారిస ని |
మా..ర | దా... ॥దేశము॥

1.చ॥ పాపప | పదపమ | పాపప | పమసా | పాపా | పదప్పమ | పదసప | ;; |
అందరు | తమతమ | బాధ్యత | నెరిగి | సంఘో | న్నతికై. | మెలగిన | .. |
పానిని | సాసరి | నిరిసని | పపప్పమ | పపని | సాసని | సరిమస | ;; |
సక్రమ | లక్ష్యం. | సా.ధిం. | చుటకై. | సమతా | వే.శం. | కలిగిన | .. |
ససాస. | సరిసని | ససాస | సరిసని | నిరిసని | పాపమ | పపనిస | ;; |
ప్రపంచ | చరితమె | పునీత | మ.య్యే. | స్వ.ర్ణయు | గమ్మే. | వెలయదా. . |

ఆ తరువాత పల్లవిలోని "ప్రగతిని కోరే భారతమంతా వెన్నెల పుంతగ మారదా" అన్న పంక్తి పాడి ఆ తరువాత "దేశము మీరైై...." అన్న మొదటి పంక్తి పాడాలి.

2వ చరణం కూడా యి దేవిధంగా వుంటుంది.

గే = అంతర గాంధారం
ద = శుద్ధ దైవతం



కర్ణాటక సంగీతంలో రేవతి బాగా ప్రాచుర్యాన్ని పొందిన రాగమే అయినా దీనిని ఎక్కువగా లలిత శాస్త్రీయ, లలిత సంగీతాలవరకే ఉపయోగించడం జరుగుతున్నది. ఈ రాగాన్ని హిందుస్తాని సంగీతంలో బైరాగిభైరవ్ అని, బైరాగి అని పిలుస్తారు. ఈ రాగంలోని స్వరాలు వేద పఠనంలో మనకు వినబడే ఉదాత్త, అనుదాత్త, స్వరితాలు. తద్వారా వేదపఠనం లో పవిత్రత మనకు గోచరమవుతుంది. ఆవిధంగా వైరాగ్య, భక్తి తత్వాలకే గాక విరహ, విషాదాలకు కూడా అనువుగా వుంటుందీ రాగం. సుప్రసిద్ధ కర్ణాటక సంగీత విద్వాంసులు శ్రీ నేదునూరి కృష్ణమూర్తి గారు "నానాటి బ్రతుకు నాటకము, కానకకన్నది కైవల్యము" అనే అన్నమాచార్యుల వారి వైరాగ్య పూరితమైన కీర్తనకు రేవతి రాగంలో బాణీని కూర్చగా చాలామంది స్వరకర్తలు వినియోగించి సుమధురమైన బాణీలు కూర్చినవి మనం తరచుగా వింటున్నవే. అయితే యీ రాగాన్ని "దేశము మీరైై తేజము మీరైై" అనే ప్రబోధ గీతానికి ఉపయోగించడం కొత్త ప్రయోగంగా భావించవచ్చు. సాధారణంగా యిటువంటి యితివృత్తానికి రేవతి వంటి రాగాన్ని స్వరకర్తలు ఉపయోగించడం జరగదు. ఉత్తేజాన్ని కలిగించే హంసధ్వని వంటి రాగాలనే ఎక్కువగా ఎన్నుకుంటారు. అయితే నేను రేవతి రాగ స్వరాలను జనాన్ని చైతన్యపరిచేవిధంగా

వినియోగించి యువతీయువకుల ఉత్తేజితులై పాడే రీతిలో రూపొందించడం జరిగింది. 1972లో ఆకాశవాణి లో 'యువవాణి' కార్యక్రమాల వార్షికోత్సవానికై ఆ గీతాన్ని నేను యువగాయనీ గాయక బృందం చేత పాడించగా ఆ పాట పలువురి ప్రశంసలనందుకున్నది. మనదేశంలో వివిధప్రాతాలలో వివిధ భాషలు మాట్లాడే వారున్నారు. హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు, జైను బౌద్ధమతస్థులు, జొరాష్ట్రియన్లు మొదలగు ఎన్నోమతాలకు చెందినవారున్నారు. 'భిన్నత్వంలో ఏకత్వం' (Unity in Diversity) అనే నినాదం ఆధారంగా మనమంతా ఒకటే అని, అందరమూ భారతీయులము అనే భావనతో భిన్నప్రాంతాలవారు,భిన్నభాషలు మాట్లాడేవారు, వివిధమతాలవారు అందరూ చేయి చేయికలిపి ఐక్యంగా దేశ ప్రగతికై పాటు పడాలని ప్రబోధిస్తున్నది యీ సమైక్యతా గీతం. ఆచార్య తిరుమలగారు రచించిన యీ గీతాన్ని పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్న "లలిత సంగీతం డిప్లొమాకోర్సు" పాఠ్యప్రణాళికలో జాతిసమైక్యతా గీతాల అంశంలో చేర్చబడింది కూడా. ●

**(రేవతి/బైరాగి రాగాల ఆధారంగా కొన్ని చిత్రగీతాలను 'హాసం' 16-31,2003 సంచికలో పేర్కొనడం జరిగింది.)**

# కొన్ని సంగీత కథలు...

**- దేవరకొండ శేషగిరిరావు**



**తం**జావూర్ ఆస్థాన గాయకుడు తోడి సీతారామయ్య తోడి రాగం పాడటంలో అద్వితీయుడు. ఇతడు డబ్బంతా నీళ్లలా ఖర్చుపెడుతూ ఉండేవాడు. ఉన్న డబ్బు అవగొట్టుకుని అప్పుకై బయల్దేరాడు. ఒక వడ్డీ వ్యాపారి వద్దకు వెళ్లాడు. అతడు పరమలోభి. ఏదైనా తాకట్టు పెడితేనే డబ్బు ఇస్తానన్నాడు. 'నీ దగ్గర ఆస్తి వుంటే నీ వద్దకు ఎందుకు వస్తాను? నాకున్న ఆస్తి నా సంగీతమే!' అన్నాడు సీతారామయ్య.

"తోడి రాగం పాడడం వల్లనే కదా నీకిన్ని పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. అదే నీ ఆస్తి. దానినే కుదువబెట్టు. డబ్బు తిరిగి ఇచ్చేవరకు ఈ రాగాన్ని ఆలపించకూడదు సుమా" అన్నాడు వ్యాపారి.

డబ్బు అవసరం కొద్దీ సరేనన్నాడు సీతారామయ్య. అప్పటి నుండి రాజాస్థానంలో తోడి రాగం పాడడం మానేశాడు. కొన్నాళ్లు చూసి రాజుగారు 'తోడి పాడటం లేదేం, సంగతేమిటి?' అని అడిగారు. సిగ్గుపడుతూనే విషయం చెప్పాడు సీతారామయ్య. వెంటనే కోశాగారం నుండి డబ్బు పంపి అప్పు తీర్చేశాడు సహృదయుడైన మహారాజు.

"ఇక నీవు ఋణవిముక్తుడవు. హాయిగా 'తోడి' పాడి అందరినీ సంతోషపెట్టు" అని ఆనతిచ్చాడు.





# అమిత ఆదరణ పొందిన టాటాయంగ్

కేవలం పద్నాలుగు సంవత్సరాల వయసులోనే తన గాత్రంతో థాయ్ ప్రజల అభిమానాన్ని చూరగొంది టాటాయంగ్. 9 వ దశకం మధ్యలో థాయ్‌లాండ్‌లో టాటాయంగ్ యువతపై చూపిన ప్రభావం ఇంతా అంతా కాదు. అమెరికన్ తండ్రి - థాయ్ తల్లి కలిగిన టాటాయంగ్ పేరులోని 'టాటా' వెనుక ఓ చిన్న ఆసక్తికర విషయం దాగి వుంది.

టాటాయంగ్ తల్లితండ్రులు ఓ సారి భారత్ వచ్చిన సందర్భంలో 'టాటా' అనే పదం వారినెంతో ఇన్‌స్పయిర్‌కి గురి చేసింది. దాంతో తమ కుమార్తెకి 'టాటా' అమిత మారీ యంగ్ అనే పేరు పెట్టారు. తన పేరులో భారతీయ ముద్రను కలిగిన టాటా యంగ్ - సరిగ్గా టాటా సంస్థల వ్యవస్థాపకుడు జెమ్‌షడ్ జీ నసెర్ వాన్ జీ టాటా 100 వ వర్ధంతి సంవత్సరంలోనే భారత్ పర్యటనకు రావడం ఓ విశేషంగా చెప్పుకోవాలి.



23 సంవత్సరాల టాటాయంగ్ థాయ్‌లాండ్‌లో ఓ సెన్సేషనల్ సింగర్. ఇంతవరకూ తొమ్మిదేళ్లుగా సంగీత ప్రపంచంలో ఉండి ఏడు ఆల్బమ్స్‌ను విడుదల చేసింది. ఆమె రూపొందించిన ఆల్బమ్స్ ఇవాళ ప్రపంచవ్యాప్తంగా 12 మిలియన్స్ అమ్ముడు పోయాయి. తన దేశ సరిహద్దుల్ని దాటుతూ - విదేశాలకీ విస్తరించాలని భావించిన టాటాయంగ్ తొలి ఇంగ్లీష్ ఆల్బమ్ 'ఐ బిలీవ్' ను సోనీ మ్యూజిక్ ద్వారా విడుదల చేసింది. పాటలకే పరిమితమవటం ఇష్టం లేని టాటాయంగ్ కొన్ని థాయ్ చిత్రాలలో నటించింది కూడా. మే నెల 16 వ తేదీ భారత్‌కి వచ్చిన టాటా యంగ్ ముంబాయిలోని ప్లానెట్ ఎం లో జరిగిన కార్యక్రమంలో పాల్గొంది. తన కొత్త ఆల్బమ్ 'ఐ బిలీవ్' లోని పాటల్ని పాడి నర్తించింది కూడా.

భారత పర్యటన గురించి ఆమె మాట్లాడుతూ "భారతదేశం గురించి నేను చిన్నతనం నుండీ వింటూనే ఉన్నాను. నా పేరులోని 'టాటా' అనే పదం కూడా ఈ దేశానికి చెందిందే. మా అమ్మ నాన్న కొద్దికాలం భారత్‌లో ఉన్నారు. వాళ్లకీ పేరెంతో నచ్చింది. అందుకే నాకు పెట్టారు. నాకు పేరుని ప్రసాదించిన ఈ దేశానికి ఎప్పుడెప్పుడు వస్తానా అని కొద్దికాలంగా ఎదురు చూస్తున్నాను. ఆ రోజు వచ్చేసింది" అని చెప్పింది. బాలీవుడ్ గురించి థాయ్‌లాండ్‌లో వుండగా తానెంతో విన్నానని చెబుతూ " మంచి అవకాశం ఏదైనా వస్తే - తప్పకుండా నేను అంది పుచ్చుకుంటాను. హిందీ చిత్రాలు చూడటం నాకు అలవాటే. 'దేవదాస్' చిత్రం ఐశ్వర్యారాయ్ నటన నాకెంతో నచ్చింది. అలానే షారూఖ్ ఖాన్‌ని నేను అభిమానిస్తాను" అని చెప్పింది.

1980 డిసెంబర్ 14 న థాయ్‌లాండ్‌లో జన్మించిన టాటా అమిత మారీయంగ్ ఆమె తల్లితండ్రులకి ఒక్కతే సంతానం. చిన్నతనం నుండే ఆమెకి పాటలు పాడటం, డాన్స్ చేయటం అలవాటయింది. కొత్త ఇంగ్లీష్ ఆల్బమ్ ' ఐ బిలీవ్' గురించి చెబుతూ 'ఈ ఆల్బమ్ కి ఈ పేరు పెట్టడానికి ఓ కారణం ఉంది. నేనెంతో శ్రమపడి ఈ ఆల్బమ్‌ను రూపొందించాను. ఎవరికైనా వాళ్లమీద వాళ్లకి నమ్మకం ఉండటం ప్రధానం. బయటి వ్యక్తులు మన మీద విశ్వాసంతో ఉన్నా - మన మీద మనకి ఆ విశ్వాసం లేకపోతే ఏమీ చేయలేం' అని చెప్పింది.

అంతర్జాతీయ ఖ్యాతి గడించిన రచయితలతో టాటాయంగ్ 'ఐ బిలీవ్' కోసం 12

పాటల్ని రాయించింది. కవ్వించేవి, నవ్వించేవి, కన్నీళ్లు పెట్టించేవి.... ఇలా రకరకాల ఎమోషన్స్ కి గురిచేసే పాటల కదంబం ఈ ఆల్బమ్ అని టాటాయంగ్ చెబుతుంది. ఈ ఆల్బమ్‌లోని సెంటిమెంటిల్, రొమాంటిక్ సాంగ్స్ తన వ్యక్తిత్వాన్ని ప్రతిఫలిస్తాయని ఆమె అంటోంది. తన పాత ఆల్బమ్స్‌కి భిన్నంగానూ, కొత్తగాను ఈ ఆల్బమ్ వుండేలా కృషి చేశానని టాటాయంగ్ చెప్పింది.



పాటలు పాడటంతో పాటుగా టాటాయంగ్ మోడలింగ్ రంగంలోనూ రాణించింది. అంతర్జాతీయ సంస్థలు రూపొందించిన ఫ్యూజీ ఫిల్మ్, యమహా మోటర్‌సైకిల్ వాణిజ్య ప్రకటనల్లో ఆమె నటించింది. 1997లో ఎల్లే పత్రిక థాయ్ ప్రజను ప్రభావితం చేసే పదిమంది ప్రముఖుల పట్టికలో టాటా యంగ్‌ను చేర్చింది. 1998లో ఏషియా వీక్ పత్రిక ఆసియాలోని 25 మంది ప్రతిభావంతుల పట్టికలో టాటాయంగ్‌కి చోటిచ్చింది. అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన టైమ్ పత్రిక 2001 లో టాటాయంగ్ చిత్రాన్ని ముఖచిత్రంగా ప్రచురించింది. "టైమ్ పత్రికలో ముఖచిత్రం ప్రచురితం కావటం తనకు లభించిన గొప్పగౌరవంగా భావిస్తాను. అలానే ఏషియన్ గేమ్స్‌లో రాయల్ ఫ్యామిలీ సమక్షంలో కోట్లాదిమంది వీక్షకులు టీవీల్లో చూస్తుండగా నేను ప్రదర్శనను ఇచ్చిన సంఘటనా జీవితంలో మర్చిపోలేను" అంది టాటాయంగ్.

1997లో యూత్‌డ్రామా 'ద రెడ్ బైక్ స్టోరీ' అనే చిత్రంలో టాటాయంగ్ నటించింది. థాయ్‌లాండ్‌లో ఆ సినిమా గత చిత్రాల రికార్డుల్ని బద్దలుకొట్టింది. ఆ చిత్రంలో టాటాయంగ్ ప్రదర్శించిన ఉత్తమ నటనకుగానూ - 4వ వార్షిక బ్లాక్‌బస్టర్ ఎంటర్‌టైన్‌మెంట్ అవార్డుని ఆమె కైవసం చేసుకుంది. ఆ తర్వాత 'ఓ - పాజిటివ్', 'స్లై టీన్' చిత్రాలలోనూ టాటాయంగ్ నటించింది.

ఖాళీ సమయాల్లో కంప్యూటర్‌గేమ్స్‌ను ఆడతానని, అలానే స్నేహితులతో, పెంపుడు కుక్కలతో గడపడం తనకిష్టమని ఆమె చెప్పింది. ప్రయోగాలు చేయటం - చక్కటి సంగీతం వినడానికే తానెంతో సమయం కేటాయిస్తానని అన్నది. మడోన్నా,బర్డ్ థాంగ్‌చాయ్, మెక్ ఇన్‌టైర్ తన అభిమాన గాయనీ గాయకులని టాటా యంగ్ తెలిపింది. ఈ సుమధుర గాయని, అందాలనటి భారతీయ సినిమా తెరపై త్వరలోనే ప్రత్యక్షమవుతుందేమో వేచి చూద్దాం.

**- వి.అరుణ సత్యవతి**

# బాణీ ముత్యాలు

**సేకరణ : పి.గిరి, హైదరాబాద్.**



ఆరుద్ర

ఆడజన్మకు కంటినిండ నిదుర
రెండుసార్లేనమ్మా రెండేసార్లు
అన్నెమెరుగని బాలప్రాయమున తొలిసారి
అన్నీ ముగిసిన అవసానకాలాన కడసారి

**చిత్రం : పెన్ని**
**పాట పల్లవి : బంగారు ప్రాయమిది పవళించవె తల్లీ**



సినారె

జీవితమే ఒక వైకుంఠపాళి నిజం తెలుసుకోభాయీ
ఎగరేసే నిచ్చెనలేకాదు పడదోసే పాములుంటాయి
చిరునవ్వులతో విషవలయాలను
ఛేదించి ముందుకు పదవోయి

**చిత్రం : నిండుసంసారం**
**పాట పల్లవి : ఎవరికీ తలవంచకు**



ఆత్రేయ

మంచివాడికి చెడ్డవాడికీ
తేడా ఒకటే బాబూ!
మంచివాడు మనసున అనుకుంటాడు
చెడ్డవాడు చేసే చూస్తాడు

**చిత్రం : పాపకోసం**
**పాట పల్లవి : మనిషి మనిషికీ తేడా ఉంది**



సుద్దాల అశోక్‌తేజ

ఒకటే జననం - ఒకటే మరణం
ఒకటే గమనం -ఒకటే గమ్యం
గెలుపు పొందే వరకు - అలుపులేదు మనకు
బ్రతుకు అంటే గెలుపు -గెలుపు కొరకే బ్రతుకు

**చిత్రం : భద్రాచలం**
**పాట పల్లవి : ఒకటే జననం - ఒకటే మరణం**



సిరివెన్నెల

ఆదికవిగా నిలిచిన
ఆ బోయ వాడిని మలచిన
విద్యాలయం ఓ కారడవే కాదా
సేతువును నిర్మించిన
ఆ కోతి జాతికి తెలిసిన
విజ్ఞానమంతా నగరం నేర్పిందా

**చిత్రం : అడవి రాముడు (ప్రభాస్ హీరో)**
**పాట పల్లవి : నగరంలో ఈ పూట వినిపించే నా పాట**

# తాతా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 14

| పాత్రలు | నటీనటుల సజేషన్ |
| --- | --- |
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్వని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

- జీడిగుంట రామచంద్రమూర్తి

## జరిగిన కథ

రాజుపాలెం గ్రామంలోని రావుబహద్దర్ వీరభద్రం అంటే ఇంట్లోవాళ్లకు, బయటవాళ్లకు అందరికీ హడల్. పట్నంలో చదువుతున్న అతని కొడుకు శ్రీరామ్‌కి కూడా. అందుకే అశ్విని అనే డబ్బున్న అందమైన అమ్మాయి తనను ప్రేమిస్తున్నా ముందువెనకలాడుతూంటాడు. శ్రీరామ్ అంటే అభిమానం పెంచుకున్న అశ్విని తండ్రి విష్ణుమూర్తి వీరభద్రం ఇంటికి వచ్చి పెళ్లి ప్రతిపాదన తెస్తాడు. మేనకోడల్ని కోడలిగా చేసుకుందామనుకుంటున్న వీరభద్రం అతన్ని అవమానించి పంపడంతో విష్ణుమూర్తి కోపగించుకుంటాడు. శ్రీరామ్ రాజుపాలెం వచ్చి తండ్రితో ధైర్యంగా పెళ్లి ప్రస్తావన చేస్తాడు. తల్లి అతనికి వత్తాసు పలుకుతుంది.

- ఇక చదవండి



"సరేలెండి! కట్న కానుకలు వదిలేద్దాం!... కనీసం పెళ్ళయ్యాకైనా ఓ అచ్చటా ముచ్చటా తీర్చగలడా మీ బావమరిది? .. ఎంత సేపూ నాటకాల ధ్యాసే తప్ప ఇంటిగురించీ, పెళ్లికెదిగిన కూతురు గురించీ, అతనికి ఆలోచన కొంచమైనా వుందంటారా?...హు! ఆ నాటకాల పిచ్చిలో పడి వ్యసనాలకు్కూడా బానిసయ్యాడు. ఆనాడు, రోగమొచ్చి మంచాన పడ్డ మా చెల్లెలికి మందూ, మాకూ ఇప్పించకపోగా, కనీసం తిండీ తిప్పలూ కూడా సరిగ్గా చూడలేక పోయాడు.... ఆమె చావుకు తనే కారణమయ్యాడు!".

భార్య వైపు చూస్తూనే, ఆమె మాటలు వింటూనే ఆలోచిస్తున్నాడు వీరభద్రం.

"ఎందుకిలా జరుగుతోందీ?" తనలో తనే ప్రశ్నించుకున్నాడు.

తన ముఖంలోకి కన్నెత్తి కూడా చూడలేని కన్న కొడుకు - మూడురోజుల క్రితం తన కళ్ళముందే తాచుపాములా బుసలు కొట్టేడు. తన ప్రశ్నలకు 'టూకీ' గా సమాధానాలు చెప్పి తప్పుకునే ఇల్లాలు. ఇప్పుడు తననే నిలదీసి ప్రశ్నిస్తోంది. అంటే. తనలో పవరు తగ్గిపోయిందా..?..లేక చిదంబరం చెప్పినట్టు- నిజంగానే కాలం మారి పోయిందా?..

తన భర్త మౌనాన్ని అలుసుగా తీసుకున్న పార్వతమ్మ మళ్లీ అంది "తోడ బుట్టిన ఆడపిల్ల కదా అనే ఆదరణతో మానవత్వం వున్న మనిషిగా ఆవిడగారి ఆఖరినిమిషంలో మీరు వెళ్ళి 'ఆ మాట' కాస్తా ఇచ్చి వచ్చారు! కానీ, కన్నకొడుకు ముద్దూ ముచ్చట తీర్చవలసిన బాధ్యత కూడా మీకు వుంటుందిగా? చదువూ, సంధ్యా నేర్చుకుని, మీ అంతటివాడైన మీ పెద్ద కొడుకు మాటను గౌరవించవలసిన అవసరం మీకుండదా? పీటల మీది పెళ్ళిళ్లే ఆగిపోతున్న ఈ రోజుల్లో ఎప్పుడో ఇరవై ఏళ్ళ క్రితం ఇచ్చిన మాటకు కట్టుబడి, వాడిచేత ఇష్టంలేని పిల్ల మెడలో వాడిచేత బలవంతంగా తాళికట్టించడం అవసరమా?".



"అయినా నీకో నంగతి చెప్పాల్రా భద్రుడూ!"అంతలో చిదంబరం కల్పించు కుంటూ అన్నాడు.

"లాయర్గా నేను ఎన్నో కేసులు చూశాను. ఇష్టంలేని వాళ్ళతో, పెద్దవాళ్లు, బలవంతంగా జరిపించే పెళ్ళిళ్ళు అనేకం విఫలమవుతున్నాయి. కొన్ని సందర్భాల్లో అయితే, ఆత్మహత్యలకూ, హత్యలకూ కూడా కారణమవుతున్నాయి. మరికొన్ని సందర్భాల్లో, పసుపూ పారాణి ఆరకుండానే విడాకులకు దారి తీస్తున్నాయి.... అంచేత, నా మాట విను!..నీ మనసుకి నచ్చచెప్పుకుని, మీ వాడి మనసుకు నచ్చిన ఆ పిల్లతో లక్షణంగా పెళ్ళిచేసి, అక్షింతలు జల్లి ఆశీర్వదించు! నీ పెద్దరికాన్ని నిలబెట్టుకో!" చెప్పాడు చిదంబరం.

వీరభద్రం ఇంకా అలాగే ఆలోచిస్తూ మౌనంగా వుండి పోయాడు... అదే అదనుకున్న పార్వతమ్మ భర్తకు బత్తాయి రసం అందిస్తూ చెప్పింది మళ్ళీ "అయినా మనవాడు ఏ కులం తక్కువ పిల్లనో, గుణం లేని పిల్లనో మను వాడతానని మంకు పట్టు పట్టటం లేదుగా? .. సంతోషించండి! అయినింటి పిల్ల... ఆస్తీ అయిశ్వర్యం వున్నపిల్ల ..! పైగా, మర్యాదగా తమ పెళ్ళిచెయ్యకపోతే రిజిస్ట్రారాఫీసుకి వెళ్ళి చేసుకుంటానంటూ, మీకెదురుగ నిలిచి మరీ చెప్పేటంత ధైర్యం వాడిలో కలిగిందంటే - వాడు ఆ పిల్లని ఎంత గాఢంగా ప్రేమించాడో, అర్థం చేసుకోండి!. అంచేత మీ పంతాలూ, పట్టింపులూ పక్కన పెట్టి పంతులుగార్ని పిలిచి ముహూర్తం పెట్టించండి!"

ఆ మాటలు వింటూనే, ఆమె అందించిన బత్తాయిరసం తాగేసరికి - వీరభద్రంలో అంతవరకూ పెల్లుబకిన ఆవేశం చల్లబడింది.. కావాల్సిన మిత్రుడూ, కట్టుకున్న ఇల్లాలు, అలా ఎడాపెడా కూర్చుని బుర్రలోకి ఎక్కించేసరికి తలవంచక తప్పలేదు.

"సరే!..అట్లే కానిద్దాం!" అన్నాడు తేలిగ్గా నిట్టూర్చి.

"ఇప్పుడు నువ్వు నాకు నచ్చావురా భద్రుడా!" అతని భుజం తట్టి మరీ మెచ్చుకున్నాడు చిదంబరం.

* * *

పోర్టికోలో కారాగిన చప్పుడు విని.. పేపరు చదువుతున్న విష్ణుమూర్తి, వీధి గుమ్మం వైపు చూశాడు.

టాక్సీలోంచి అప్పటికే ఇద్దరు వ్యక్తులు కిందకు దిగి లోపలకు రావటం కనిపించిందతనికి. ఒకరు లావుగా పొట్టిగా, కాస్త వయసు పైబడిన వాడిలా కనిపిస్తే రెండవ వ్యక్తి ఆధునిక దుస్తుల్లో అందమైన యువకుడిలాగే వున్నాడు.

ఆ ఇద్దరూ లోపలకు వచ్చారు.

వాళ్లెవరో వెంటనే పోల్చుకోలేక వింతగా చూస్తూండిపోయాడు విష్ణుమూర్తి. అప్రయత్నంగానే అతనితో చేతులు కలుపుతూ ప్రశ్నార్థకంగా చూశాడు విష్ణుమూర్తి.

"గుర్తు పట్టలేదా బావా? నేను హనుమంతుని"! సోఫాలో కూలబడుతూ, తనను తాను పరిచయం చేసుకున్నాడతను.

విష్ణుమూర్తి కళ్ళు అప్పుడు ఆనందంతో మెరిశాయి.

"ఓర్నీ! నువ్వటోయ్ బావమర్దీ...అసలు పోల్చుకోలేనంతగా మారిపోయావ్ సుమా!" హుషారుగా లేచి వచ్చి పక్కనే కూర్చుని అతని భుజం మీద చరిచాడు.



"అవున్లే ..ఎలా పోల్చుకుంటావ్? మీపెళ్ళయిన ఆర్నెల్లకే నేను అమెరికా వెళ్ళిపోయానుగా!"

"అదినరే ..ఇంతకీ ఇండియా ఎప్పుడొచ్చావు?' అడిగేడు విష్ణుమూర్తి అతృతగా.

"ఇప్పుడే ! ఎయిర్ పోర్టులో 'చెకౌట్' కాగానే - స్ట్రెయిటవే టాక్సీలో ఇక్కడి కొచ్చేశా!.. బైదిబై నీ జేబులో ఓ వెయ్యిరూపాయిలుంటే టాక్సీ డ్రైవర్ కిచ్చి పంపు !...నాదగ్గరన్నీ డాలర్సున్నాయి!"

పర్సులోంచి వందనోటు తీసి నౌకరుకి అందించాడు విష్ణుమూర్తి ..వాటిని టాక్సీ డ్రైవర్ చేతిలో పెట్టి డిక్కీలో వున్న సామాన్లు లోపలకు తెచ్చాడు నౌకరు.

"వీడు మా సుపుత్రుడు !.. మీ పెళ్లికి వీడు నెలల పిల్లాడు !" పక్కనే గోళ్ళు కొరుక్కుంటూ నిలబడివున్న కొడుకుని పరిచయం చేనన్తా చెప్పాడు హనుమంతుడు...

"నీ పేరేమిటోయ్?" పరిశీలనగా అతన్ని చూస్తూ అడిగేడు విష్ణుమూర్తి.

"పాల్ !...జీపాల్!"

"అదేమిటోయ్ పేరు బలే విచిత్రంగా వుందే టినోపాల్ లాగా !"

"అబ్బే అదేంకాదు బావా! వీడిపేరు గోపాలం!. అమెరికాలో అందరూ వీణ్ణి 'పాల్' అని పిలుస్తారు' విడమరిచి చెప్పాడు హనుమంతుడు.

ఆ పూట భోజనాలయ్యాక వాళ్లు, మళ్లీ కబుర్లలో పడ్డారు "నీకు తెలుసుగా బావా! నేను ఫ్యామ్లీతో అమెరికావెళ్లిన మూడేళ్ళ వ్యవధిలోనే అమ్మా నాన్న నా గురించి బెంగ పెట్టుకుని కన్ను మూశారు. నా దురదృష్టం కొద్దీ వాళ్ళకు తలకొరివి కూడా పెట్టలేకపోయాను. అయినా సరే, ఇండియా వచ్చి నాకంటూ మిగిలిన చెల్లెమ్మని ఒక్కసారి చూడాలని ఎన్నో సార్లు అనుకునేవాణ్ణి ! కానీ బిజినెస్ వ్యవహారాల్లో పడి బిజీ అయిపోయాను..తీరా వీలుచూసుకునే వద్దామనుకునే సరికి చెల్లాయి బేబిని ప్రసవించి చనిపోయిందన్న వార్త తెలిసింది! అంతే ! ఇంక ఇండియా అంటేనే విరక్తి భావం ఏర్పడి పోయింది."

దిగులు నిండిన స్వరంతో చెప్పాడు హనుమంతుడు.

"పోన్లే ఇప్పటికైనా మాతృభూమి మీద కాలుపెట్టావ్. సంతోషం.. అవునూ? నీ భార్యను కూడా తీసుకురాలేకపోయావా..ఆమె పేరు.. సుభద్ర కదూ?" గుర్తుచేసుకుంటూ అడిగేడు విష్ణుమూర్తి.

హనుమంతు వదనంలో విషాదం నిండి పోయింది ఆ క్షణాన "అవును బావా!..సుభద్రే ! కానీ.ఇక్కడకు రాలేనంత దూరం వెళ్ళిపోయింది.." బరువుగా చెప్పాడు.

దిగ్భ్రాంతిగా చూసేడు విష్ణుమూర్తి.




ఇంతలో హనుమంతుడు చెప్పేడు.

"అప్పట్లో న్యూయార్క్‌లోని 'వరల్డ్ ట్రేడ్ సెంటర్' మీద తీవ్రవాదుల దాడి జరిగింది ...గుర్తుందా?"

"అవును !..విమానం 'ట్రేడ్ సెంటర్' లోకి దూసుకుపోయి పేలిపోవటం, ఆ భవనం నేల కూలటం అదంతా టీవిలో చూపించారు.."

"అందులోనే ..ఆ భవనంలోనే సుభద్ర 'జాబ్' చేసేది ఎప్పటిలా ఆ రోజు పొద్దున్నే, కంపెనీకి వెళ్ళింది. తను వెళ్ళిన పావుగంటలోనే - ఆ ఘోరం జరిగింది. తను పనిచేసే అంతస్తు మొత్తం కుప్పకూలిపోయింది. ఆ శిథిలాల్లోంచి సుభద్ర మృతదేహాన్ని వెలికి తీయటానికే వారం రోజులు పట్టింది." హనుమంతు కళ్ళల్లో కన్నీళ్ళు.

"అయ్యో ! అయామ్ సారీ.... ఈ విషయం నాకు తెలియలేదు!"

"అవును బావా! నేనే చెప్పలేక పోయాను. చెప్పి మాత్రం ప్రయోజనం ఏముంటుందిలే అనుకున్నాను. ఆ నమయంలో, అయినవాళ్లు ఎవరు ఓదార్చినా మనసు మరింత బాధపడు తుందిగా.. ! అయినా మా ఇంటి అల్లుడిగా నీకు తెలియపరచాలన్న బాధ్యత గుర్తు వచ్చి ఫోన్ చేశాను. కానీ, ఎన్నిసార్లు ప్రయత్నించినా నీ నంబరు రాలేదు.."

"రాలేదా..ఆఁ ! అవును..అప్పట్లో ఇక్కడి టెలిఫోన్ నెంబర్లన్నీ మారిపోయాయి!" గుర్తుచేసుకుంటూ చెప్పేడు విష్ణుమూర్తి .

"ఇట్సాల్ రైట్ ! పోయిన వాళ్ళ గురించి బాధపడుతూ ఎన్నాళ్ళు కూర్చోగలం?..."

"కానీ... సుభద్రకి మనదేశం వచ్చి సెటిలవ్వాలనీ మా గోపాలానికి ఇక్కడి పిల్లనే ఇచ్చి పెళ్ళి చేయాలనీ మహాకోరిగ్గా వుండేది బావా! బ్రతికుండగా దాని ఆత్మ శాంతిస్తుందన్న ఆలోచనతో వచ్చాను. దానికి తోడు ఈ మధ్య పదే పదే చెల్లాయి కూడా నా కలలో కనిపించి కన్నీళ్ళు పెట్టుకుంది" చెప్పటం ఆపి అతని వైపు చూశాడు.

విష్ణుమూర్తి శ్రద్ధగానే వింటున్నాడని గ్రహించి మళ్ళీ చెప్పసాగేడు.

"మీ బావగారు పెద్దవారై పోయారూ ఆయనకి తోడుగా నువ్వుండ కూడదా అన్నయ్యా అంటూ నావైపు చెల్లాయి దీనంగా చూసింది. 'ఎంతసేపూ డాలర్లూ, డాబులూ తప్ప ఆప్యాయతలూ, అంతః కరుణలూ అక్కర్లేదా?' అంటూ నా ముఖం వాచేలా చివాట్లు కూడా పెట్టింది!"

"పోన్లే..మీ చెల్లాయి కలలో కనిపించిందన్న వంకతోనైనా నన్ను చూసేందు కొచ్చావ్ ..సంతోషం!" చిరునవ్వుతో అన్నాడు విష్ణుమూర్తి.

**(ఇంకావుంది)**



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తమిళం | తెలుగు |
|---|---|---|
| చిత్రం | మిస్సియమ్మ | మిస్సమ్మ |
| రచన | తంజై రామయ్యాదాస్ | పింగళి నాగేంద్రరావు |
| సంగీతం | యస్.రాజేశ్వరరావు | యస్.రాజేశ్వరరావు |
| గానం | ఎ.ఎం.రాజా | ఎ.ఎం.రాజా |
| అభినయం | జెమిని గణేష్, సావిత్రి, జమున | ఎన్.టి.రామారావు, సావిత్రి, జమున |

**యా**భై ఏళ్ల క్రితం వచ్చిన చలన చిత్రాలు పెట్టిన ఒరవడులు కొన్ని నేటికీ కొనసాగుతున్నాయనడానికి 'మిస్సమ్మ' చిత్రం కూడా ఒక ఉదాహరణే. ఒకే వరసలో రెండు పాటలు పాడించడం, ఒక పాటకు రెండవపాట సమాధానంగా రూపొందించడం -'మిస్సమ్మ' చూపిన మార్గాలే.

కథానాయిక తీరును కథానాయకుడు విమర్శిస్తున్నా, ఆ విమర్శను సూటిగా ఆమెతో కాక రెండవ కథానాయికకు బోధచేసేట్టు రూపొందినదే 'తెలుసుకొనవె యువతీ' అనే పల్లవితో మొదలయ్యే పాట. ఈ పాటకు సమాధానంగా కథానాయిక సూటిగా నాయకుడితో కాక రెండవ కథానాయికకు బోధ చేస్తున్నట్టుగా వినిపించేది 'తెలుసుకొనవె చెల్లీ' అనే పల్లవితో ప్రారంభమయ్యే పాట.

'తెలుసుకొనవే యువతీ' అని తెలుగులో ఉన్న పాట తమిళంలోని 'మిస్సియమ్మ' చిత్రంలో 'పళగ తెరియ వేణుం' అనే పల్లవితో వినిపిస్తుంది. తెలుగు, తమిళ గీతాలు రెండింటినీ పాడినవారు ఎ.ఎం.రాజా. తెలుగు పాటను పింగళి నాగేంద్రరావు రాయగా తమిళ గీతాన్ని తంజై రామయ్యా దాస్ రాశారు. రెండు చిత్రాలకూ సంగీతం సమకూర్చినవారు ఎస్.రాజేశ్వరరావు.

ముందుగా పింగళి రాసిన తెలుగు పాటను చూద్దాం :

ఆ...ఆ...ఆ...
తెలుసుకొనవె యువతీ -
అలా నడుచుకొనవె యువతీ
తెలుసుకొనవె యువతీ
యువకుల శాసించుటకే
యువతు లవతరించిరనీ ॥తెలుసు॥
సాధింపులు బెదిరింపులు
ముదితలకిక కూడవని
హృదయమిచ్చి పుచ్చుకునే
చదువేదో నేర్వాలని ॥తెలుసు॥
మూతి బిగింపులు - అలకలు
పాతపడిన విద్యలనీ
మగువలెపుడు మగవారిని
చిరునవ్వుల గెలవాలని ॥తెలుసు॥









ఈ పాట యువతులకూ, స్త్రీలకూ ప్రవర్తనా నియమావళిని నిర్దేశించడం కోసం రాసిన పాట కాక స్వయానా - కాలక్రమానా వచ్చిన చిత్రాలలోని పాటలు ఈ పాటలాగా కనిపించినా వాటిలో కొన్ని స్త్రీలను కించపరిచేవిగానూ, వారికి ఆంక్షలు విధించేవిగానూ రూపొందడం దురదృష్టకరం.

ఉదాహరణకు ఒక తమిళ చిత్రంలో కథానాయకుడు 'ఇంగ్లీషు చదివినా తమిళనాడులో ఇలాగే ఉండాలి ఆడమనిషి' అని పాడి వినిపించాడు. అందుకు కథానాయిక 'మీ మాట ప్రకారమే నడుచుకొంటాను' అని వినయంగా సమాధానం చెబుతుంది !

పింగళి రాసిన ఈ 'తెలుసుకొనవె యువతీ' పాట కూడా అభ్యుదయ దృక్పథంతో సాగినట్టు అనిపించదు. 'యువకుల శాసించుటకే యువతులవతరించిరని' అనడం హాస్యం కోసమే అయినా సముచితంగా అనిపించదు. కాకుంటే - నాయకుడు పాడిన పాటకు నాయిక నోట తగిన సమాధానం ఇప్పించాం కదా అని సరిపెట్టుకోవాలేమో !

ఈ సన్నివేశ సందర్భంలో తంజై రామయ్యాదాస్ 'మిస్సియమ్మ' తమిళ చిత్రం కోసం రాసిన పాట ఇది :

ఆ...ఆ...ఆ..
పళగ తెరియ వేణుం
ఉలగిల్ పార్తు నడక్కు వేణుం పెణ్ణే ॥పళగ॥
పళంగాలత్తిన్ నిలై మఱందు
వరుంగాలత్తయ్ నీ ఉణర్న్దు ॥పళగ॥
పిడివాదముం ఎదిర్ వాదముం
పెణ్‌గళుక్కే కూడాదు
బేదమిల్లా ఇదయత్తోడు
పెఱుమైయోడు పొరుమైయాగ ॥పళగ॥
కడుకడువెన ముగమాఱిదల్
కర్నాడక వళక్కు మండ్రో
కన్నియర్‌గళ్ ఆడవరై
పున్నగైయాల్ వెండ్రిడవే ॥పళగ॥







తమిళగీతానికి భావానువాదం :
ప్రవర్తించడం తెలుసుకోవాలి
ప్రపంచాన్ని చూసి నడుచుకోవాలి
గతకాలపు స్థితిని మరచి
భవిష్యత్తును నీవు గ్రహించి ॥ప్రవర్తించడం॥
(మొండి)మంకుతనమూ వాదించడమూ
స్త్రీలకే తగనివి
భేదం లేని హృదయంలో
పేరిమితో (పెద్దరికంతో) ఓర్పుగా
॥ప్రవర్తించడం॥
చిరచిరలాడుతూ మూతి మాడ్చుకోవడం
పాతకాలపు పద్ధతికదా
కన్నియలు (కన్నెలు) మగవారిని
చిరునవ్వుతో గెలిచేందుకు (తగ్గట్టు)
॥ప్రవర్తించడం॥

తమిళగీతం దాదాపుగా తెలుగు పాటలోని భావాలను ప్రతిఫలించింది. ఒకటి రెండు చోట్ల తెలుగు పాటకన్నా భిన్నంగానూ సాగింది.

యువకులను శాసించడానికి యువతులవతరించారన్న భావం తమిళగీతంలో లేదు. గతకాలపు స్థితిని మరలి రానున్న కాలాన్ని దృష్టిలో పెట్టుకుమరి ప్రవర్తించమని తమిళగీతం అభ్యుదయ దృష్టిని బోధిస్తుంది. అయితే ఈ తర్వాతి పంక్తులలోనే స్త్రీలకు ఆంక్షలు విధించే తీరులో -'మంకుతనమూ వాదించడమూ స్త్రీలకే తగనివి' అంటుంది. ఈ చోట 'సాధింపులు బెదరింపులు ముదితలకిక కూడదు' అంటుంది తెలుగు పాట.

తెలుగుపాట కొంత ముందుకు దూసుకువెళ్లి 'హృదయమిచ్చి పుచ్చుకునే చదువేదో నేర్వాలని' ప్రేమ పాఠం చెబుతుంది. తమిళ గీతంలో ఇచ్చిపుచ్చుకోవడాల ప్రస్తావన లేదు. భేదభావంలేని మనసుతో, పేరిమితో, ఓరిమితో ప్రవర్తించమని తమిళగీతం ఉద్బోధ.

చివరి చరణం మొదలయ్యేసరికి నాయిక చిరచిరలాడుతూ కనిపిస్తుంది. అది గమనించిన నాయకుడు తెలుగు పాటలో -

"మూతి బిగింపులు అలకలు పాతపడిన విద్యలని" ఎత్తి పొడుస్తాడు. తమిళగీతంలో నాయకుడు - "చిర చిర లాడుతూ మూతి బిగించుకోవడం పాతకాలం పద్ధతి" అంటాడు. ఈ సందర్భంలో కర్నాడక(కర్నాటక) శబ్దానికి ప్రాంత పరమైన అర్థం లేదు. మగువలు మగవారిని చిరునవ్వుల గెలవాలని తెలుగుపాటలో ఉంచగా తమిళగీతంలో కన్నెలు మగవారిని చిరునవ్వులతో గెలవాలని ఉంది.

అప్పటి తమిళగీతాల పద్ధతికి మారుగా పల్లవిలో 'తెరియవేణుం'(తెలుసుకోవాలి), నడక్కవేణుం'(నడుచుకోవాలి) అని వ్యవహారిక రూపాలు వాడటం అప్పటికి కొత్తదనమనే చెప్పాలి!

తెలుగు చిత్రంలోని పాటలో ఎన్.టి.రామారావుతో కనిపించిన సావిత్రి, జమున తమిళ చిత్రంలోని పాటలో జెమిని గణేష్‌తో కనిపించారు.

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

# న్యూస్ వ్యూస్

సినిమా పాటంటే ఇష్టం వున్న వారందరికీ సిరివెన్నెల సీతారామశాస్త్రి రాసిన 'ఎప్పుడూ ఒప్పుకోవద్దురా ఓటమి' పాట తెలియకుండా ఉండదు. ఆ పాట గల సినిమా (పట్టుదల) ఫెయిలయినా, సమకూర్చిన ట్యూన్ పాపులర్ కాకపోయినా - సాహిత్యపరంగా ఎంతమంది ప్రశంసలనో అందుకున్న పాటది.

"ఈ పాట లిరిక్ బ్రహ్మాండంగా ఉందే.... ఏ సినిమాలోనిది? ఆ సినిమా వచ్చిందా...

## మళ్ళీ వెలుగులోకొస్తున్న 'ఎప్పుడూ ఒప్పుకోవద్దురా ఓటమి'





పాట కూడా ఎక్కడా విన్నట్టు లేదే'' అంటూ ఆ పాట గురించి వాపోయే అభిమానులు కోకొల్లలు.

**వారందరికీ శుభవార్త...** ఆ పాట సాహిత్యం యథాతథంగా 'సై' అనే చిత్రం ద్వారా ప్రేక్షక శ్రోతల ముందుకు రాబోతోంది. ఈ చిత్రానికి హీరో నితిన్. స్టూడెంట్ నెం.1, సింహాద్రి చిత్రాల ద్వారా సక్సెస్‌ఫుల్ డైరెక్టర్‌గా పేరు తెచ్చుకున్న యస్.యస్.రాజమౌళి దర్శకుడు. రాజమౌళి దర్శకత్వం అంటే సంగీతం కీరవాణి అని వేరే చెప్పక్కర్లేదుగా... అంచేత 'ఎప్పుడూ ఒప్పుకోవద్దురా ఓటమి' పాట కీరవాణి ట్యూన్‌లో అతి త్వరలో రాబోతోంది కనుక అభిమానులందరూ ఇక నిశ్చింతగా ఉండొచ్చు.

## సంగీత దర్శకుడుగా కోటి మేనల్లుడు

**యస్**.రాజేశ్వరరావు గారి కూతురి కొడుకు, కోటి మేనల్లుడు అయిన రోహిత్ రాజ్ సంగీత దర్శకుడిగా పరిచయం కాబోతున్నాడు. చిత్రం పేరు మిస్టర్ అండ్ మిసెస్ శైలజా కృష్ణమూర్తి. అట్లూరి పూర్ణచంద్రరావు గారు నిర్మిస్తున్న ఈ చిత్రానికి శివాజీ, లైలా హీరోహీరోయిన్లు కాగా హాస్య చిత్రాల దర్శకుడు శివనాగేశ్వరరావు ఈ చిత్రానికి దర్శకుడు. అక్టోబర్‌లో ఈ చిత్రం విడుదలవుతుంది.

## మళ్ళీ ఆర్పీ పట్నాయక్ - తేజ కాంబినేషన్

'నిజం' తర్వాత తేజ నిర్మించిన 'జై' చిత్రానికి అనూప్ సంగీత దర్శకత్వం



వహించడంతో ఆర్పీ పట్నాయక్, తేజల స్నేహానికి బ్రేక్ పడిందన్న టాక్ సర్వత్రా వ్యాపించింది. 'అదేం కాదు... అనూప్‌కి ఓ చిత్రం ఇవ్వాలని 'నిజం' తీస్తున్నప్పుడే అనుకున్నాం. ఇప్పుడు మేం ఇద్దరం కల్సి ఈ చిత్రం చేస్తున్నాం' అన్నారు ఆర్పీ పట్నాయక్. 'ఎందరు ఈ విషయాన్ని ఔనన్నా కాదన్నా ఇది నిజం' అని సినిమా టైటిల్‌ని కలుపుతూ కూడా అన్నారు. ఉదయ్‌కిరణ్, సదా హీరో హీరోయిన్లుగా నటించే ఈ చిత్రం పేరు 'ఔనన్నా కాదన్నా' (నువ్వంటే నాకిష్టం). తేజ-ఆర్పీ కలిసి పనిచేస్తున్న ఈ చిత్రానికి పాటలు కులశేఖర్ కాక ఇంకెవరు రాస్తారు.... అంచేత కులశేఖరే రాస్తున్నారు. అట్లూరి పూర్ణచంద్రరావు గారు ఈ చిత్ర నిర్మాత.



## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు




**నిశాపతి, హైదరాబాద్**

ప్ర. దేవాలయాల్లో పూజలకి 'రేట్లు' ఎందుకు నిర్ణయిస్తారు?

జ॥ కోవెలలో వెల ఉంది కనుక

ప్ర. కొందరు ఆడవాళ్లు ఎందుకు ప్రతి విషయానికి ఎక్కువగా స్పందిస్తారు ?

జ॥ వాళ్లు 'అతి'వలు కాబట్టి

**రమణశాస్త్రి, సంగారెడ్డి**

ప్ర. అధికమాసం వస్తే ఆనందపడేదెవరు ?

జ॥ కొత్తగా వ్యాపారంలో దిగిన వడ్డీ వ్యాపారి

ప్ర. ప్రజలు బేజారయ్యేదెప్పుడు ?

జ॥ పదవినుంచి దిగుతూ 'నా సహాయనిధి నాకిచ్చెయ్యండి' అని ప్రధానమంత్రి అన్నప్పుడు.

## చిలిపి లిపి




| | | |
|---|---|---|
| వాuవు v చెను | = | వాయువు వీచెను |
| RయYశ్యSun Gum | = | ఆర్యవైశ్య సంఘం |
| C పా e | = | సిపాయి |
| G లే b | = | జిలేబి |
| Hi నది | = | హెచ్చైనది |
| O.P.క | = | ఓపిక |
| P.D.కిలి | = | పిడికిలి |
| P.C.నారి | = | పిసినారి |
| E ది A మిT | = | ఇది ఏమిటి |

-వరదా సాయికుమార్, పర్లాకిమిడి(ఒరిస్సా)

## పేరు - రిపేరు




గోపాలరావుగారి అమ్మాయి -సీతారత్నం గారి అబ్బాయి - ఈడూజోడూ

ఆర్య -తొలిచూపులోనే - నిన్నేఇష్టపడ్డాను - నిజం- నిన్నేపెళ్లాడుతా

ఆమె ఎవరు- మిస్సమ్మ- ఆమె కథ- అంతులేని కథ

సంసారం- ప్రేమబంధం-సంతానం-వివాహబంధం

-రెడ్డి.ఎమ్మె, ఒంగోలు



## ఈ రూటే వేరు




Six Master = ఆరుగురు

- జి.శశిధర్, నెల్లూరు

మైదానం - నా యొక్క దానం

-మహేంద్రాడ చలం, టెక్కలి

## డబుల్ రోల్




కొత్త తారు రోడ్డిది, జాగ్రత్త, అంటుకుపోతారు
గబుక్కున లాగడంలో ఆ బుక్కు చిరిగింది
పలావు తినే కదా ఆవిడంత లావు అయింది
ఇంక డౌట్ లేదు, వాడౌట్ అయిపోతాడు
హాసం వచ్చిందంటే చాలు ఆహా సంతోషం

-తారాదీప్తి, పుణె

## చిలిపి కవిత




ఆయన గారు ఇచ్చేది
జస్ట్ లిప్‌మూమెంటే !
ఆయనకు గొంతు పోలేదూ,
ఆయన మైమ్ కళాకారుడూ కాదు
ఆ ఇంట్లో అసలు వాయిస్
ఆవిడ గారిదే !!

-పర్చా వాసుదేవరావు, దేవరకొండ

## షార్ట్‌కట్స్




| | |
|---|---|
| హారిలంక సంతోష్ | - హాసం |
| చాగంటి లావణ్య | - చాలా |
| మంకిసెట్టి చిదంబరం | - మంచి |
| పగడాల త్రిపుర కమల | - పత్రిక |

- వరదా సాయికుమార్, పర్లాకిమిడి(ఒరిస్సా)

| | |
|---|---|
| వంకాయల దమయంతి | - వంద |
| ఏలకుల భైరవమూర్తి | - ఏభై |
| పాకాల తికమకరావు | - పాతిక |
| పలివల దినకర్ | - పది |

-యస్. ప్రేమలతా లక్ష్మీనారాయణ, కాకినాడ

## పేరడీ పెరేడ్



**సందర్భం:**
పరమ బద్ధకస్తురాలయిన భార్యకు, ఆమె భర్తకు మధ్య జరిగే సంభాషణ.

**ట్యూన్ :** హాయి హాయిగా ఆమని సాగె (సువర్ణసుందరి)

భర్త : వేడి వేడిగా కాఫీ ఇచ్చేయ్ (2),
అలసిపోయి నే వచ్చానులే, భార్యామణీ...
ఆ...ఆ.....ఆ.....ఆ..... ॥వేడి వేడిగా॥

భార్య : పాలన్నీ విరిగిపోయాయండీ ॥2॥
కాఫీపొడి ఐపోయిందండి
మీకు కాఫీ నేను ఇవ్వలేనండీ... మన్నించండీ..
ఆ...ఆ.....ఆ... ॥వేడి వేడిగా॥

**'ఏమో తటిల్లతిక మే మెరుపు' చరణం వరసలో**

భర్త : చూడూ...చూడూ....ఫ్రిజ్‌లో ఫ్రూటీ పేకెట్
చూడు ఫ్రిజ్‌లో ఫ్రూటీ పేకెట్

భార్య : సారీ అండీ బాబిగాడు తాగేసాడండీ..॥2॥
నాన్నకుంచమని ఎంత చెప్పినా
నాన్నకుంచమని ఎంత చెప్పినా
మొండివాడు మాట వినలేదండీ..
మన్నించండీ...ఆ...ఆ.....

**'చూడుమా చందమామ' చరణం వరసలో**

భర్త : ఆకలీ అవుతుందోయి, నాకాకలి ఔతుందోయి
పోనీ టిఫినేదైనా చేయలేవా భార్యమణీ...కానీ...

భార్య : శనగాపిండీ..ఉప్మారవ్వా ॥2॥
నిండుకొనీ మూడురోజులాయెనే
మీకు టిఫిను నే చెయ్యలేనండీ
మన్నించండీ...ఆ...ఆ....

**'కనుగవా తనియగా' చరణం వరుసలో**

భర్త : ఆ...ఆ...ఆ...
స్నానము చేయగా ప్రియసఖీ...
వేడినీళ్లు పెట్టియ్యవే....స్నానము చేయగా..

భార్య : గ్యాసయిపోయిందే... గ్యాసయి పోయిందే...
చన్నీటి స్నానాన్ని చేసేయండీ....
చన్నీటి స్నానాన్ని చేసేయండీ....

**ముక్తాయింపు**

**ట్యూన్ :** 'చెలియలేదు-చెలిమిలేదు'(దేవదాస్)

భర్త : కాఫీలేదు, టిఫినులేదు వేడినీళ్లు లేవు... ॥కాఫీ॥
పాడు బ్రతుకు బ్రతికే కంటే మరణమే మేలే....
అదె హాయినిస్తుందే....

-వై.యస్. నాగమణి, హైదరాబాద్

ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన వై.యస్.నాగమణి, హైదరాబాద్ గారికి సోహన్ మ్యూజిక్ వారు 'అదవిరాముడు' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN MUSIC





జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే
ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...



బాల్యపు
లేతదనం
మళ్లీ కోరుకునే
పెద్దలకు
మరీ మరీ
ప్రత్యేకం

పిల్లల కోసం ప్రత్యేకం...

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
ఎమ్బీయస్ ప్రసాద్

చిత్ర పరిచయం 6

సమన్వయం
మంజీర

**జరిగిన కథ**

జాన్ డూలిటిల్ చిన్నప్పుడు జంతువులభాష అర్థం చేసుకునేవాడు. క్రమేపీ ఆ శక్తి పోయింది. పెరిగి డాక్టరయ్యాక ఓ రోజు హఠాత్తుగా ఆ శక్తి తిరిగివచ్చింది. దానితో ఖంగారుపడ్డాడు. భార్యతో సహా ఎవరికీ చెప్పలేదు. బ్రెయిన్ స్కాన్ చేయించుకున్నాడు. డాక్టరు ప్రాబ్లెమ్ ఏదీ లేదన్నాడు. ఫామ్‌హౌస్‌లో ఓ గుడ్లగూబ వచ్చి రెక్కలో గుచ్చుకున్న పుల్లముక్క తీయించేసుకుంది. ఇతను చేసిన ఉపకారాన్ని సిటీకొచ్చి పదిమందికీ చెప్పడంతో ఓ రోజు రాత్రి నానారకాల జంతువులూ ఇతని ఇంటిమీదకు వచ్చి వైద్యం చేయించుకున్నాయి. ఓ రోజు ఒక తాగుబోతు కోతి కనబడి తనతో పాటు సర్కస్‌లో పనిచేసే పులి ఆత్మహత్య చేసుకుంటుందని వచ్చి కాపాడమని కోరింది- ఇక చదవండి

జాన్ అక్కడికి చేరేటప్పటికే పులి ఉపన్యాసం "నేను కిందకు దుమికేటప్పుడు ఏ ప్రాణీ అక్కడ ఉండకూడదనీ, ఎవరికీ హాని కలగకూడదని ఆశిస్తూ..." దాకా వచ్చేసింది. జాన్ ఖంగారుపడ్డాడు. పెంపుడు కుక్కగా స్థిరపడిపోయిన లక్కీ కేసి చూస్తూ, "పద లక్కీ, రా" అన్నాడు.

లక్కీ తెల్లబోయింది. "ఎక్కడికి ఈ 'రా'?"

"ఇంకెక్కడికి, పులి దగ్గరకి! పైకెళ్లి ఆత్మహత్యా ప్రయత్నం మాన్పిద్దాం!"



"ఏడిశావులే, అదో పులి, దానికో ఆత్మహత్య!" అని వినబడింది. ఎవరాని చూడబోతే అక్కడ తుక్కుడబ్బాలో జాన్‌కి చిరపరిచితులైన ఎలుకల జంట!

"ఎక్కడ చూసినా మీరే కనబడుతున్నారు. ఏదో ఒకటి వాగుతూనే ఉంటారు. కాస్సేపు నోరు మూసుకోలేరూ!" అని వాళ్లను గదమాయించి ఏం? ఇంకా ఆలస్యం అన్నట్టు లక్కీ కేసి చూశాడు.

"మతిపోయిందా, అది పులి, పెద్దపులి" అని లక్కీ ఓ పక్క నసుగుతూండగానే "నా సమయం ఆసన్నమయినది గావున..' అని పులి అనడం వినబడి జాన్ గబగబా పైకి పరిగెట్టాడు. వెంట లక్కీ పరిగెట్టింది. వాళ్లను అక్కడకు లాక్కొచ్చిన కోతి మాత్రం పరుగులుపెట్టే ప్రయత్నం చేయలేదు. నుదురు కొట్టుకుంటూ 'ఇదంతా చూసి నేను తట్టుకోలేను. ఇంకో చుక్క పడాల్సిందే!" అంటూ కారులోనే ఉండిపోయింది.



జాన్, లక్కీ చేరేలోపునే పులి దూకేసి వుండేది కానీ దానికి హఠాత్తుగా కొరడా గురించి గుర్తు వచ్చింది. రింగుమాస్టరు దగ్గర్నుంచి కొట్టేసిన ఆ కొరడా తన ఫ్రెండు బబూన్‌కి ఇస్తే మంచిదనిపించింది. ఆ విషయం కూడా ఎనౌన్స్ చేద్దామని గొంతు సవరించుకోబోతూండగా జాన్ అక్కడికి చేరి "హేయ్" అని పలకరించాడు.

పులి ఆశ్చర్యపడింది - "నువ్వెవరు?" అని అడిగింది.

"నేనా? డాక్టర్ జాన్ డూలిటిల్!"

"ఎవరైతేనేంలే, ఇప్పుడు అడ్డు రాక. చాలా బాధలో ఉన్నాను. చావబోతున్నాను. వీలునామాలో కొత్తమాటలు తట్టక అవస్థపడుతున్నాను." అంది పులి చికాగ్గా.

"వద్దు, వద్దు, కంగారు పడక. నేను డాక్టర్ని. నీకు సహాయపడగలను."

"ఇప్పుడే డాక్టరూ ఏమీ చేయలేని పరిస్థితి బాబూ, నాకు లక్ష కంప్లెయింట్లు. తలనొప్పి, వాంతులు, కొత్తగా ఈ డబుల్ విజన్ ఒకటి పట్టుకుంది. ప్రతీదీ రెండేసి కనబడుతున్నాయి. పులి అంటే ఎవరికీ ఖాతరు లేకుండా పోయింది. బొత్తిగా పట్టించుకోవడం మానేసేరు జనాలు." ఫిర్యాదు చేసింది పులి.

"అలా అనకు, బోల్డు సినిమాల్లో పులుల్ని మంచిగా చూపించారు. పులుల మీద చాలా పాటలు కూడా ఉన్నాయి." నచ్చచెప్పబోయాడు జాన్.

"అలాగా, చెప్పు చూద్దాం" అంది పులి వెక్కిరింతగా.

ఉన్న పళాన చెప్పమంటే ఎవరికైనా కష్టమే, కానీ జాన్‌కు సహాయంగా లక్కీ నిలబడింది. జాన్ మర్చిపోయినప్పుడల్లా అందించింది. ఏయే సినిమాలో పులికి ప్రాధాన్యం ఇచ్చారో చెప్పి, పులుల మీద ఉన్న యాడ్స్, పాటలు వినిపించి ఊరుకో బెట్టబోయాడు జాన్. ఈ వాగుడు, పాటలు విని, విని పులికి జీవితం మీద రోత పుట్టినట్టుంది. "ఇక చాలు మహాప్రభో, దూకేస్తా" అంది.



"ఇంతా పాడించుకుని మళ్లీ దూకుతానంటావేమిటి" అన్నాడు జాన్ చిరుకోపంతో.

ఈ లోపున జాన్‌ను పలకరించిన ఎలుకలు కింద హడావుడి చేసేస్తున్నాయి. "దూకరా చూద్దాం, పెద్ద సైజు పిల్లిలా మొహం నువ్వూనూ, గంటసేపటినుండి ఉర్రి ఊకదంపుడే తప్పఉరకడమూ లేదు, ఏమీ లేదు. దమ్ముంటే దూకి చూపించరా పిరికిపందా" అని అరిచేస్తున్నాయి.

పులి జాన్ కేసి సాలోచనగా చూసింది. "నాకు సాయం చేయాలని ఎందుకనిపించిందసలు?" అని అడిగింది.

టపా కట్టడానికి తటపటాయిస్తోందని గ్రహించిన జాన్ నెమ్మదిగా దాన్ని మాటల్లో పెట్టే ప్రయత్నం చేశాడు. "ఏమో, దీన్నే ఘటన అంటారేమో! నీకు సాయం చేయగలిగే సత్తా నా కొక్కడికే ఉంది కాబట్టి దేవుడు సమయానికి నన్ను పంపేడేమో, లోకంలో ఇన్ని పులులు ఉండగా నిన్నే రక్షించాలని నాకెందుకనిపించిందో.."

"...ఎందుకనిపించిందంటే ఆ తాగుబోతు కోతి నోరుమూసుకుని ఉండలేదు కాబట్టి.." దీనిలో మర్మమేమీ లేదులే అన్నట్టు తేల్చేసింది పులి.

అదేమీ పట్టించుకోకుండా జాన్ కొనసాగించాడు. "నీకు సాయపడదామని వచ్చాను. నువ్వు సరేనంటే.."

"..నువ్వు సాయపడలేకపోతే..?" పులి ధర్మసందేహం వెలిబుచ్చింది.

"..పడలేకపోతే నన్ను, లక్కీని తినేసెయి." అని శిబి లెవెల్లో ఆఫరిచ్చాడు జాన్.

అతని ఆఫర్‌లో ఓ చిన్న సవరణ తెచ్చింది లక్కీ - "అతనితో సరిపెట్టుకున్నా ఫరవాలేదు" అని.

పులికి జాన్ నచ్చినట్టున్నాడు. బతికుంటే బలుసాకే కాదు, ఈ డాక్టరును కూడా తినవచ్చనుకుంది కాబోసు. "అంటే, నన్ను సర్కస్‌కు తీసుకెళ్లి జాగర్తగా అప్పజెప్పుతావన్నమాట" అంది.

"అవును, అంటే నిన్ను సర్కస్‌కు తీసుకెళ్లి జాగర్తగా అప్పజెప్పుతానన్నమాట" అన్నాడు జాన్ పులిమాట జవదాటకుండా.

'సరే, నీ మాటే కానీ' అంటూ పులి పిట్టగోడ దిగింది. ఆత్మహత్యంతా నాటక మనుకుంటా డేమోనని అంతలో అనుమానం వచ్చింది. "ఇదిగో నేనసలు నిజంగా చచ్చిపోదామను కున్నాను తెలుసా' అని తన చావు కోరికను పునరుద్ఘాటించింది.



నాలుగడుగులు వేసి అప్పటిదాకా జాన్ పాడిన పాటలు గుర్తు చేసుకుంటూ, "నీ కంఠవానికంటె నీ హస్తవాసి బాగుంటుందని ఆశపడుతున్నాను. మరి నా కర్మా, నీ కర్మా ఎలా వుంటుందో ఏమో మరి" అంది కాస్త వేదాంతధోరణిలో.

మొత్తం ఉదంతంలో అతిథిపాత్ర ధరించిన లక్కీ జాన్‌ను మెచ్చుకుంది. "గుడ్‌జాబ్ డాక్టర్, సాధించావు. కానీ నన్నడిగితే ఐదంతస్తుల భవనం మీదనుండి పులి కిందకి దూకే దృశ్యం ఇంకా రంజుగా ఉండేది." అంది.

"వింటున్నా, వింటున్నా" అని హెచ్చరించింది పులి.

* * *

మర్నాడు హాస్పటల్లో జాన్ ఓ పుస్తకాన్ని అతి సీరియస్‌గా అధ్యయనం చేసేస్తున్నాడు. అంతలో అతని కొలీగ్ మార్క్ లోపలికి వచ్చాడు - "మధ్యాహ్నం మూడు గంటలకు మీటింగని జీన్ గుర్తు చేయమన్నాడు, మర్చిపోలేదుగా!" అని జ్ఞాపకం చేశాడు.

జాన్, మార్క్, జీన్ - ముగ్గురూ డాక్టర్లే! ముగ్గురూ కలిసి ఈ హాస్పటల్ ప్రారంభించారు. తొలిదినాల్లో డబ్బుకోసం చాలా అవస్థపడ్డారు. క్రమేపీ నిలదొక్కుకున్నారు. హాస్పటల్‌కు మంచిపేరు వచ్చింది. ఇంకో పెద్ద హాస్పటల్ వాళ్లొచ్చి టేకోవరు చేస్తామన్నారు. దాని వల్ల వీళ్ల వాటాకి డబ్బు బాగా వస్తుంది కానీ పేషెంట్స్‌కు ఆదరణ తగ్గవచ్చు. పేషెంట్ల గోల మనకెందుకని మార్క్ ఉద్దేశ్యం.



గతరాత్రి పులిని మృత్యుముఖం నుండి తప్పించిన జాన్ పరమోత్సాహంగా ఉన్నాడు. డబ్బుకంటె పేషెంట్లే ముఖ్యం అన్న మూడ్‌లో ఉన్నాడు. పశువులవైద్యం గురించి పుస్తకం తెచ్చి దీక్షగా చదివేస్తున్నాడు.

తన మాటలు జాన్ వినలేదని గ్రహించిన మార్క్ జాన్ చదువుతున్న పుస్తకం కేసి చూశాడు. "ఇదెందుకయ్యా బాబూ, మన పేషెంట్లు పశువుల్లాటి మనుష్యులు కానీ సొంతం పశువులు కారుగా!" అన్నాడు.

జాన్ తలెత్తాడు. "మార్క్, ఒక్కక్షణం కూచో." అంటూ అతన్ని తన పక్కన కూచోబెట్టుకున్నాడు. "నీకు గుర్తుందా, మనం ప్రాక్టీసు పెట్టిన కొత్తల్లో డబ్బు చాలటం లేదని నువ్వెంత విసుక్కునేవాడివో.." అంటూ ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళ్లిపోయాడు.

మార్క్‌కి ఇదంతా రుచించలేదు. "నేను అదంతా మర్చిపోయానులే" అన్నాడు.

"కానీ నాకు నిన్న రాత్రి అవన్నీ గుర్తుకువచ్చాయి. ఓ పేషెంటును, విచిత్రమైన పేషెంటులే.. అనుకోకుండా ట్రీట్ చేయవలసి వచ్చింది. ఆ పాత రోజులు గుర్తుకు వచ్చాయి. డబ్బుకన్నా పేషెంటే ముఖ్యమని.."

మార్క్ లేచి నుంచొన్నాడు. "గురూ, నన్నొదిలెయ్, ఈ ఆత్మఘోషలు వినాలంటే జీన్ బెస్టు. ఇదిగో జీన్,..నిన్నే.. జాన్ పిలుస్తున్నాడు.." అంటూ వెళ్లిపోబోయాడు.



జాన్ అర్థం చేసుకున్నాడు. "మార్క్, నా సొద ముప్ఫయ్ సెకండ్లపాటు విన్నట్టు నటించినందుకు నీకు కృతజ్ఞుడిని." అన్నాడు వెక్కిరింతగా.

"మీ సేవలో ఎప్పుడైనా.. ఎక్కడైనా సరే.. సిద్ధం" అని వెక్కిరింత గుర్తించనట్లుగా అనేసి "మధ్యాహ్నం మూడు గంటలకు.. మర్చిపోక" అని వెళ్లిపోయాడు మార్క్.

తను చదువుతున్న పుస్తకం రచయితతో మాట్లాడి తీరాలనుకున్నాడు జాన్. ఫోన్ చేశాడు.

ఆ రచయిత వేరెవరో కాదు, లక్కీకి థర్మామీటరు వైద్యం చేసిన డా॥ఫిష్‌యే! జాన్ తన పుస్తకం గురించి మెచ్చుకోవడం విని మురిసిపోయాడు.

"నాకో పేషెంటు ఉంది. ఓ పెద్ద పిల్లి. చూపు సరిగ్గా ఆనటంలేదు. పైగా తలకాయనొప్పి ఒకటి! ఏం చేయాలంటారు?" అని అడిగాడు జాన్.

"మనకు ఎక్కువ ఆప్షన్స్ లేవు. తలకాయలో డిఫెక్టుంటే ఆపరేషన్ చేయడం. రోగం మరీ లొంగకపోతే ఫినిష్ చేసేయడం!" అన్నాడు డా॥ఫిష్ నోరు చప్పరించి.

"అంటే!?"

(సశేషం)

హాస్య నాటిక

# కారులో షికారు

**ఇందులో పాత్రలు**

| | | |
|---|---|---|
| పాపారావు | గౌరీపతి | శ్రీనివాస్ |
| ఎ.సి.బి. ఇన్‌స్పెక్టర్ | భిక్షం | కావేరి |

- కె.వి.ఆర్.విజయకుమార్

**జరిగిన కథ :** రెండు పోర్షన్లు ఉన్న యింటికి వసారా ఒకటే. ఒక పోర్షన్లో రిటైర్డు హెడ్‌మాస్టరు గౌరీపతి, కొడుకు శ్రీనివాస్ (వాసు)ఉంటారు. వాసు డిగ్రీ పూర్తిచేసి, ఉద్యోగం రాక స్వయంఉపాధి పథకాలంటూ ఏవో పిచ్చి వ్యాపారాలు చేస్తూంటాడు. రెండో పోర్షన్లో, రెవిన్యూ డిపార్టుమెంట్‌లో పనిచేసే యు.డి.సి. పాపారావు. అయన కూతురు కావేరి ఉంటారు.

వాసు, కావేరి ప్రేమించుకుంటారు. గౌరీపతికి అది సమ్మతమే కానీ పాపారావుకి ఇష్టం లేదు. ఓ రోజు వాసు పాపారావుకు తన స్కీముల గురించి చెప్తాడు. తన కూతురికేసి కన్నెత్తి చూడనని మాటిస్తేనే స్కీములో చేరతానంటాడు పాపారావు.

- ఇక చదవండి

వాసు : మామయ్యా ఎంత మాటన్నావు మామయ్యా. స్నానం చేయవద్దు అను మానేస్తా...అన్నం తినవద్దను మానేస్తాను...క్రాపు చేయించుకోవద్దను మానుకుంటాను. అంతేగాని కావేరితో మాట్లాడకుండా ఎలా ఉండగలను మామయ్యా.

పాపారావు : ఆలోచించి మాటివ్వు. (వాసు చేతిలో చెయ్యివేస్తాడు)

వాసు : మామయ్యా కావేరితో మాట్లాడకుండా ఉంటే స్కీములో చేరతావా?

పాపారావు : చేరతాను.

వాసు : కన్నెత్తి చూడకుండా ఉంటే..!?

పాపారావు : ఇంకో 10మంది సభ్యులను చేర్పిస్తాను సరేనా!

వాసు : సరే మామయ్యా....

పాపారావు : అరే వాసూ ఇలా చేర్పిస్తే నీకు కమీషన్ ఎంతిస్తారన్నావు?

వాసు : పది పర్సెంట్.

పాపారావు : అయితే ఓ పనిచేద్దాం. మా ఆఫీస్‌కి రా. ఏదో తెలిసిన కుర్రాడు. సెల్ఫ్ ఎంప్లాయిమెంట్ క్రింద ఇలాంటివి చేస్తున్నాడని చెప్పి మా కొలీగ్స్ కొందర్ని చేర్పిస్తా.
అయితే ఒకటి..నీ కమీషను లోంచి ఫైవ్ పర్సెంట్ నాకిచ్చే ఒప్పందం మీదైతేనే.. (షరతు పెట్టాడు )

వాసు : ఓ పని చెయ్ మామయ్యా... ఊళ్ళోకెళ్ళి ఎంగిలాకు లేరుకురా.

పాపారావు : ఎందుకు?

వాసు : అవి నేను నాకుతాను..నా మూతి నువ్వు నాకుదువు గాని.

పాపారావు : ఛీ..ఛీ...

వాసు : లేకపోతే ఏమిటి...అడుక్కునే వాడి దగ్గర గీక్కునే వాడొకడన్నట్లు

పాపారావు : అయితే ఫోవోయ్. నాకేం పట్టింది నే పోతున్నా.

వాసు : (ఆలోచిస్తాడు) సరే...సరే...నీ మాటే ఖాయం. 5% ఒ.కే.

పాపారావు : రా..పోదాం! రా.

వాసు : (పాపారావు ఇంట్లోకి చూస్తూ) ఎందుకూ. నువ్వెళ్ళు ..మీ ఆఫీస్ నాకు తెలుసుగా..నే తర్వాతొస్తా.. (అంటూ మళ్ళీ ఇంట్లోకి చూస్తాడు)

పాపారావు : నీ వేషాలు నాకు తెలుసురా.

వాసు : లేదు మామయ్యా...నేను కాస్త భోజనం చేసి... నువ్వు ఆఫీస్‌కి చేరే లోపు హీరో హోండా మీదొస్తాగా.. నువ్వెళ్ళు.

పాపారావు : నమ్మమంటావా? (అనుమానంగా చూస్తూ అంటాడు)

వాసు : హండ్రడ్ పర్సెంట్ (కౌన్ బనేగా కరోడ్‌పతిలో లాగా చెప్తాడు)

పాపారావు : ష్యూర్?

వాసు : పక్కా!

పాపారావు : లాక్ చేసేదా?

వాసు : కాన్ఫిడెంట్‌గా!

పాపారావు : అయితే సరే (అంటూ ఇంటికి తాళం వేసి, తాళం చెవి జేబులో వేసుకొని) బై బై (అంటూ వెళ్ళిపోతాడు)

వాసు : ఆఁ..(అని నోరుతెరుస్తాడు. వెంటనే) కంప్యూటర్ జీ...
డూప్లికేట్ కీ ఇవ్వు... (అంటూ తన జేబులోంచి డూప్లికేటు కీ తీస్తాడు. తాళం తీసి లోపలికి అడుగు పెట్టబోయే సమయానికి వాసుని నెట్టుకుంటూ కావేరి బయటకు వస్తుంది)

కావేరి : భలే... భలే...మా నాన్నని భలే బోల్తా కొట్టించావ్..ఆల్ క్లియర్ షాంపు అడ్వర్‌టైజ్‌మెంట్‌లో అమ్మాయి లాగా.

వాసు : అబ్బా..నీకెప్పుడూ అడ్వర్‌టైజ్‌మెంట్లు, టి.వి. పిచ్చేనా?... కాస్త ప్రేమించు కొనేదేమన్నా వుందా? ..ప్రేమించు కుందాం రా..

కావేరి : వాసూ...నన్నేమన్నా అను.. కానీ నాది పిచ్చంటే ఒప్పుకోను..టీ.వి. వల్ల... ఎంత విజ్ఞానం..ఎన్ని విషయాలు తెలుస్తాయో తెలుసా? ఈ వస్తువు కొనండి..అది కొనమాకండి ఇది కొనమాకండి ఇది కొంటే అది ఫ్రీ..సబ్బు కొంటే గజ్జి ఫ్రీ..

వాసు : గజ్జా? (నోరు తెరుస్తాడు)

కావేరి : (వ ట్టించ ు కో కుండా) వాసూ..వాసూ.... నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తుంటే థమ్సప్ అడ్వర్‌టైజ్‌మెంట్‌లో లాగా కాళ్ళకి తాళ్ళు కట్టుకుని కొండమీంచి దూకి రోడ్డు మీద పోయే లారీలోంచి బాటిల్ తీసినట్లుగా. నేనేమో థమ్సప్ బాటిల్ ఇక్కడ పెడతానూ.. నువ్వేమో కాళ్ళకు తాడు కట్టుకొని ఇల్లెక్కిదూకి బాటిల్ అందుకొని నాకు ప్రేమగా ఇవ్వవా?

వాసు : నీకేమన్నా... మెంటలా...? బాటిల్ క్రింద పెట్టి పైనుంచి దూకట మెందుకు ? ..ఇక్కడే అందుకు ఛావొచ్చుగా.. అంతేగాని కాళ్ళకి తాడుకట్టుకొని పై నుంచి దూకితే దేవుడు దయలేకుంటే తాడు తెగి తలపగిలి ఛస్తాను.

కావేరి : ఆఁ.. అంతగా తలపగిలితే జాన్సన్ అండ్ జాన్సన్ వాళ్ళ వాటర్ ప్రూఫ్ బాండ్ ఎయిడ్ లేదా ఏంటి? (అమాయకంగా అంది)

వాసు : ఛీ..ఛీ...నిన్ను ప్రేమించినా ఒకటే.. ఆ టి.వి.ని వాటేసుకున్నా ఒకటే.

కావేరి : ఇది ఏ టి.వి. అడ్వర్‌టైజ్ మెంట్ వాసూ?

వాసు : (పిచ్చిపట్టినవాడిలా) ఆ..(అని అరుస్తాడు)

* * * *

లైట్సు ఆఫ్ 3వ సీను

(గౌరీపతి న్యూస్ పేపర్ చదువుతుంటాడు. వాసు గౌరి ఎదురుగుండా కుర్చీలో కూర్చుని స్కీమ్ పేపర్సు పూర్తి

చేస్తుంటాడు)

గౌరీపతి : అరే వాసూ! పాపారావు గాడి ఆఫీసుకి వెళ్ళివచ్చావుగదా ఎంత మందిని చేర్పించాడేంటి?

వాసు : మామయ్య పెట్టిన మొహమాటం మూలంగా ఐతేనేమి- నా వాక్చాతుర్యం వల్లనైతేనేమి పాతిక మందిని చేర్చాం నాన్నా! పనిలో పని మన వూరెళ్ళి వూళ్ళో వాళ్ళందరినీ స్కీములో చేర్పిద్దా మనుకుంటున్నా నువ్వేమంటావు?

గౌరిపతి : వెళ్ళరా..వెళ్ళు..అక్కడ మన మాట కాదనేవారెవరూ.(ఇంతలో కావేరి బయటకు వస్తుంది)

కావేరి : వాసూ...మామయ్య ..భలే ఛాన్సు యిప్పుడే టీ.వీలో చూపించారు 'అవాంట్' కొంటే స్క్రాచ్ కార్డు ఫ్రీ అంట.. (వాసు కావేరి వైపు ప్రేమగా చూస్తూంటాడు.)

గౌరిపతి : 'అవాంటా?'....అవాంటంటే పురుగు మందు కదమ్మాయ్. అది మనమేం చేసుకుంటాం?

కావేరి : అదిగాదు మామయ్య...పత్తిలో పచ్చపురుగుని ఇట్టే చంపేస్తుందట.

వాసు : ఆఁ..అదేం కాదు...అది కొంటే స్క్రాచ్ కార్డ్ ఫ్రీ అంట. గోకితే గోల్డ్ బహుమతి రావచ్చుగదా! కొందాం

గౌరిపతి : ఇదుగో అమ్మాయ్ ..ఇలాంటి తిక్కల సామాన్లు కొన్నావంటే కొంప కొల్లేరవుతుంది. అయినా నిన్నే దరిద్రుడు చేసుకుంటాడో గానీ...

వాసు : నాన్నా...!

గౌరిపతి : ఓ!..మనమే గదూ!

వాసూ : నాన్నా కావేరిని పక్కకు తీసుకెళ్ళి నేను నచ్చచెబుతాగా..నువ్వు పేపరు చదువుకో..(అంటూ కావేరిని భుజంమీద చేతులు వేసి బుజ్జగిస్తూ బయట ఎంట్రన్స్ దాకా తీసుకెళ్తాడు. దారిలోంచి పాపారావు లోపలికి వస్తున్నట్లుగా గుర్తుపడ్తాడు. వెంటనే కావేరితో ) అమ్మో కావేరీ మీ నాన్న వస్తు న్నాడు...(తండ్రితో) నాన్నా! మామయ్య వస్తున్నాడు సరే! ఇందాక నే చెప్పిన ప్లాను గుర్తుందిగా- రెడీ...1-2-3 ఇలా కాదు. మూమెంట్ మారుస్తాను. (పాపారావు ప్రవేశం - ముగ్గురు గమనించనట్లు నటిస్తారు)

గౌరిపతి : ఏంట్రా ఈ వానం! ఎంత మామయ్యకు మాటిస్తే మాత్రం అరగంట నుంచి ఆ పిల్ల ఏడుస్తూ వుంటే చూడకపోతే మానే- పన్నెత్తి మాట్లాడకపోతే ఎలారా?

వాసు : (బిగ్గరగా) నో, నా వల్ల కాదు.

కావేరి : వాసూ! నా వైపు కన్నెత్తి చూడవా! నాతో మాట్లాడవా! నా బ్రతుకు



అడవి కాచిన వెన్నెల కావలసిందేనా ? చెప్పు!

వాసు : నేను మామయ్యకు మాటిచ్చాను నాన్నా! నువ్వైనా చెప్పు. నా ప్రాణం పోయినా సరే! మామయ్య కిచ్చిన మాట తప్పను. దేముడు లాంటి మామయ్యకు అన్యాయం చేయలేను.

గౌరిపతి : (బాధతో) వాసూ! మామయ్యకు మాటిచ్చి ఎంత పనిచేశావురా?

వాసు : తప్పదు నాన్నా తప్పదు.

కావేరి : వాసూ! ఇక మన పెళ్ళి జరగదా? మీరాబాయి కృష్ణుడి బొమ్మతో మాట్లాడినట్టు నేను కూడా నీ ఫోటోతో మాట్లాడు కోవలసిందేనా? ఇక మన పెళ్ళి జరుగదా?

వాసు : మామయ్య అనుమతి లేనిదే ఈ పెళ్ళి జరుగదు. ఎప్పటికయినా సరే ఆయన చేతుల మీదగానే జరగాలి. అప్పటివరకు నేను అశక్తుడిని చెప్పు నాన్నా .. చెప్పు...చెప్పు.. చెప్పు..

పాపారావు : శభాష్‌రా...వాసూ! నీ తపన నాకు అర్థమయ్యింది. నీ నిజాయితీ నాకు నచ్చింది. నీ పెళ్ళి ఖాయం.. నా చేతుల మీదుగా చేస్తాను.

వాసు : థ్యాంక్స్ మామయ్యా...పెళ్ళి కూతురు ఎవరూ?

కావేరి : నాన్నా... ఈ పెళ్ళి నాకిష్టంలేదు.

వాసు, గౌరిపతి: ఆ...!!!

పాపారావు : ఏమైందమ్మా?

కావేరి : క్రేన్ వక్కపొడి లేందే నేనీ పెళ్ళి చేసుకోను.

పాపారావు : చూశారా... లక్షలాది మంది మక్కువతో తింటారీ వక్కపొడి.. అలాగే చేద్దాం.(అందరూ నవ్వుకుంటారు)

గౌరిపతి : ఏరా మబ్బు లేని వానలాగా అర్థంతంగా ఊడిపడ్డావు?

పాపారావు : అరే వాసూ!.. నేనూ, మా ఆఫీస్ వాళ్ళు కట్టిన స్కీమ్ తాలుకు పేపర్స్ వచ్చాయిరా ?

వాసు : ఆ... తెచ్చాను మామయ్యా... నేనే మీ ఆఫీసుకు తీసుకొచ్చి యిద్దా మనుకున్నాను.

గౌరిపతి : అరే వాసూ నేను కూడా బజారుకు వస్తున్నానుండు...మా పెన్షనర్స్‌లో కొంతమంది స్కీములో చేరతా నన్నారు వాళ్ళని నీకు పరిచయం చేస్తా.




వాసు : పద నాన్నా.... (బయటకు వెళ్తారు)

కావేరి : నాన్నా! నేను కూడా బజారెళ్ళి వస్తాను నాన్నా!

పాపారావు : ఎందుకు?

కావేరి : ఎందుకంటే... పెళ్ళికి కావలసినవి మెల్ల మెల్లగా ఒక్కొక్కటి చేర్చు కుంటేనేగా అప్పటికి టెన్షన్ లేకుండా వుండేది.

పాపారావు : అబ్బో... ఎంత ముందుచూపు... వెళ్ళిరామ్మా.
(కావేరి లోపలికి వెళ్లి బ్యాగ్ తీసుకుని బయటకు వెళ్తుంది)

పాపారావు : (ఏదో గుర్తొచ్చిన వాడిలా) ఇదుగో కావేరి...పెళ్ళికి పనికి వస్తాయి గదా అని అరటికాయలూ.. కూరగాయలు తెచ్చేవ్ చస్తాం. కుళ్ళిపోయి. పిచ్చిపిల్ల. తెచ్చినా.. తెస్తుంది.. ఏం పాడో.
(అనుకుంటూ దారి దాకా వెళ్ళి వెనక్కు తిరుగుతాడు)
(ఇంతలో బయట నుండి సార్ అన్న పిలుపు. భిక్షం ప్రవేశం)

భిక్షం : సార్..ఇక్కడున్నారా..?( ఆశ్చర్యంగా అన్నాడు)

పాపారావు : భిక్షాన్ని తేరిపారా చూసి ) నీ ఆశ్చర్యం తగలబడా!?నా కొంపలో నేనుంటే అలా నోరు తెరిచి సార్.. ఇక్కడున్నారా? అని అంతలా ఆశ్చర్యపోతావేరా నేనేదో బ్రోతల్ కంపెనీలో వున్నట్టు. అది సరేగాని ఇలా దాపురించావే.

భిక్షం : దాపురించానా ? (ఆశ్చర్యంగా) లేదు సార్..చిన్న డీల్ తీనుకువచ్చాను. తీరా ఆఫీసుకెళితే మీరింకా రాలేదని అటెండర్ చెప్పాడు. ఎలాగైనా మిమ్మల్ని ఇవాళ పట్టుకొని పని పూర్తిచేసుకుందామని వచ్చాను సార్.

పాపారావు : ఏం పనీ?(అనుమానంగా అడిగాడు)

భిక్షం : ఏం పనా? (ఆశ్చర్యంగా అని.. పాపారావు విసుగ్గా చూడడంతో సర్దుకొని) అదే సార్.. నేను మొన్న మీకు సబ్‌మిట్ చేసిన ఫైల్ తాలూకు విషయం, లోను శాంక్షను కోసం మీరు కాస్త రికమండ్ చేసేస్తూ రాస్తే .. (నసుగుతాడు)

పాపారావు : ఓ...అదా.... దాని విషయం ముందే నీకు చెప్పాను. లోన్‌కి రికమండ్ చెయ్యాలంటే చాలా ఖర్చవుతుందనీ..అదీగాక నీ తాలుకు ఏదో సర్టిఫికెట్ సెక్యూరిటీగా పెట్టాలనీ?

భిక్షం : సర్టిఫికెట్టా? (ఆశ్చర్యంగా మామూలు అలవాటు కొద్దీ) అదేంటిసార్...మీరు చెప్పిన మరుసటి రోజే మీరు ఆఫీసులో లేకపోయినా మీకివ్వమని అటెండర్ వెంకటస్వామి గాడికి సర్టిఫికేట్ ఇచ్చానే. మీకివ్వలేదా? (మళ్ళీ అదే ఆశ్చర్యం)

పాపారావు: (కోపంగా) నిన్ను తగలెట్టా... దరిద్రుడా ..సర్టిఫికెట్టంటే 10 క్లాస్, ఇంటర్, డిగ్రీ లాంటింది గానీ... నీ పెళ్ళాం డెత్ సర్టిఫికెట్ పెట్టుకొని లోనుకి రికమండ్ చెయ్యమంటావురా థూ...నీ.. (అని కోప్పడతాడు)

భిక్షం : (ఆశ్చర్యంగా) డెత్ సర్టిఫికెట్ (తేరుకొని) మరేం చెయ్యమంటారు నాదగ్గర వున్నదదొకటే... (అమాయకంగా అంటాడు)

పాపారావు : ఆ!...దాన్ని పెట్టి లోనుకి రికమండ్ చేస్తే హెడ్ ఆఫీస్ వాళ్ళు నన్ను చెప్పుచ్చుకొడ్తారు. (కోపంగా అంటాడు)

-(తరువాయి వచ్చే సంచికలో)

# 'సరిగపదమని-18'

**జవాబులు:-**

**అడ్డం: 1.పాడుతా 2. తెలుగు 4. తెలి 5. ఆట 7.కోతా 8.రాము 9. పది 11.లేదురా 14. గుడి 15.రావయ్య 17.శైలు 18.సే 19.ఖలే 21. ప్రియతమా 24.సౌందర్య**

**నిలువు: 1. పాడు 2.తెలిసిందిలే 3.పాట 5. ఆశా 6.ప్రేమ 8.రామయ్య 10.గోగులు 12.రారా 13.సయ్య 16.వసంత 17.శైలే 19.ఖళ 20.కాద 22. యమ 23.మాత**

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

దేశపతి శ్రావ్య- సిద్దిపేట(మెదక్), కె.సంతోష్‌కుమార్- సికింద్రాబాద్, ఎమ్.వి.పద్మావతి- ఉందురు(తూ॥గో॥జిల్లా), టి.వి.ప్రసాద్- నల్గొండ, వి.పద్మజ- విజయవాడ, రాజాసురేష్- విశాఖపట్నం, వేముల హనీ- నిడుబ్రోలు (గుంటూరు), పి.స్వాతిలక్ష్మి- చీపురుపల్లి (విజయనగరం), వి.భాస్కర్ రావు- హాయత్‌నగర్ (రంగారెడ్డి), నీలం నాగరాజేశ్వరరావు- నెల్లూరు, యు.ఫణిదరకుమార్- కరీంనగర్, నెల్లూట్ల రమాదేవి- గన్‌పూర్ (వరంగల్), సి.వసంతనాగేశ్వరరావు- హైదరాబాద్, ఉడాలి జ్ఞానప్రసూన- చెన్నై, ఎన్.జ్యోతిర్మయి- హైదరాబాద్, టి.సూర్యతేజ- తాడిపత్రి (అనంతపురం), పోన్నాడ నిత్యజయానందపద్మిని- కాకినాడ, ఎస్.శేషకుమారి- గణపవరం (ప॥గో॥జిల్లా), తోటకాశి అన్నపూర్ణ- అత్తిలి (ప॥గో॥జిల్లా), విస్సా వేంకటసత్యవరప్రసాదరావు- పిఠాపళ్ళ(తూ॥గో॥జిల్లా), కనుపర్తి జగదీష్- విజయవాడ, సి.ఎస్.రావు- నెల్లూరు, తాడిరంగారావు- రాజమండ్రి, సి.శ్రుతిప్రణీత- హన్మకొండ (వరంగల్), జి.శ్రీకీర్తన- విశాఖపట్నం, ఎం.మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, బెహరం శేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), ఉప్పల వెంకటరమణయ్య- కడప, వై.మానస- రాజమండ్రి, కె.వేణుగోపాల్- వరంగల్, బి.వి.వి.సత్యవాణి- హైదరాబాద్, పి.ఉదయభాస్కరరావు&విజయ- రాజమండ్రి, పి.అంజయ్య- భూపాలపల్లి (వరంగల్), జీవా- రాజోలు (తూ॥గో॥జిల్లా), ఇ.రాధిక- హైదరాబాద్, వి.సునీల్‌రెడ్డి- కడప, ఆరాధ్యుల సూర్యకమల్ నితీష్‌స్వాతిఆశిష్- విజయవాడ, ముప్పిరాల శశాంక- హైదరాబాద్, రామరపు దీపికాసాగర్- హైదరాబాద్, సామంచి సుధాకర్- విశాఖపట్నం, జి.సుబ్రహ్మణ్యం- నంద్యాల (కర్నూలు), ఐ.లిఖిత- హైదరాబాద్, బి.వి.లక్ష్మి- హైదరాబాద్, కె.శ్రీనివాసమూర్తి- విశాఖపట్నం, ఎ.శ్రీనివాస్- మహబూబ్‌నగర్, పింగళి లలిత- ఒంగోలు, వరలక్ష్మి వాస్తు- నెల్లూరు, ఎం.ఆంజిరెడ్డి- ఒంగోలు, జి.హరినాథ్- ముంబాయి, ఎ.శరత్‌చంద్ర- అమలాపురం, వేలివంటి కృష్ణవేణి- తెనాలి (గుంటూరు), డా॥వి.ఎస్.రెడ్డి- నెల్లూరు, పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), పసుపులేటి ఝన్సీలక్ష్మీబాయి- మొగలికుదురు (తూ॥గో॥జిల్లా), జి.నాగదుర్గ- హైదరాబాద్, ఆర్.వి.వి.కృష్ణ- హైదరాబాద్, పి.వేణుగోపాల్‌రావు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), వి.సత్యవతి- హైదరాబాద్, పుణ్యాల శ్రీలక్ష్మి- సత్తెనపల్లి, పక్కిమధు- విజయనగరం, నల్లా సూర్యనారాయణమూర్తి- కాకినాడ, బి.కవిత- తిరుపతి, మన్నవ మాధవి- సత్తెనపల్లి, పుణ్యాల రాజ్యలక్ష్మి- సత్తెనపల్లి, గంగం వెంకటరమణమూర్తి- హైదరాబాద్, ఏ.అపర్ణ- హైదరాబాద్, చివుకుల చిరంజీవి- ఒంగోలు, పప్పు అప్పారావు- శ్రీరాంనగర్ (విజయనగరం), తిరుమలప్రసాద్.పి- హైదరాబాద్, పెరల శ్రీవాణి- వైజాగ్.

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

ఎం.ప్రత్యూష- గుంటూరు, ఎ.అంజలి- జాడిజమల్‌పూర్ (నిజామాబాద్), ఆర్.పరుశురామ్- మంచిర్యాల్(ఆదిలాబాద్), పద్మనాభం- విజయవాడ, ఎస్.శివశ్వేత- దేశపాత్రునిపాలెం(విశాఖపట్నం), ఆత్కూరి శ్రీవల్లవి- హైదరాబాద్, ఆసిఫ్‌పాశ- నాచారం (రంగారెడ్డి), సాలా రవికుమార్- భీమయ్యపాలెం, మండలీక గణేశ్వరరావు- కాకినాడ, ఏ.బి.వి.ఎన్.రమేష్- నెల్లూరు, బి.మురళీధర్‌రావు- దుందిగల్(రంగారెడ్డి), యం.పి.ధర్మరాజు- నల్గొండ, భావరాజు నీరజ- న్యూఢిల్లీ, టి.శివప్రియ- హైదరాబాద్, ఎస్.ఇ.రావు- హైదరాబాద్, చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి- అన్నవరపాడు(ప్రకాశం), బి.సుధీర్‌కుమార్- పిడుగురాళ్ళ (గుంటూరు), ఎం.నాగసుధ- పిఠాపురం (తూ॥గో॥జిల్లా), వి.గోవర్ధన్ నాయక్- యాచారం(రంగారెడ్డి), ఆర్.ఎస్.మణి- పలాస (శ్రీకాకుళం), చిలుకూరి శ్రీనివాసశర్మ- విజయవాడ, వి.మంజుల- హైదరాబాద్, ఎం.ఆర్.కె.చార్యులు- కోదాడ(నల్గొండ), బేరా సతీష్‌కుమార్- నర్సీపట్నం (విశాఖజిల్లా), ఎస్.విన్నా- కోల్‌కటా, బి.వెంకటేశం- హైదరాబాద్, యం.త్రిపురసుందరి- సికింద్రాబాద్, జి.యస్.రావు- సిల్క్యాంపస్, ఆలవారుశెట్టి విజయశ్రీ- నెల్లూరు, మేడావద్మావతి- విశాఖపట్నం, కె.సూర్యాప్రకాశ్- సిద్దిపేట (మెదక్), కె.వి.సరస్వతి- హైదరాబాద్, ఆమంచి వెంకటలక్ష్మికామేశ్వరి- రాజోలు (తూ॥గో॥జిల్లా), బి.రమాకాంత్- ఖమ్మం, కె.ఆదిత్యకుమార్- నిజామాబాద్, మద్దాలి సువర్చలాశ్రీనివాస్- హైదరాబాద్, ఎమ్.శశికళ- డోన్(కర్నూలు), అయితా మాధవి- సూళ్ళూరుపేట(నెల్లూరు), నేమానసుభాష్‌చంద్రబోస్- శ్రీకాకుళం, ఎం.దుర్గాప్రసాద్- వరంగల్, పైడిపిల్లి గోపి- విశాఖపట్నం, కేతవరపు చంద్రహర్ష- సత్తెనపల్లి(గుంటూరు), రాజ్‌కుమార్ ముగ్గళ్ళ- హైదరాబాద్, పి.ఎ.వి.ఎస్.ఎస్.ఎన్.దీక్షితులు- నర్సాపురం (ప॥గో॥జిల్లా), బి.వి.ఎ.పి.పంతులు- హైదరాబాద్, బి.లక్ష్మిసింధూజ- ధులిపూడి(గుంటూరు), పొణ్యం విజయలక్ష్మి- కర్నూలు, పొణ్యం రామమోహన్- కర్నూలు, పొణ్యం.శ్రీనివాసరావు- కర్నూలు, జి.కె.మణి- కుంబం(ప్రకాశం), యజ్జల జగన్నాధం- పాతపట్నం (శ్రీకాకుళం), సీతాదేవి.వి- విజయవాడ, ఎస్.విజయలక్ష్మి- హైదరాబాద్, కె.వి.రమణారెడ్డి- హైదరాబాద్, బచ్చువిజయకుమార్- విశాఖపట్నం, పి.విజయసారధి- కర్నూలు, జి.సుమలత- హైదరాబాద్, అవసరాల మహతి- వైజాగ్, అపూర్వ భావన-పాలకొల్లు, సన్నిధి బాలాత్రిపురసుందరి- ఆకివీడు, జి.జయచంద్రగుప్త- కర్నూలు, సువర్ణ సత్యనారాయణ- విజయవాడ, పి.ఎస్.ఎన్.రాజు- అచ్చంపేట(మహబూబ్‌నగర్), పి.శిరీష్‌కుమార్- రాజమండ్రి, యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి(గుంటూరు), పి.పాపారావు- విశాఖపట్నం, ఎన్.జగన్మోహనరావు- కరీంనగర్, సి.హెచ్.శోభాకుమారి- చీపురుపల్లి (విజయనగరం), బి.శ్రీనివాస ప్రభాకర్- హైదరాబాద్, అంజనికుమార్.పి- హైదరాబాద్, ఎ.వినయ్‌కుమార్- వరంగల్, క్రిరిఝాన్సీ- హైదరాబాద్, వజ్రాల స్వాతి- హైదరాబాద్, డి.వి.రావు- హైదరాబాద్, సి.హెచ్.గణేష్- ఉప్పునుంతల (మహబూబ్‌నగర్), వి.విజయలక్ష్మి- హైదరాబాద్, హనుమంతరావు పాల్వాది- నరసారావుపేట(గుంటూరు), కిశోర్‌కుమార్- 8ఇంక్లైన్‌కాలనీ (కరీంనగర్), విద్యరాజేశ్వరరావు- హైదరాబాద్, పి.వి.శివప్రసాద్- నెల్లూరు, శ్రీనివాస్‌పవర్- ఆర్మూర్ (నిజామాబాద్), వేదగిరి దివ్యమాల్లిక- సికింద్రాబాద్, ఐ.రమామణి- జి.ఎల్.పురం (విజయనగరం), టి.ఇందిరాదేవి- హైదరాబాద్, ఒకుటూరు సుజాతనాగరాజరావు- హైదరాబాద్, పి.వి.కె.రవితేజ- హైదరాబాద్, కె.భారతి- హైదరాబాద్.

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

కోలిపాక నరేష్- జూలురుపాడు(ఖమ్మం), కె.శ్రావణి- చిలకలూరిపేట, సి.ఎన్.విజయ- కడప, చుంచు మల్లేశబాబు- వైజాగ్, వేంద్రబాలస్వప్న- హైదరాబాద్, కె.వి.ఎన్.ఎస్.భగవాన్- రాజమండ్రి, పెండ్యాల మురళిధర్‌రావు- నల్గొండ, అలమేలుమంగ- హైదరాబాద్, యం.అనిరుధ్‌కుమార్- అనకాపల్లి, వరాంకుశ శైలజ- సికింద్రాబాద్, యం.మీనాప్రభాకర్- పాలెం, సి.హెచ్.లక్ష్మినారాయణ- సోంపేట (శ్రీకాకుళం), పి.లావణ్య- సికింద్రాబాద్, మెడగోని సుమన్- కరీంనగర్, ఎ.అరుణ- నల్గొండ, వై.ఆర్.నాయుడు- పెద్దచెన్నయ్యగారిపల్లె (చిత్తూరు), భూపతిహరిబాబు- బద్వేల్ (కడప), రాయప్రోలు పార్వతి- ములగపూడి(తూ॥గో॥జిల్లా), పి.సాపిరెడ్డి- హైదరాబాద్, ఎం.వి.యస్.లక్ష్మి- కాకినాడ, మైసూర్ శ్రావణి- హిందూపురం(అనంతపురం), జ్యోతిపట్నాయక్-కోరాపుట్ (ఒరిస్సా), చక్రపాణి.కె- కర్నూలు, కె.నీరజదీపిక- హైదరాబాద్, ఇ.రామ్- కర్నూలు, అద్దంకి శ్రీరామచంద్రమూర్తి- హైదరాబాద్, పి.భ్రమరాంబ- హైదరాబాద్, ఎన్.సి.మోహన్- హైదరాబాద్, ఎం.పురుషోత్తమాచార్య- నల్గొండ, ఉప్పాలమోహనబాబు- అవనిగడ్డ(కృష్ణా), మామిడి మహేంద్ర- పూణే, పి.లక్ష్మిశ్రీదేవి- దొర్నిపాడు(కర్నూలు), ఎస్.శివనారాయణ- కొత్తపేట (ప్రకాశం), అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా).

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

వై.కె.ఎస్.వి.భాగ్యలక్ష్మి- విశాఖపట్నం, ఎమ్.హర్షిత- తిరుపతి, జి.సునీత- హైదరాబాద్, పి.నవీన- అనంతపురం, దాసరి రవికుమార్- గోవిందాపురం (నల్గొండ), మండపాక నాగేశ్వరరావు- విశాఖపట్నం, పి.బాలరాణి- శ్రీకాకుళం, జి.పాండురంగశర్మ- హైదరాబాద్, కె.మల్లేష్- సికింద్రాబాద్, ఎస్.పి.త్రినేత్రసాగర్ - సూగూరు(మహబూబ్‌నగర్), యు.గున్నేశ్వరరావు- పాదిరి(శ్రీకాకుళం), ఎ.జయతేజ- గన్నవరం(కృష్ణా), నాగమణి- హైదరాబాద్.

జూన్ 5 భాస్కరభట్ల రవికుమార్ పుట్టినరోజు సందర్భంగా...

# ... అక్కడే కూర్చుని తను ప్రేమగా ఇచ్చే ఐస్‌సోడా తాగాలనుకుంటున్నాను



శ్రీకాకుళం జిల్లాలో వంశధార పేరుతో ఓ నది ఉంది. ఆ నది పక్కనే బూరవెల్లి అనే ఓ చిన్న గ్రామం. అది మా అమ్మమ్మ వాళ్ల ఊరు. నేను పుట్టింది అక్కడే. నాలుగో తరగతి వరకూ చదువూ అక్కడే. మా తాతగారి పేరు ఆరవెల్లి కన్న రాజగోపాలాచార్యులు. ఆయనకి నేనంటే పంచ ప్రాణాలు. ఎంత ప్రాణమంటే పిల్లలందరం సరదాగా ఆడుకుంటున్నప్పుడు నన్నెవరైనా చనువు వల్ల తిట్టినా కొట్టినా మా తాతయ్య అక్కడ ప్రత్యక్షమైపోయేవారు. నన్ను కొట్టినవాళ్లను అక్కడే చితకబాదేసి నన్ను భుజాలమీద ఎక్కించుకుని ఇంటికి తీసుకొచ్చేసేవారు.

తెలుగు సాహిత్యం మీద ప్రాథమిక దశలోనే నాకు ఆసక్తిని కలిగించింది ఆయనే. శతక సాహిత్యం నా చేత చదివించి అర్థం వివరించేవారు. ఆయన అలా ఎందుకు సాహిత్యం పట్ల నాకు ఆసక్తిని కలిగించేవారంటే దానికో చిన్న ఫ్లాష్‌బ్యాక్ వుంది.

నేను పుట్టినప్పుడు మా ఊళ్లో వున్న తాతగారి స్నేహితుడు ఒకాయన నా తలకాయను పట్టుకుని చూసి 'ఈ అబ్బాయి గొప్ప సన్యాసైనా అవుతాడు, లేకపోతే గొప్ప కవైనా అవుతాడు' అని మా తాతగారితో అన్నారట. మా తాతగారు పద్య సాహిత్యంలో దిట్ట. దాంతో నా మనవడు కవే అవ్వాలిగానీ, సన్యాసి అవడానికి వీల్లేదు అని భీష్మించుకుని ఆ మార్గంలో నేను నడవడానికి సాయశక్తులా కృషిచేశారు. నా మొదటి గురువు ఆయనే!

5 వ తరగతి వచ్చేసరికి నేను రాజమండ్రిలో వున్నాను. గోదావరి గురించి వినడమేగానీ అంతకుముందు ఎప్పుడూ చూడలేదు. ఎందుకో తెలియదుగానీ రాజమండ్రిలో అడుగుపెట్టగానే నాలో ఏదో కొత్తశక్తి ఆవహించినట్లనిపించింది.

నాకెప్పుడూ చదువులో గొప్ప మార్కులొచ్చేవి కావు... ఒక్కో క్లాసూ పాసవుతుండేవాణ్ణి అంతే. కథల పుస్తకాలు చదవడంలో వున్న ఇంట్రెస్టు క్లాసు పుస్తకాలు చదవడంలో లేనప్పుడు మార్కులు బాగా ఎలా వస్తాయి మరి ? అది నా వీక్‌నెస్. ఎవరింటికైనా వెళితే అక్కడ ఏ పుస్తకం కనిపిస్తే అది చదివేసేవాణ్ణి. క్లాసు పుస్తకాల్లో డిటెక్టివ్ నవలలు పెట్టుకుని చదివిన చాలామందిలో నేనూ ఒకణ్ణి. ఈ విషయం మా నాన్నగారికి తెలిస్తే కాలో చెయ్యో తీసేస్తారని చాలా స్పీడుగా చదివేవాడ్ని. ఇప్పటికీ నేను చదవడంలో చాలా స్పీడు. మా నాన్నగారికి నేనంటే చాలా కోపం ఉండేది... చదువులో మార్కులు సరిగ్గా తెచ్చుకోకుండా వీక్లీలు, నవలలు చదువుకుంటూంటానని. నాకూ నాన్నగారంటే అంతకంటే ఎక్కువ కోపం... నా మానాన నేను తోచిన పుస్తకాలు చదువుకుంటుంటే అనవసరంగా విరుచుకు పడతారేంటని.

సరిగ్గా ఇలాంటి సమయంలోనే రాజమండ్రి డీలక్స్ సెంటర్ నన్ను ఆదుకుంది. ఆ సెంటర్లో కొల్లి శివరామకృష్ణ అని నాకో ఫ్రెండ్ వుండేవాడు. వాణ్ణి అందరూ బుజ్జిబాబు అంటారు. వాడూ నేను ఐదో తరగతి ఒకే స్కూల్లో చదివాం. ఆ తరువాత వాడు వేరే స్కూల్, నేను వేరే స్కూల్లో జాయినైపోయాం. వాళ్ల నాన్నగారికి డీలక్స్ సెంటర్‌లో కిళ్లీ కొట్టు ఉండేది. వీక్లీలు, దినపత్రికలు కూడా ఆ కొట్లో అమ్ముతుండేవారు. ఏదో పనిమీద ఓసారి ఆ షాపుకెళితే మా ఫ్రెండ్ అక్కడున్నాడు. చదువుమానేసి వాళ్ల నాన్నగారికి హెల్పింగ్‌గా ఆ షాపులోనే ఉంటున్నాడని తెలిసింది. ఇంకేం.. అక్కడే బోలెడు వీక్లీలు చదువుకోవచ్చు అని తెగ సంతోషం కలిగింది.

రోజూ సాయంత్రమయ్యే సరికి మెల్లగా చేరిపోయేవాణ్ణి. అప్పటికి నేను ఎనిమిదో తరగతి చదువుతున్నాను. నన్ను చూడగానే వాడు హేపీ ఫీలయిపోయేవాడు. రోజూ గంటల తరబడి అక్కడే నిలబడి చదువుతుంటే మా వాడికి కొంచెం బాధేసిందేమో ఓ రోజు వాళ్ల ఇంటి నుంచి ఓ స్టూలు తెప్పించి అక్కడ పెట్టాడు. ఇక మీద నువ్వు దీనిమీద కూర్చుని హాయిగా చదువుకో అన్నాడు. ఐస్‌సోడా, నిమ్మ సోడాలతో పాటు అడపాదడపా లస్సీ ఇచ్చేవాడు. మా బుజ్జిబాబుకి నేనంటే ఎందుకు అంత ఇష్టమో ఇప్పటికీ అర్థం కాదు. అలా చాలా సంవత్సరాలు ఆ షాపుతో అనుబంధం ఏర్పడిపోయింది.

నా గురించి ఎవరైనా ఫ్రెండ్స్ మా ఇంటి కెళితే నేను లేననుకోండి డైరెక్ట్‌గా డీలక్స్ సెంటర్‌కే వచ్చేసేవాళ్లు. ఆ విధంగా చదివి చదివి కవిత్వం, కథలు రాయాలనిపించడం మొదలుపెట్టింది. 'బాలమిత్ర'లో నేను తొలిసారి కథ రాశాను. ఆ తరువాత చాలా పత్రికల్లో కథలు, కవితలు, వ్యాసాలు రాశాను. ఇక అక్కణ్ణుంచి నేను రచయితగా ఎదగాలని, ఆ మార్గంలోనే స్థిరపడాలనే బలమైన కోరిక బలోపేతమయింది. అదీ డీలక్స్ సెంటర్‌లో మా బుజ్జిబాబుగాడి షాపు వల్లే!

నేను టెన్త్‌క్లాసులో వుండగా తెలుగు విశ్వవిద్యాలయ సాహిత్యపీఠం(రాజమండ్రి) వాళ్లు కవిసమ్మేళనం ఏర్పాటు చేశారు. నేనూ కవిత పంపించాను. సమ్మేళనంలో పాల్గొనేందుకు ఆహ్వానం వచ్చింది. పెద్దవాళ్లందరూ కవితలు చదువుతున్నారు. చివరికి నా పేరు అనౌన్స్ చేశారు. నేను తెలుగుభాష మీద కవిత చదివాను. నా ఫేసు చూస్తే అక్కడున్న కొంతమంది కవులకు నన్ను ఆట పట్టించాలనిపించిందేమో కొంచెం వెటకారంగా మాట్లాడారు. 'వీడిది కవిత్వం చదివి అర్థం చేసుకునే

వయసే కాదు... ఏకంగా కవిత రాసి పట్టుకొచ్చేశాడే' అని. మనసులో బాధ కలిగింది. కానీ బాధపడుతూ కూచుంటే వాళ్లకి సమాధానం చెప్పడమెలా? ఇలా ఆలోచిస్తూనే ఉన్నాను. ఓ సంవత్సరం తరువాత సమాధానం దొరికింది.

నేను కవిసమ్మేళనం ఏర్పాటుచేసి సదరు రచయితలను ఆ కార్యక్రమానికి ఆహ్వానించాలనుకున్నాను. ఇంటర్మీడియట్‌లో 'యువస్వరం' పేరుతో ఓ సంస్థను ఏర్పాటుచేసి ప్రతీనెలా ఓ కవిసమ్మేళనం జరిపాను. అప్పుడు నన్ను కామెంట్ చేసిన రచయితలే మీ సంస్థ కవి సమ్మేళనంలో మేమూ పాల్గొంటామని నన్ను రిక్వెస్ట్ చేసేవారు. దాదాపు 3 సంవత్సరాలు పాటు 'యువస్వరం' రాజమండ్రిలోని ప్రముఖ



సాహిత్య సంస్థల్లో ఒకటిగా వెలిగింది.

'యువస్వరం' ప్రారంభించాక నెలవారీ కార్యక్రమాలకు ఆర్థిక ఇబ్బంది లేర్పడేవి. ఎవరినైనా చందాలడుగుదామనుకున్నా ఎవ్వరూ ఇచ్చేవాళ్లు కాదు. కవి సమ్మేళనమా ? అంటే ఏమిటి? దానికి బదులుగా ఏ రికార్డింగ్ డ్యాన్సో పెట్టండి... ఎంత కావాలంటే అంత ఇస్తాం అనేవాళ్లు.

ఇక లాభం లేదు.. నేను ఏదో ఒక ఉద్యోగం చేసి సంపాదిస్తేగానీ సంస్థ నడవడం కష్టమని ఇంటర్మీడియట్ సెకండియర్ పరీక్షలు రాసేసి - ఆ వెంటనే రాజమండ్రి 'ఈనాడు'లో కల్చరల్ కంట్రిబ్యూటర్‌గా ఉద్యోగం సంపాదించాను. నెలనెలా జీతం తీసుకోవడం - జీతం వచ్చిన మరుసటి రోజే కవితల పోటీలో కథల పోటీలో పెట్టడం, ప్రయిజ్‌లు ఇవ్వడం.

'యువస్వరం'లో అందరూ కొత్త కవులకే అవకాశమిచ్చాను. అలా మా సంస్థ ఇచ్చిన ప్రోత్సాహంతో కవులుగా మంచి గుర్తింపు తెచ్చుకున్న వాళ్లు చాలామంది ఉన్నారు.

సరే, జీతం వస్తోంది - అయిపోతోంది. ప్రతీనెలా జీతం తీసుకెళ్లి అలా ప్రోగ్రాంలకి ఖర్చు పెట్టేస్తే ఎలా? ఇంట్లో ఎంతోకొంత ఇవ్వాలి కదా. అలాగని జీతం ఇంట్లో ఇస్తే 'యువస్వరం' పరిస్థితి ఏంటి? అందుకని అదనంగా డబ్బు సంపాదించాలని 'సితార' పత్రిక్కి రాజమండ్రిలో జరిగే సినిమా షూటింగ్‌లు కవరేజీ పంపేవాణ్ణి. అప్పుడు 'సితార'కి శ్రీకంఠమూర్తిగారు ఎడిటర్. ఆయన నన్ను బాగా ఎంకరేజ్ చేసి నేను రాసిన సినిమా ఆర్టికల్స్‌కి రెమ్యునరేషన్ పంపేవారు. ఆ డబ్బుతో ఫంక్షన్స్ చేసి 'ఈనాడు' జీతాన్ని ఇంట్లో ఖర్చులకి ఇచ్చేవాణ్ణి. ఇంతకీ ఈనాడులో నా జీతం ఎంత ? 600 రూపాయలు.

సినిమా కవరేజ్‌లు చేయాలంటే సినిమాలు బాగా చూస్తుండాలి... చూసేవాణ్ణి. (అంతకుముందు నుండే నాకు సినిమాలంటే ఇష్టం. ఏ సినిమా వదిలిపెట్టేవాణ్ణి కాదు) అలా చూస్తూ.. చూస్తూ నేనూ సినిమా రచయితనైతే ఎలా ఉంటుంది? అనిపించింది. ఆలోచన వచ్చిన దగ్గర్నుంచీ సినిమా ప్రారంభంలో పడే టైటిల్స్‌లో గీత రచయితల పేర్లు బాగా అబ్జర్వ్ చేసేవాణ్ణి. ఆ వరుసలో నా పేరుని ఊహించుకునేవాణ్ణి. నా డిగ్రీ పుస్తకాలమీద 'భాస్కరభట్ల రవికుమార్ - కాబోయే సినిమా పాటల రచయిత' అని రాసుకునేవాణ్ణి. అంతలా ఆ కోరిక పెరిగిపోయింది.

మరి సినిమా రచయిత అవ్వాలనుకుని రాజమండ్రిలో వుంటే ఎలా కుదురుతుంది ? హైదరాబాద్‌లో మకాం వెయ్యాలి. మకాం వెయ్యాలంటే అక్కడ ఏదో ఒక ఉద్యోగం వుండాలి. అప్పటికే 'సితార'కి సినిమా ఆర్టికల్స్ రాస్తున్నాను కాబట్టి శ్రీకంఠమూర్తి గారిని హైదరాబాద్ వచ్చి కలిశాను. అవకాశం లేదన్నారు.

తిరిగి ఓ ఆరు నెలల్లో అవకాశం కుదరడం 'సితార' రిపోర్టర్‌గా హైదరాబాద్‌లో బిచాణా వెయ్యడం జరిగింది... దాదాపు 7 సంవత్సరాలు సినీ జర్నలిస్ట్‌గా పనిచేయడం... పాటలు రాయాలన్న నా ఆలోచనను దర్శక నిర్మాతల దగ్గర బైట పెట్టడం... చివరికి 'గొప్పింటి అల్లుడు' సినిమాతో ఇ.వి.వి.సత్యనారాయణగారు నన్ను పాటల రచయితని చెయ్యడం ఒకదాని వెంట మరొకటి జరిగాయి.

చూస్తుండగానే 60 సినిమాలకు పాటలు రాసేశానా అనిపిస్తోంది. అవును మరి... ఒక్కసారి సినిమా టైటిల్స్‌లో గీత రచయితగా నా పేరు చూసుకోవాలని కలగన్న నాలాంటి వాడికి ఆ ఒక్క సినిమా తప్ప మిగిలినవన్నీ బోనస్సే కదండీ. సినీ కళామతల్లికి నేనెప్పటికీ ఋణగ్రస్తుణ్ణే!

చాలా రోజుల గ్యాప్ తరువాత నేనామధ్య రాజమండ్రి వెళ్లాను. నా అడుగులు అలవాటుగా డీలక్స్ సెంటర్ వైపుకి లాక్కెళ్లాయి. డీలక్స్ సెంటర్ అక్కడే ఉంది. కానీ మా బుజ్జిబాబు షాపు లేదు.... ఆ షాపే కాదు - ఆ వరుసలో మరే షాపూ లేదు. రోడ్డును వెడల్పు చేసే కార్యక్రమంలో భాగంగా మా బుజ్జిబాబు షాపుని కూల్చేశారట.... నాకు భోరున ఏడుపొచ్చింది.

బోధి వృక్షాన్ని కూల్చేస్తే బుద్ధుడికి కోపం వస్తుందో రాదో గాని ఆ షాపుని కూలగొట్టడం వల్ల నాకు మాత్రం కోపం చాలా వచ్చింది. నా జీవితాన్ని గొప్ప మలుపు తిప్పిన పుస్తకాల షాపది. ఆ తరువాత మా బుజ్జిబాబుని కలిస్తే వాడూ నాతో పాటు ఏడ్చాడు. ఆర్థికంగా వాడు బాగా చితికిపోయి ఓ కిరాణా కొట్లో పనికి చేరాడు.... అక్కడ ఇమడలేక శుభకార్యాలకి కిళ్లీలు కట్టే కాంట్రాక్ట్‌పని చేస్తున్నాడు.

ఎంతో కొంత డబ్బిచ్చి వాణ్ణి ఇప్పుడు తాత్కాలికంగా ఆదుకోగలను. కానీ అలా చేస్తే వాడి ఋణాన్ని దులిపేసుకోవడమే అవుతుంది.... అందుకే బుజ్జిబాబు చేత రాజమండ్రిలోనే మళ్లీ కిళ్లీకొట్టు పెట్టించేందుకు ప్లాన్ చేస్తున్నాను. నా వయసు మీద పడ్డాక మళ్లీ నేను వాడి షాపు ముందే కూర్చొని పుస్తకాలు చదువుకుంటూ తను ప్రేమగా ఇచ్చే ఐస్ సోడా తాగాలనుకుంటున్నాను.

**భాస్కరభట్ల లేటెస్ట్ టాప్ టెన్**

1. ఓ మగువా నీతో స్నేహంకోసం ఎంతో ట్రై చేశా (సత్యం)
2. ఏ నాటికీ మనమొకటేనని (శివమణి)
3. నవ్వవయ్యా బాబూ (పెదబాబు)
4. నైరే నైరే (ఆంధ్రావాలా)
5. గుమ్మా గుమ్మా పండిస్తావా (అందరూ దొంగలే)
6. నువ్వు వుంటే చాలు (నేను పెళ్లికి రెడీ)
7. కనులు మూస్తే చాలు నువ్వే (నేనూ సీతామాలక్ష్మి)
8. అందమైన పాపపేరు ఐశ్వర్య (వీడే)
9. నిప్పుతునకై (ఆంధ్రావాలా)
10. శ్రీరామచంద్రా సిగ్గే గోవిందా (ఓ రాధ ఇద్దరు కృష్ణుల పెళ్ళి)




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



(మనకు పరిచయస్థులైన తెలుగు మాస్టారు. తనలోకమే తప్ప ఇతర విషయాలు తెలీవు. సినిమావాళ్లు తెలియరు. ఆయన, యస్.పి. బాలసుబ్రహ్మణ్యాన్ని ఇటీవల కలుసుకున్నారు. యస్.పీ.ని ఒక మధ్యవర్తి మాస్టారికి పరిచయం చేశాడు)

"మాస్టారూ! వీరిని తెలుసుగా తమకి! బాలూగారు..." అన్నాడు మధ్యవర్తి చక్రవర్తిలా ఫీలయిపోతూ.

"ఏం చేస్తుంటారు వీరు?" అన్నాడు మాస్టారు గొడుగు నేలమీద గుచ్చుతూ.

"అదేమిటి మాస్టారూ! ఆయన్ని తెలియకపోవడం ఏమిటి. జగమెరిగిన గొప్పగాయకుడు!" అన్నది మధ్యవర్తి కంఠం - కొద్దిగా రెచ్చి.

"జగమెరిగినంత మాత్రాన నాకు తెలియాలా ఏమిటి....? ఏం పేరన్నావు?"

"బాలు"

"బాలా! బాలేమిటి, బాలూ బంతీనూ. తెలుగు వాడు కాడా?"

"పరిశుభ్రమైన తెలుగువాడు మాస్టారూ!"

"మరి బాలేమిటి?"

"అది...షార్టనేమ్. శ్రీరామచంద్రుడిని 'రామా' అంటాం చూడండి- అలా"

"లాంగ్‌నేమ్ వేరే వుందా?"

"ఉందండీ-యస్.పీ.బాలసుబ్రహ్మణ్యం"

"పెద్దగాయకుడంటున్నావు- అతను మాట్లాడ్డేంటి-మౌనవ్రతమా? పాటలే తప్ప మాటల్రావా?"

"అదేం లేదు మాస్టారూ! అతను పరిచయం చేసి చెబుతున్నాడు గదా అని, నేను

# "రెండు ఇంటి పేర్లెందుకూ ఒకటి చాలదా తేమకి?"





వింటున్నాను" అన్నారు బాలు - వినయంగా మొహం పెట్టి.

"ఆఁ సైలెన్స్! అదీ విషయము. యస్.పీ. అంటే? పోలీసూపరెంటా?"

"ఇంటి పేరు మాస్టారూ. శ్రీపతి పండితారాధ్యుల"

"రెండు ఇంటిపేర్లెందుకూ- ఒకటి చాలదా తమకి?" మాస్టారి కళ్లు చిట్లాయి.

"ఒకటే మాస్టారూ."

"ఒకటే అయితే యస్ అని పెట్టుకోండి. యస్.పి. అని రెండు అక్షరాలుంటే రెండు పేర్లు కాలేదూ?" అని మధ్యవర్తిని చూశారు మాస్టారు.

"అలాగేనండీ - ఇంతవరకూ ఎవరూ నాకు చెప్పలేదు. ఇప్పుడే తమరు చెప్పారుగా ఇక మీదట 'యస్' అనే పెట్టుకుంటాను" అన్నారు బాలు వినమ్రతా విధేయతా వినయాల కలయికతో.

"తమరు గాయకుడంటే కచేరీలు చేస్తారా? శాస్త్రీయంగా బాగా వచ్చునా ఏమిటి తమకు?"

"కాదు మాస్టారూ, సినిమా గాయకుడు. సినిమాలలోనే ఎక్కువగా పాడతారు. కచేరీలు చేస్తారుగాని, సినిమా పాటలతోనే చేస్తారు" అన్నాడు మధ్యవర్తి వివరణ ఇస్తూ.

"ఓహో! సినిమా గాయకుడా! అంటే వెనకపాట పాడటం అన్నమాట! మా చిన్నతనమందు వీధి భాగవతములు, నాటకములూ జరిగేవి. అప్పుడు తెరవెనుక నుంచి పాడేవారు. ఇప్పుడు ఈయన కూడా అలాంటి గాయకుడే" అని తేల్చారు మాస్టారు.

మాస్టారి అమాయకత్వానికీ, ధోరణికీ చిన్నగా నవ్వుకున్నారు మధ్యవర్తీ, పాటల చక్రవర్తీ.

"బాలుగారు చాలా భక్తిగీతాలు కూడా రికార్డులుగా ఇచ్చారు" అన్నాడు మధ్యవర్తి టాపిక్ మార్చాలని.

"సైలెన్స్! మళ్లీ బాలు ఏమిటోయ్ బాలు! పూర్తిపేరుతో చెప్పు! లేకపోతే బెంచీ ఎక్కించేయగల్ను"

"అదేనండీ బాలసుబ్రహ్మణ్యంగారు... ముప్పై వేల పైచిలుకు పాటలు పాడారు, తమరొక్కటీ వినలేదా?"

"సైలెన్స్! ఈ సినిమా పాటలు నేను విన్ను. మొన్న ఏదో పెళ్లికి వెళితే, అక్కడ రికార్డు పెట్టారు. ఒక్కముక్క తెలీలేదు. తెలుగేట! ఉండవలసిన

చోట ఒత్తులేదు, అక్కర్లేని చోట ఒత్తులుపెట్టి సుత్తులుకొట్టాడు. ఏం- తమకి తెలుగుభాషతో పరిచయం లేదా యేమిటి?"

"అది... మాస్టారూ! ఈయన పాడినది కాదు. ఈయన చాలా స్పష్టంగా పాడతారు. అది, ఇతర భాషవాళ్లు పాడింది అయివుంటుంది. వాళ్లకి తెలుగురాదు కదా"

"సైలెన్స్ రాస్కెల్! అదెందుకలాగ! తెలుగురాని వాళ్ల చేత పాడించడం! ఇతగాడు పాడొచ్చుగదా."

"పాడొచ్చు మాస్టారూ. పాడుతున్నాను. కాని, ఈ సినిమాల్లో మార్పులు వస్తూవుంటాయి. అంచేత,కొత్తకొత్తవారొచ్చి పాడుతూ వుంటారు" అన్నారు బాలు చేతులు కట్టుకుని మంచిబాలుడిలా.

"ఆహా!.... సరే, కానీ భాషపోతే పోనీ. నాకొక్కడికే పట్టిందాఏమిటి-"

"బాలుగారు, సారీ... బాలసుబ్రమణ్యం గారు.."

"అవునూ - ఇంత పెద్దవాడిగా వున్నాడు -ఇంకా 'బాల' ఏమిటి- ప్రౌఢసుబ్రహ్మణ్యం అని మార్చుకోలేడా?"

"అది, పేరుగదా మాస్టారూ. ఇప్పుడు ప్రౌఢసుబ్రహ్మణ్యం అనీ, తర్వాత వృద్ధ సుబ్రహ్మణ్యం అనీ అలా మార్చుకుంటూ పోతే, బాగుంటుందంటారా?" అని అడిగారు బాలు.

"పాయింటే" అనుకుంది మాస్టారి మనసు.

"చాలా సినిమాల్లో పాత్రలు కూడా ధరించారు సుబ్రమణ్యం గారు" అన్నాడు మధ్యవర్తి.

"ఏమిటి - రాక్షసుడూ అలాంటి పాత్రలా, లేక వినాయకుడు లాంటివా?"

"నా వర్సనాల్టీ చూసి, అలా అడుగుతున్నట్టున్నారు మాస్టారు. అదేం కాదండి, తండ్రి పాత్రల్లాంటివి వేశాను. టీవీ అంటారు చూడండి, తమరు చూస్తారో లేదో, వాటిల్లో కూడా నటించాను."

"సైలెన్స్! అసలు సినిమాలే చూడను మొర్రో అంటే, టీవీలొకటా?"

"కొత్త కొత్తవారిచేత, పిల్లలచేతా టీవీలో పాడిస్తూ, వాటి రాగాలు అడగటం, భాషని సరిచెయ్యడం లాంటివన్నీ చేయిస్తున్నారు బాలసుబ్రహ్మణ్యంగారు, అవి మీరు చూడాలి" అన్నాడు మధ్యవర్తి.

"అలాగా! అది నవుచితమైన కార్యక్రమము. బాగుంది. అలాంటిది వచ్చినప్పుడు చెప్పు నాకు."

"మాటీవీలో వస్తుంది మాస్టారూ"

"మీ టీవీలో వస్తే నాకెలా తెలుస్తుందయ్యా, సైలెన్స్"

"మా అంటే మా అని కాదు. దాని పేరు. మీకు టైమూ అదీ చెప్తాను. చూడండి సార్."

"చూస్తాను చూస్తాను. చూడూ, సంగీతం అంటే నాకు ప్రాణం. మంచి శ్రావ్యమైన సంగీతం అభిలషణీయము. అలాంటి సంగీతాన్ని ప్రోత్సహించండి.... తమరు శాస్త్రీయ సంగీతాన్ని ఎవరి దగ్గర అభ్యసించారు?"

"లేదండి. శాస్త్రీయం ఎవరి దగ్గరా నేర్చుకోలేదు. కృషితో నే పాడుతున్నాను."

"సైలెన్స్! వినికిడి మాత్రాన పాడటం ఏమిటి - కడుధూర్తము. గురువులేని విద్య విద్యకాదు. ఇప్పటికైనా మించిపోయింది లేదు, ఒక గురువును చూసుకుని అభ్యాసం చెయ్యండి. కేవలము సినిమా పాటలే వేలాది పాడటం గొప్పకాదు. శాస్త్రీయము నేర్చుకుని కచేరీలు చెయ్యాలి. అదీ గాయకుడి ఘనత! తెలిసిందా?"

"ఇప్పుడే తెలిసింది మాస్టారూ - తమ ఆదేశము శిరోధార్యము" అన్నారు బాలు.

"బాలు గారికి, అదే బాలసుబ్రహ్మణ్యం గారికి గురుభక్తి ఎక్కువసార్. ఆయనను సినిమాలకి పరిచయం చేసి, తీర్చిదిద్దిన కోదండపాణిగారి పేరు మీద రికార్డింగ్ థియేటర్ కట్టించారు" అన్నాడు మధ్యవర్తి కనుబొమ్మలు నుదురుదాటి, జుట్టుకి అందేలాగా ఎత్తి.

"సంతోషము, అయితే, తనపాటలన్నీ అక్కడే పాడేసుకుంటూ వుండొచ్చు డబ్బు ఖర్చులేకుండా... మంచి యోచన. గురుభక్తికి గురుభక్తీ, కిట్టుబాటూ - రెండూ వున్నాయందులో."

"సంతోషం మాస్టారూ. నేను రికార్డింగ్‌కి వెళ్లాలి. సెలవు తీసుకోనా" అన్నారు బాలు.

"సైలెన్స్....సెలవు తమరు తీసుకోరాదు మాస్టర్లం మేమే ఇవ్వాలి. అయినా పని తొందరలో ఉన్నానంటున్నారు కనుక వెళ్లిరండి..." అన్నారు మాస్టారు గొడుగు విప్పుతూ.

## సం'గీతా'రహస్యాలు



బాలు, మొదటి రోజుల్లో చాలా సినిమాలకి 'ట్రాక్స్' పాడారు. (ప్రి ట్రాక్ అంటారు. పాడవలసిన అసలు గాయకుడికి, వరుస తెలియడానికి ముందుగా ఇంకొకరి చేత పాడించి రికార్డు చెయ్యడం) ప్రొడ్యూసర్స్ కంబైన్ వారు "ఇద్దరు అమ్మాయిలు"(1970) తీసినప్పుడు, ఘంటసాల గారికి గొంతు సరిలేదని ముందుగా బాలసుబ్రహ్మణ్యం చేత పాడించారు. (సంగీతం కె.వి.మహదేవన్) ఆ పాట హీరో నాగేశ్వరరావు గారికి, బాలు చాలా పట్టుదలగా, ఘంటసాలవారి పట్టుతో, నాగేశ్వరరావు గారికి పాడినట్టు - పాడారు. తర్వాత ఘంటసాల పాడ్డానికి వచ్చి పాట విని ఆనంద పడిపోయి "బాబు! కుర్రాడు బాలసుబ్రహ్మణ్యం బాగా పాడాడు బాబూ. అంత బాగా పాడిన పాటని మళ్లీ పాడించడం ఎందుకు? అదే వుంచేయండి" అన్నారు. "లేదు, హీరో గారికి మీరే అలవాటు కదా, ఆయనేమంటారో ఏమిటో" అని నిర్మాతలు సందేహం వెలిబుచ్చితే, "నేను హీరోగారితో మాట్లాడి, ఒప్పిస్తాను." అని ఘంటసాల గారు అక్కినేని వారికి చెప్పి ఒప్పించారు. ఆ పాట "నా హృదయపు కోవెలలో" అన్న పాట. ( ఈ విషయం ఒక ఘంటసాల వర్ధంతి సభలో - కొత్త గాయకుల్ని ఘంటసాల ఎలా ప్రోత్సహించేవారో చెబుతూ, నేను ఉదహరించాను. వేదికమీద వున్న బాలసుబ్రహ్మణ్యం తాను మాట్లాడినప్పుడు - ఈ విషయం అంగీకరించారు.)

-ఆర్కే

ఇంకా అంతకుముందు, 'మంచికుటుంబం' సినిమాకి (1968) 'త్యాగశీలవమ్మా మహిళా' అన్న పాటని ఆ చిత్ర సంగీత దర్శకుడు కోదండపాణి - బాలు చేత పాడించారు. పాలవాడికి డబ్బులు ఇవ్వాలని, వాడు రోజూ వచ్చి అడుగుతున్నాడని -'మంచి కుటుంబం' పాట డబ్బుకోసం కోదండపాణిగారిని అడిగాడు బాలు.

"ఇంకెక్కడి పాటయ్యా పంతులూ....మాస్టారు ఆ పాట పాడేశారు." అని కోదండపాణి చెప్పారు.(బాలుని కోదండపాణిగారు 'పంతులూ' అని పిలిచేవారు) బాలుకి ఆశ్చర్యమేసింది - ముందుగా ట్రాక్ పాడడం అనేది వుంటుందనీ, అలా పాడితే, దానికి డబ్బు ఇవ్వరనీ(అప్పట్లో) అప్పుడు తెలిసిందిట!

-ఆర్కే

జూన్ 4 ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం పుట్టినరోజు సందర్భంగా...

# సరిగపదమని

## బాలు స్పెషల్ 20

కూర్పు : కె.వి.రామకోటేశ్వరరావు, అద్దంకి & టి.నవీన్, హైదరాబాద్

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ● | 3 | | | 4 |
| | ● | | ● | 5 | | ● | ● | |
| 6 | | ● | 7 | | ● | ● | 8 | |
| | ● | 9 | ● | ● | 10 | ● | | ● |
| ● | 11 | | ● | 12 | | | ● | 13 |
| 14 | ● | | ● | | ● | ● | 15 | |
| 16 | | ● | 17 | ● | 18 | ● | ● | |
| | ● | 19 | ● | 20 | | ● | ● | |
| ● | 21 | | | ● | ● | 22 | | ● |

**అడ్డం:-**

1. '........... అందం ఈ పుత్తడి బొమ్మ' 'సిరిసిరిమువ్వ'లోని పాట(4)
3. '........... మురళికి వలచిన మువ్వకి ఎదలో ఒకటే రాగం' ఆనందభైరవిలోని పాట (4)
5. 'పాటల .......కివై ఊరేగే చిరుగాలి' నువ్వు వస్తావని చిత్రంలోని గీతం (2)
6. '.......మ నిగమాంత వర్ణిత' అన్నమయ్య గీతం (2)
7. ' ......రాత్రి వసంతరాత్రి .....గాలి పైరగాలి' ఏకవీర చిత్రంలోని గీతం (2)
8. '......సా వాచా మనసిస్తే మైసూర్‌ప్యాలెస్ రాసిస్తా' ఇద్దరుమిత్రులు చిత్రంలోని గీతం (2)
11. '.....తొలిరాత్రి కదలని రాత్రి నీవు నాకు నేను నీకు చెప్పుకున్న కథల రాత్రి'(2)
12. 'ఆకాశం దిగి వచ్చి మబ్బులతో వెయ్యాలీ మన.........' నువ్వునాకు నచ్చావ్ చిత్రం లోని గీతం (3)
15. 'తాళికట్టు శుభవేళ ......లో కళ్యాణమాల' అంతులేని కథ చిత్రంలోని పాట (2)
16. 'అణువూ అణువున వెలసిన......' మానవుడు - దానవుడు చిత్రంలోని గీతం (2)
17. 'అబ్బో..... అమ్మ గొప్పదే అందం పోగేసి కన్నదే' అంజి చిత్రంలోని పాట (1)
20. '..... .....కో సన్నాయీ కోటి రాగాలు ఉన్నాయీ' గోరింటాకు చిత్రంలోని గీతం (2)
21. '......... ఏ తోడు లేక ఏటెపమ్మా ఒంటరి నడక' (3)
22. '....... గోరింకతో ఆడిందిలే బొమ్మలాట' ఖైదీ నెం: 786 చిత్రం లోని గీతం (2)

**నిలువు:-**

1. 'రవివర్మకే అందని ఒకే ఒక ..........' రాముడే రావణుడైతే చిత్రంలోని పాట (4)
2. 'నాకళ్ళు చెబుతున్నాయి .....ప్రేమించానని' ప్రేమాభిషేకంలోని పాట (2)
3. 'ఆకు చాటు పిందె తడిసె కోకమాటు .......తడిసె' వేటగాడు చిత్రంలోని పాట (2)
4. 'చక్కెర ఎక్కడ ....... కనిపెట్టవ చీమలు రక్కున' నాని చిత్రంలోని గీతం (3)
5. 'రాముడు అనుకోలేదు జానకి.......కాగలనని ఆనాడు'(2)
8. 'సిరి...... పూవల్లే నవ్వు చిన్నారి పాపల్లే నువ్వు' (2)
9. '.......రాయలసీమ గడ్డ దీని కథ తెలుసుకో తెలుగు బిడ్డ' సీతయ్యలోని గీతం (3)
10. 'ఎన్నెన్నో జన్మల బంధం ......నాది ఎన్నటికి మాయని మమత నాది .....' (2)
12. '..... ..... ....... ఎర్ర..... యాపిల్ దాని పేరు' ఘరానామొగుడు చిత్రంలోని పాట(2)
13. '.........మయ్యా నిన్ను పురుషోత్తమా' అన్నమయ్య గీతం(4)
14. 'పుణ్యభూమి ....... నమోనమామి' మేజర్ చంద్రకాంత్‌లోని గీతం (3)
18. 'కంటేనే...... అని అంటే ఎలా' ప్రేమించు చిత్రంలోని గీతం (2)
19. 'కలలోనైన ......గనలేదే నువ్వు వస్తావని' (2)

పజిల్, కూపన్ 15-06-2004 లోగా చేరాలి

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

పంపినవారి పేరు :..............................................

వయసు :.......... వృత్తి :..............................................

చిరునామా :..............................................

..............................................

..............................................ఫోన్ :..............................................

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)




రెండవ బహుమతి (ఒక తప్పుతో)



మూడవ బహుమతి (రెండు తప్పులతో)




కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)




This feature is sponsored by :

SOHAN MUSIC

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...

**రచన : వేటూరి ① గానం : యస్.జానకి**

ప: ఓం... ఓం.... ఓం...
ఓం....నమశ్శివాయ
ఓం.... నమశ్శివాయ చంద్రకళాధర సహృదయా
చంద్రకళాధర సహృదయా
సాంద్రకళా పూర్ణోదయ లయ నిలయా
ఓం....ఓం....నమశ్శివాయ ఓం....నమశ్శివాయ
చ: పంచభూతములు ముఖపంచకమై
ఆరు ఋతువులు ఆహార్యములై ॥పంచ॥
ప్రకృతి పార్వతి నీతో నడిచిన
ఏడు అడుగులే స్వరసప్తకమై
సా గా మా దానీసాగ - గా మా దా నీసాగామ
గగగ సససనీగా మగ సనిద మగస
నీ దృక్కులే అటు అష్టదిక్కులై
నీ వాక్కులే నవరసమ్ములై
తాపస మందార ఆ...ఆ...ఆ..
నీ మౌనమే...దశోపనిషత్తులై ఇల వెలయా ॥ఓం... నమ॥
చ: త్రికాలములు నీ నేత్రత్రయమై
చతుర్వేదములు ప్రాకారములై ॥త్రికాలములు॥
గజముఖ షణ్ముఖ ప్రమథాదులు
నీ సంకల్పానికి ఋత్విజవరులై
అద్వైతమే నీ ఆదియోగమై
నీ లయలే ఈ కాలగమనమై
కైలాస గిరివాస నీ గానమే
జంత్ర గాత్రముల శృతికలయా
ఓం.... ఓం.... ॥ఓం నమశివాయ॥

**రచన : వేటూరి ② గానం :యస్పీ బాలసుబ్రహ్మణ్యం,శైలజ**

ఆ : వేవేలా గోపెమ్మలా మువ్వా గోపాలుడే మా ముద్దు గోవిందుడే
మువ్వా గోపాలుడే మా ముద్దు గోవిందుడే
అహ అన్నుల మిన్నల కన్నుల వెన్నెల వేణువులూదాడే
మది వెన్నలు దోచాడే
అ: ఆ..ఆహాహా...వే....వేలా గోపెమ్మలా మువ్వా గోపాలుడే
మా ముద్దు గోవిందుడే
అ: మన్ను తిన్న చిన్నవాడే నిన్ను కన్న వన్నెకాడే ॥2॥
ఆ: కన్నతోడు లేనివాడే కన్నెతోడు వున్నవాడే
మోహనాలు వేణువూదే మోహనాంగుడితడేనే ॥2॥
అ: ఆ..... చీరలన్ని దోచి దేహచింతలన్ని తీర్చినాడే
పోతన్న కవితలన్ని, పోతపోసుకున్నాడే
మా మువ్వా గోపాలుడే మా ముద్దు గోవిందుడే
ఆ : వేవేలా గోపెమ్మలా మువ్వా గోపాలుడే మా ముద్దు గోవిందుడే
ఆ: వేయి పేరులున్నవాడే వేల పేరులున్నవాడే.... ॥2॥
అ: రాసలీలలాడినాడే రాయబార మేగినాడే
గీతార్థ సారమిచ్చి గీతలెన్నో మార్చేనే ॥2॥
ఆ: ఆ....ఆ..... నీలమై నిఖిలమై కాలమై నిలిచాడే
వరదయ్య గానాల వరదలై పొంగాడే
మా మువ్వా గోపాలుడే మా ముద్దు గోవిందుడే
అ : వేవేలా గోపెమ్మలా మువ్వా గోపాలుడే మా ముద్దు గోవిందుడే

**రచన : త్యాగరాయ కీర్తన ③ గానం :యస్.జానకి**

కీ: బాల కనకమయ చేల
సుజన పరిపాల కనకమయ చేల
సుజన పరిపాల కనకమయ చేల సుజన పరిపాల
శ్రీరమాలోల నిగృత సరజాల
శుభద కరుణాలవాల ఘనలీల
నవ్య వనమాలికా భరణా ...
ఏలా నీ... దయా... రాదూ...
పరాకు చేసేవేలా... సమయము... కాదూ
రారా రారా రారా రారా దేవాది దేవా
రారా మహానుభావా
రారా దేవాది దేవా రారా మహానుభావా
రారా దేవాది దేవా రారా మహానుభావా
రారాదా....నీల నేత్రా రఘువర పుత్రా
సార సరసుధా పూర హృదయా ...
రారా... రారా... సార సరసుధా పూర హృదయ
పరివార జలధి గంభీర దనుజ సంహార
దశరథ కుమార భువజన విహార
సకల శృతిసార నాదు పై ఏలా నీ దయా రాదూ
సారీమరిస తకతఝుం
దపమపదపఝుం
సనిరిస తకతఝుం
సనిస ధం సనిసరిస ధీం
సనిసగామరీస నిరిస ధం
పద తకధిమి తకతఝుం పపమరి మమరిస
సరిరిమ రిమమప తకఝుం పమగమరీ మరిస
రిమప తద్ధింగిణతో దాదా నిపమ తద్ధిం గిణతో
ఏలా నీ దయా రాదూ పరాకు చేసేవేలా
సమయము కాదూ ఆ...ఏలా..... నీ దయారాదూ

**రచన : వేటూరి ④ గానం : బాలు,శైలజ**

అ: వాగర్థా వివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ
వందే పార్వతీప....రమేశ్వరౌ
ప: నాదవినోదము నాట్యవిలాసము పరమ సుఖము పరము
అభినయ వేదము సభకనువాదము సలుపు పరమ పదము
భావములో ఆ: ఆ... భంగిమలో ఆ: ఆ ....
గానములో ఆ: ఆ..... గమకములో ఆ: ఆ..... అ:॥భావములో॥
ఆంగీకమౌ తపమీ గతి సేయగ ॥నాద వినోదము॥
ఆ: అభినయవేదము సభకనువాదము
సలుపు పరమ పదము ఆ...ఆ...ఆ...
ఇ: నీనిమదనీని మదనిసనీ రిసనిదనీ
మగమదాద గమామ రిగస
ఆ: కైలాసాన కార్తీకాన శివరూపం
ప్రమిదే లేని ప్రమథాలోక హిమదీపం అ: ॥కైలాసాన॥
అ: నవరస నటనం ఆ : దని సరి సనిస
అ: జతియుత గమనం ఆ : దని సరి సనిస
అ: నవరస నటనం జతియుత గమనం
ఇ: సుతగిరి చరణం సురనుతి పయనం
అ: భరతమైన నాట్యం బ్రతుకు నిత్య నృత్యం ॥2॥
తపనుని కిరణం తామస హరణం ॥2॥
శివుని నయన త్రయలాస్యం
ఆ: ధిరన ధిరన నన అ : తకిట తకిట ధిమి
ఆ: ధిరన ధిరన నన అ: నాట్యం
ఆ: ధిరన ధిరన నన అ : తకిట తకిట ధిమి
ఆ: ధిరన ధిరన నన అ: లాస్యం
అ: నమక చమక సహజం ఆ: జం
నటప్రకృతీ పాదజం ఆ: జం
నర్తనమే శివకవచం ఆ: చం
నటరాజ పాద సుమరజం ఆ: జం
ఆ: ధిరన నన అ: ధిరన నన
ఆ: ధిరన నన
అ: ధిరన నన ధిర ధిర ధిర ధిర ధిర ధిర ధిర ధిర॥నాద॥

| రచన : వేటూరి | 5 | గానం : బాలు, జానకి |
|---|---|---|

ఆ: మౌనమేలనోయి...
మౌనమేలనోయి ఈ మరుపురాని రేయి ॥2॥
ఎదలో వెన్నెలా వెలిగే కన్నులా ॥2॥
తారాడే హాయిలో.... ॥ ఇంక మౌనమేలనోయి॥
అ: పలికే పెదవి ఒణికింది ఎందుకో
ఒణికే పెదవి వెనకాల ఏవిటో
ఆ: కలిసే మనసులా విరిసే వయసులా ॥2॥
అ: నీలి నీలి ఊసులు లేతగాలి బాసలు
ఆ: ఏవేమో అడిగినా ॥మౌనమేల॥
హిమమే కురిసే చందమామ కౌగిట
సుమమే విరిసే వెన్నెలమ్మ వాకిట
అ: ఇది ఏడడుగుల వలపూ మడుగులా ॥2॥
ఆ: కన్నెయీడు ఉలుకులు కంటిపాప కబురులు
అ: ఎంతెంత తెలిసినా ॥మౌనమేల॥

| రచన : వేటూరి | 6 | గానం : బాలు |
|---|---|---|

అ: తకిట తధిమి తకిట తధిమి తందానా
హృదయ లయల జతుల గతుల తిల్లానా ॥తకిట తధిమి॥
తడబడు అడుగుల తప్పని తాళాన
తడిసిన పెదవుల రేగిన రాగాన ॥తడబడు॥
శృతిని లయను ఒకటి చేసి ॥తకిట తధిమి॥
నరుడి బ్రతుకు నటన ఈశ్వరుడి తలపు ఘటన
ఆ రెంటి నట్ట నడుమ నీ కెందుకింత తపన ॥నరుడి॥
తెలుసా మనసా నీకిది తెలిసీ అలుసా
తెలిసీ తెలియని ఆశల వయసీ వరసా
తెలుసా మనసా నీకిది తెలిసీ అలుసా
తెలిసీ తెలియని ఆశల లాలలా...లలలా
ఏటిలోని అలలవంటి కంటిలోని కలలు కదిపి
గుండియలను అందియలుగ చేసి ॥తకిట తధిమి॥
పలుకు రాగ మధురం నీ బ్రతుకు నాట్యశిఖరం
సప్తగిరులుగా వెలిసే సుస్వరాల గోపురం ॥పలు॥
అలరులు కురియగనాడినదే
అలకల కులుకుల అలమేల్మంగా ॥అలరుల॥
అన్న అన్నమయ్య మాట అచ్చ తేనె తెనుగుపాట
పల్లవించు పద కవితలు పాడీ ॥తకిట॥
ఆ...ఆ....ఆ....

| రచన : వేటూరి | 7 | గానం : బాలు,శైలజ |
|---|---|---|

సాకీ: గా మా నీ గమగస మగస గస నీసానిదమగ
దమగ మగ సరీసానీ
గమగనీ గమాగ మదామ దనీద నిసానిరీ
అ: వేదం అణువణువున నాదం ॥2॥
నా పంచ ప్రాణాల నాట్యవినోదం
నాలో రేగేనెన్నో హంసానంది రాగాలై ॥వేదం॥
అ: సాగర సంగమమే ఒక యోగం
నిరిసనిదమగా గదమగరిసనీ నిరిసనిదమగా
మదనిసరీ సగారి మగదమ గమద నిసాని దనిమద
గమ రిగస
సాగర సంగమమే ఒక యోగం
క్షార జలధులే క్షీరములాయె
ఆ మథనం ఒక అమృత గీతం
జీవితమే చిరనర్తనమాయె
పదములు తామే పెదవులు కాగా ॥2॥
గుండియలే అందియలై మ్రోగా ॥వేదం॥
ఆ: ఆ....ఆ.....ఆ.... మాతృదేవోభవా
పితృదేవోభవా.... ఆచార్య దేవోభవా....ఆచార్య దేవోభవా
అతిథి దేవోభవా ........అతిథి దేవోభవా
ఎదురాయె గురువైన దైవం
మొదలాయె మంజీర నాదం
గురుతాయె కుదురైన నాట్యం
గురుదక్షిణైపోయె జీవం
అ: నటరాజపాదాల తలవాల్చనా
నయనాభిషేకాల తరియించనా
ఆ: నటరాజ పాదాల తలవాల్చనా
నయనాభిషేకాల తరియించనా
అ: సుగమము రసమయ
సుగమము రసమయ
నిగమము భరతముగా
ఆ: వేదం అణువణువున నాదం
నా పంచప్రాణాల నాట్యవినోదం
నాలో రేగే నెన్నో హంసానంది రాగాలై
అ: జయంతితే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః
నాస్తిక్లేశాం యశః కాయే జరా మరణంచ భయం
నాస్తి జరామరణంచ భయం
నాస్తి జరామరణంచ భయం

# కథా సంగ్రహం

బాలకృష్ణ (కమల్‌హాసన్) మంచి నృత్య కళాకారుడు. తనలోని కళను ఆవిష్కరించుకునే అవకాశం కోసం ఎదురుచూస్తూ వుంటాడు. రఘు (శరత్‌బాబు) అతనికి మంచి స్నేహితుడు. బాలు అని పిలవబడే బాలకృష్ణని తనతో పాటే ఉంచుకుని అతనికి మంచి అవకాశం రావటానికి తనకు వీలయినంత మేరకు సహాయపడుతూ ఉంటాడు. మాధవి (జయప్రద) సంస్కారవంతుల ఇంట పుట్టిపెరిగిన అమ్మాయి. నృత్యగానాలలో అభిరుచి, ప్రవేశం మెండుగా ఉన్నాయి. ఓసారి అనుకోకుండా బాలుకి మాధవితో పరిచయం అవుతుంది. బాలు కళా హృదయానికి, మంచితనానికి ఆమె ముగ్ధురాలవుతుంది. జాతీయస్థాయిలో ఎంతోమంది కాకలు తీరిన నృత్య కళాకారులతో సమానంగా నృత్యం చేసే అవకాశాన్ని బాలుకి ఆమె కలుగజేస్తుంది. కానీ దురదృష్టం.... ఢిల్లీకి బయలుదేరే సమయానికి బాలు తల్లి (డబ్బింగ్ జానకి)కి తుది ఘడియలు సమీపిస్తాయి. జాతీయస్థాయిలో ఎంతోమంది ప్రముఖుల ముందు నర్తించి ఎనలేని పేరు ప్రఖ్యాతులు తెచ్చుకోగల సామర్థ్యం కలిగిన బాలు అదే సమయానికి మరణశయ్య మీద ఉన్న తల్లి ముందు ఆమె ఆఖరు కోరికగా నృత్యం చేస్తాడు. ఆమె కన్ను మూస్తుంది. బాలూ నిరాశా నిస్పృహలకు లోనవుతాడు.

మాధవి సాన్నిహిత్యంతో ఆమెకు దగ్గరవుతాడు. అది గమనించిన మాధవి తండ్రి బాలుని పిలిచి ఆమెకు పెళ్ళయిందని, కోర్టు కేసులో తను ఆస్తిని కోల్పోవటం వల్ల పెళ్ళివారు పీటల మీదనే తమను ఒదులుకున్నారని, ఆ షాక్ నుండి మాధవి తేరుకోవటం కోసమే ఆమె ఏం చేసినా ప్రోత్సహిస్తున్నామని చెబుతాడు. అయినా సరే బాలు ఆమెతో తన జీవితాన్ని పంచుకోవాలనే ఆశిస్తాడు. ఈలోగా మాధవిని పెళ్ళి చేసుకున్న వేణుగోపాల్ వస్తాడు. మూర్ఖంగా పట్టుబట్టిన తండ్రి చనిపోయాడని, అందుచేత మాధవిని తన జీవిత భాగస్వామిగా స్వీకరించి విదేశాలకు వెళ్ళిపోవడానికే తిరిగి వచ్చానని, అయితే బాలును చూశాక తనకన్నా అతడే మాధవికి తగినవాడన్న అభిప్రాయానికి వచ్చానని చెబుతాడు.

తన జీవితానికి ఇంకా నిలకడ దొరకలేదని, అంచేత మాధవిని తనకు కట్టబెట్టడం సరికాదని వేణుగోపాల్‌తో చెప్పి, తన మీద ఏమాత్రం గౌరవం వున్నా ఆయనతో జీవితాన్ని పంచుకోవడమే సబబని మాధవికి నచ్చచెప్పి వారిద్దరినీ ఒకటిచేసి విదేశాలకు పంపిస్తాడు బాలు. కాలచక్రం శరవేగంగా తిరిగిపోతుంది.

మాధవి, వేణుగోపాల్‌లకు పుట్టిన శైలజ (గాయని ఎస్పీ శైలజ) నాట్యం అభ్యసించి ప్రదర్శనలు ఇస్తూ వుంటుంది. ఆమెకు వివాహం కూడా నిశ్చయమవుతుంది. తన అభివృద్ధి కోసం కళలు కన్న కన్నతల్లి మరణం, కొండంత అండగా తనతో నిలబడుతుందనుకున్న మాధవి తన జీవితం నుండి తొలగిపోవడం ఈ రెండూ బాలుని మానసికంగా క్రుంగదీస్తాయి. మనసుపెట్టే బాధ నుండి దూరమవడానికి తాగుడుకు దగ్గరవుతాడు. లివరు కూడా చెడిపోతుంది. ఊళ్ళో జరిగే నృత్య కార్యక్రమాలపై సమీక్షలు రాసి పత్రికలకు ఇస్తూ ఉంటాడు.

ఈ పరిస్థితుల్లో ఆ ఊళ్లో శైలజ నృత్యం జరుగుతుంది. ఆ నృత్యాన్ని విమర్శిస్తూ రాస్తాడు బాలు. అందుకు ప్రతిఫలంగా అతడిని అవమానించబోయి భంగపడుతుందామె. దాంతో అతడిపై ద్వేషభావాన్ని పెంచుకుంటుంది. బాలు రాసిన విమర్శ చదివి అతడు బాలకృష్ణే అయి ఉంటాడని ఊహించి అతడున్న ఊరికి వచ్చి అడ్రసు పట్టుకొంటుంది మాధవి. రఘుని కలిసి బాలూ ఉన్న పరిస్థితికి చలించిపోయి అతడిని బాగుచెయ్యదలచుకొంటుంది.

వేణుగోపాల్ చనిపోవటం వల్ల వైధవ్యంతో వున్న మాధవిని చూసి బాలు తట్టుకోలేడని, అతనికిది మరో షాక్ అయి వెంటనే మరణించే ప్రమాదం ఉందని అంటాడు రఘు. 'అయితే అతడిని వెంటబెట్టుకుని ఊటీకి మీరు రండి అక్కడ మా యింట్లో అతడు ఉండి మా అమ్మాయి శైలజకు నృత్యం నేర్పుతాడు. నేను అతనికి కనబడకుండా అతని యోగక్షేమాలు చూసుకొని తిరిగి మామూలు మనిషిని చేస్తాను' అంటుంది.

బాలూ ఎక్కడికీ రానని, ఎవరికైనా సరే నేర్పడానికి తన మనసంగీకరించటం లేదని మొరాయించినా - 'తన భార్య వైద్యం కోసం ఈ సహాయం చెయ్యమని' రఘు అడగడంతో ఒప్పుకుంటాడు. ఒకరోజు బాలు తాగిన మైకంలో నూతిలో పడబోతుండగా - అతడిని పట్టుకొని రక్షించాలని - బొట్టులేకుండా కనిపిస్తే బాలుకి తన వైధవ్యం గురించి తెలిసి పోతుందని - దేవుడికి నమస్కరించుకుని బొట్టు పెట్టుకుని అతడిని కాపాడుతుంది మాధవి. తన దగ్గర నృత్యం నేర్చుకుంటున్న శైలజ, మాధవి కూతురేనని తెలిసిన తర్వాత తన ప్రాణాల్ని ఫణంగా పెట్టి తనకు తెలిసిన నృత్యాన్ని ఆమెకు నేర్పడానికి నిశ్చయించుకుంటాడు బాలు.

ఈలోగా హాస్పిటల్ సంక్షేమం కోసం ఓ నృత్యప్రదర్శన ఇవ్వాల్సి వస్తుంది. శైలజ చేత నృత్యం చేయిస్తే బావుంటుందని అందరూ అంటారు. తన పరిస్థితి విషమిస్తున్నా లెక్క చెయ్యకుండా బాలు ఆమెకు తర్ఫీదు ఇస్తూ ఉంటాడు. అతడిపై గౌరవం లేకపోయినా అయిష్టంగా ఉంటూ అతడిపట్ల అమర్యాదగా ప్రవరిస్తూనే నృత్యాన్ని అభ్యసిస్తూ ఉంటుంది శైలజ.

ప్రదర్శన రోజు వేదికపైకి వెళ్ళడానికి సిద్ధమవుతుండగా ప్రేక్షకులనుద్దేశించి బాలు గురించి మాధవి, మాధవి గురించి బాలు కృతజ్ఞత పూర్వకంగా పలికిన మాటలు మైక్ ద్వారా శైలజ చెవిన బడతాయి. బాలు, మాధవి ఒకరిపై ఒకరు అభిమానంతో, ఆరాధనతో ఎంత పవిత్రంగా బ్రతికారన్నది ఆమెకు అర్థమవుతుంది. పశ్చాత్తాపంతో కన్నీటి పర్యంతమవుతుంది. 'మాతృదేవోభవ' అంటూ తల్లికి 'ఆచార్యదేవోభవ' అంటూ బాలుకి శిరసు వంచి నమస్కరిస్తుంది. బాలు దగ్గర తను నేర్చుకున్న నృత్యాన్ని అద్భుతంగా ప్రదర్శించి అందరి మన్ననలను అందుకుంటుంది. తన ఆత్మ శైలజ నృత్యరూపంలో మాధవి ముందుంటుందన్న తృప్తితో కన్నుమూస్తాడు బాలు.

-సమాప్తం-

## నటీనటులు

కమల్‌హాసన్, జయప్రద, శరత్‌బాబు, అరుణ్‌కుమార్, సాక్షిరంగారావు, వంకాయల సత్యనారాయణ, భీమేశ్వరరావు, మిశ్రో, కృష్ణచైతన్య, ధమ్, పొట్టిప్రసాద్, ఒ.ఎస్.ఆర్.మూర్తి, గణేశ్వరరావు, జి.వి.జి., భాస్కరరావు, ఏచూరి, పి.ఎమ్.బాబు, జానకి, రాజరాజేశ్వరి, అర్చన, మాస్టర్ చక్రవర్తి

**అతిథి నటులు**: మంజుభార్గవి, గీత, మోహన్, ఏడిద శ్రీరాంప్రసాద్, డా॥తంబు

తొలి పరిచయం : ఎస్.పి.శైలజ

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ, స్క్రీన్‌ప్లే | : కె.విశ్వనాథ్ |
| మాటలు | : జంధ్యాల |
| పాటలు | : వేటూరి సుందరరామమూర్తి |
| నేపథ్యగానం | : యస్.పి.బాలు, ఎస్.జానకి, యస్.పి.శైలజ |
| రికార్డింగ్ | : పాండు (ప్రసాద్ స్టుడియో) |
| రీరికార్డింగ్ | : రాజ్‌గోపాల్ (ఎ.వి.ఎం) |
| డబ్బింగ్ | : మూర్తి (సుజాత డబ్బింగ్ థియేటర్) |
| ఔట్‌డోర్ యూనిట్ | : శారద ఎంటర్‌ప్రైజెస్ |
| ప్రాసెసింగ్ | : ప్రసాద్ ఫిల్మ్ లేబోరేటరీ |
| స్టూడియోస్ | : అరుణాచలం, వాహిని |
| పబ్లిసిటీ డిజైన్స్ | : గంగాధర్, పాణి, సోమ |
| ప్రెస్ రిలేషన్స్ | : ఐ.అర్జునరావు |
| పబ్లిసిటీ | : లక్ష్మీ పబ్లిసిటీస్ |
| పోస్టర్ ప్రింటింగ్ | : నేషనల్ లితో ప్రింటర్స్ |
| రేడియో పబ్లిసిటీ | : క్రియేటివ్ కమర్షియల్స్ |
| కళ | : తోట తరణి |
| మేకప్ | : ముందూరి సత్యం, సుందరమూర్తి, వెంకటేశ్వరరావు, చిరంజీవిరావు, బాబు |
| దుస్తులు | : కె.సూర్యారావు |
| కమల్‌హాసన్ కాస్ట్యూమ్ డిజైన్ | : వాణీ కమల్‌హాసన్ |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : రామానందం, కె.సత్తిరాజు, మాణిక్‌రావు |
| సౌండ్ రికార్డిస్ట్ | : రాఘవాచారి |
| అడిషనల్ ఆపరేటివ్ కెమెరామెన్ | : జ్ఞానం |
| సౌండ్ ఎడిటర్ | : డి.రామస్వామి |
| అసోసియేట్ | : కె.వి.రామకృష్ణారావు |
| సహాయకుడు | : ఎ.భాస్కర్ |
| సహాయ దర్శకులు | : కావూరి సాంబశివరావు, వెలగపూడి చంద్రశేఖర్, గీతాకృష్ణ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ | : వి.జగన్మోహనరావు, పి.రాజ్‌గోపాల్ |
| నృత్యాలు | : శేషు, రఘు, గోపికృష్ణ |
| సహాయకులు | : కుమారి, బీరు కృష్ణ, జయంతి |
| అడిషనల్ ఫోటోగ్రఫీ | : పి.ఎల్.రాయ్ |
| సహ నిర్మాతలు | : తాడి రామకృష్ణ, తాడి హరిబాబు, తాడి బాబ్జి, |
| సహకార దర్శకుడు | : నండూరి విజయ్ |
| కూర్పు | : జి.జి.కృష్ణారావు |
| స్టిల్స్ | : సత్యనారాయణ |
| సహాయకుడు | : కె.రాజేంద్రప్రసాద్ |
| కలర్ స్టిల్స్ ప్రింటింగ్ | : జిఎల్ఓ కలర్ ప్రాసెస్ |
| ఛాయాగ్రహణం | : పి.ఎస్.నివాస్ |
| సంగీతం | : ఇళయరాజా |
| నిర్మాత | : ఏడిద నాగేశ్వరరావు |
| **దర్శకత్వం** | **: కె.విశ్వనాథ్** |



# బాలు గారికి జన్మదిన శుభాకాంక్షలు



మీ పాట విని ఆనందించే
నా లాంటి అభిమానుల జీవితాల్లోంచి
ఓ పాట కాలాన్ని తగ్గించి
మీ ఆయుష్షుకు జత చేసి
మీరు వెయ్యేళ్ళు పాడుతూ ఉండాలని
సదా ఆకాంక్షించే...

మీ వీరాభిమాని
**శివనాగేశ్వరరావు**



